# ఆధ్యాత్మిక దర్పణం







కొమ్మూరు ఉమాప్రసాద్

# ఆధ్యాత్మిక దర్పణం

(విశాఖపట్నం పోర్టు ట్రస్టు వారి ఆర్థిక ప్రోత్సాహము చేత
ఈ పుస్తకము ముద్రించబడినది)



సంకలనకర్త

కొమ్మూరు ఉమాప్రసాద్

దినకర్ ప్రచురణలు
విశాఖపట్నం—530 008.

ప్రథమ ముద్రణ
శుక్ల వైశాఖ — మే. 1989.

ప్రతులు : 1000



ముఖచిత్రాలంకరణ : శ్రీ బాలి

ముద్రాపకులు : శ్రీ కృష్ణా ప్రింటర్సు
నవోదయకాలనీ
విజయవాడ-520 010

ప్రాప్తిస్థానం :
శ్రీమతి కె. కనకలత
దినకర్ ప్రచురణలు
G-2 సాంబమూర్తి నగర్
విశాఖపట్నం-530 008

నవోదయా పబ్లిషర్సు
ఏలూరురోడ్డు
విజయవాడ-520 002

బుక్ సెంటర్
మెయిన్ రోడ్డు
విశాఖపట్నం-530 001

వెల : రు. 16-00

# ఆలోకనము

మహాపురుషుల సాంగత్యము, వారి శ్రీసూక్తి శ్రవణము, మననము, ఆయర్థముల నాచరించుట యనునవి మానవుడు చేయవలసిన సాధన. శాస్త్రాంతరిగా చదివినా అలోచించినా సజ్జన సాంగత్యము, ఉపదేశము లేనిదే మనసునందలి మాలిన్యములు వదలవు. శ్రీ కొమ్మూరు ఉమాప్రసాద్‌గారు జన్మాంతర సుకృతం వలన తమ జీవనాన్ని సాధన క్షేత్రంగా మలచుకోగలిగారు. ధన్యులు. నామము నందు రుచి గలవారు, జీవితానికి సంకీర్తనమే పరమ పురుషార్థమని దృఢమయిన విశ్వాసముతో ప్రవర్తించేవారు శ్రీ ఉమాప్రసాద్‌గారు. పెద్దల వచనాలనువింటాం- చదువుతాం- పద్యం ఆనందాన్ని అనుభవిస్తాము. అంతే కాని మన నడువడిని దిద్దుకుండికి వాటిని అద్దంలా ఉపయోగించుకునేవారు చాల తక్కువమందియుంటారు. ఎందరో పెద్దల వాక్సుమాల్లో నుంచి రసాన్ని గ్రహించి దాన్ని అనుభవించి అనుభవించిన దాన్ని తన సహచరులకందించడానికి ఏకత్ర సంకలనం చేసిన అధ్యాత్మిక మధుపము మన ప్రసాద్‌గారు. ఎందరో మహాపురుషుల శ్రీ సూక్తులను విని, వాటిని ఒక చోట చేర్చి "అధ్యాత్మిక దర్పణం" అను పేరుతో జిజ్ఞాసువులు తమ మనోగతమయిన లోపములను సరిచేసుకుండికి అందించిన అద్దమే ఈ గ్రంథము. ఎందరో మహానుభావుల సూక్తులిందు చేర్చబడినవి. ఆంగ్ల ఆంధ్రభాషలో నున్న వానిని సేకరించినారు. భిన్నభిన్న సాంప్రదాయములవారు ఒకే రకమయిన భావాలక. అభివ్యక్తం చేసిన సన్నివేశాలు ఇందులో చూడవచ్చును. నామ వైభవాన్ని

నామ సంకీర్తన మహిమను ఎరుంగుటకు ఈ దర్పణము చాలా ఉపకరిస్తుంది. అనుష్ఠానంలో లోపాలను సాధకుడు దిద్దుకుందికి సాయపడతుంది. పెద్దల వాక్యాలనే యథాతథంగా సంకలనం చేసి లోకానికి మహోపకారం చేసిన శ్రీ ప్రసాద్ గారు ధన్యజీవనులు. దీనిని చదివి మీకందించే భాగ్యాన్ని నాకు కల్గించినందుకు కృతజ్ఞుడను. ఈ గ్రంథమును అధ్యాత్మిక సాధకులందరు చదివి ఈ దర్పణము సహాయముతో తమమార్గాన్ని సరిదిద్దుకొని మనస్సును అలంకరించుకొందురు గాక శ్రీ ప్రసాద్ గారికి శ్రీ హనుమ సర్వశ్రేయములను కలిగించుగాత. సర్వాంతరాయములను శమింపచేయుగాక అని ప్రార్థించుచున్నాను.

ఇట్లు

తే 11-11-88 ది.

శ్రీ భాష్యం అప్పలాచార్యులు.

# మనవి

ఓం శ్రీ రామాయనమః

చదువరులకు నమస్కారము. మనస్సునకు హత్తుకునే ఆధ్యాత్మికమైన విషయములు. ఆచరణ యోగ్యమైన విశేషాలు చదివినప్పుడు అటువంటివన్నీ ప్రత్యేకంగా ఒక పుస్తకంలో పొందుపరచితే బావుండునన్న ఆలోచన వచ్చి నా దైనందిన జీవితంలో పనులవత్తిడి వల్ల అశ్రద్ధ చేసేవాడిని. అయితే రామరామ అ భావమునకు అంతరంగములో 'స్వామి' ప్రేరణ కలిగియుండడము వలన తే 13-7-1984ది నాడు యీ ప్రయత్నానికి నాందీ ప్రస్తావన జరిగి తే2-9-1988ది వరకు యీ 'సంకలనయజ్ఞం' సాగింది.

స్వప్రయోజనము కోసం ఉద్దేశించబడిన యీ యజ్ఞం ఆధ్యాత్మిక చింతన గల సన్నిహితుల, పెద్దల సహకారంతో చరకుగా సాగింది. ఆశ్చర్యకరమైన విశేషమేమిటంటే యీ చిన్న పుస్తకములో చేర్చబడ్డ అంశములు అన్నియు, (ఒక్క మా తండ్రిగారి READER'S HARVEST లోని విషయములు తప్ప) సంకలనకర్త వద్దకు సంకలనకర్త కోరకుండ కొందరు భక్తుల ద్వారా చేర్చబడినవి.

మన హిందూమతం అతి ప్రాచీనమైనది. మన సంస్కృతీ మన సాంప్రదాయములూ మహత్తరమైనవి. విశేషించి మన మాతృభూమి కర్మభూమి. మన వేదాలు, ఉపనిషత్తులు మొదలుగునవి లిపి మూలకంగా కాక గురుముఖంగా తరతరాలుగా, యుగ యుగాలుగా ప్రచారమవుతుండేవి 1760లో జర్మను స్కాలర్లు మనదేశం వచ్చి మన విజ్ఞాన సంపదను చూసి ఆశ్చర్యపడి మన పండితులను తీసుకుపోయి వారిద్వారా మన విజ్ఞాన సంపదను వారిభాషలోకి, తద్వారా ఆంగ్ల భాషలోనికి తర్జుమా చేసి ప్రపంచానికి మన గొప్పతనాన్ని చాటారు.

మన ఆధ్యాత్మిక, వైజ్ఞానిక, సాంస్కృతిక సంపద అంతులేనిది, విలువ కట్టలేనిది. కంచికామకోటి పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ జయేంద్ర సరస్వతి స్వాముల వారు సెలవిచ్చినట్లుగా మనదేశ స్వాతంత్ర్య ఉద్యమములో మునిగిపోయి రెండు మూడు తరాలవారు మన సాంప్రదాయాలను, సంస్కృతినీ, ఆధ్యాత్మిక పరిజ్ఞాన మునుపూర్తిగా విస్మరించారు. అందుచేత యీనాటి వృద్ధులకు కూడ వాటి వైభవం తెలియక తమ వారసులకు అవి అందించలేకపోవడం వల్ల యీనాటి వారము పాశ్చాత్యులను అనుకరిస్తూ అవి మనదేశ కాలమాన పరిస్థితులకు యిమడక అయోమయ పరిస్థితులలో జీవనం సాగించుచున్నాము.

ఈ విపత్కర పరిస్థితిని మనం యెదుర్కొని మనల్ని మనం సంస్కరించుకోవాలి. లోకకళ్యాణం కోసం సత్పురుషులు ప్రవచింపగా వాటిని ఎందరో మహానుభావులు పుస్తకముల రూపాలలో భక్తులకందించినారు.

ఆ విధంగా ప్రచురించబడిన 'అమూల్య రత్నములను' కొందరు భక్తుల సహకారముతో భగవత్ప్రేరణ వలన యీ చిన్ని పుస్తకములో చేర్చడము జరిగినది.

ఈ సంకలన యజ్ఞానికి పరోక్షముగా తోడ్పడిన వివిధ పుస్తకముల ప్రచురణ కర్తలకు, లోక కళ్యాణార్థమై సందేశములనిచ్చిన పుణ్యపురుషులకు, భగవత్స్వరూపులకు, ప్రత్యక్షముగా అమూల్యమైన పుస్తకములను అందజేసి ఈ యజ్ఞ కార్యక్రమమునకు దోహదము కలుగజేసిన స్నేహితులకు, పెద్దలకు కృతజ్ఞతాంజలులు.

సంకలన కర్తకు యీ పుణ్యభూమిపై జన్మనిచ్చిన తలిదండ్రులకు, యీ యజ్ఞమునకు పూర్తిగా సహకరించిన సహధర్మచారిణికి కృతజ్ఞతలు తెలుపుకుంటూ గురుదేవులు అంజనేయస్వామి ద్వారా యీ చిన్ని పుస్తకమునకు ప్రేరణ కలిగించిన తండ్రి, దైవము శ్రీ సీతారామచంద్రమూర్తి పాదపద్మములకు యీ పుస్తకమును భక్తితో అంకితం చేసుకుంటున్నాను.

—కొమ్మూరు ఉమా ప్రసాద్.

# కృతజ్ఞతాంజలి....

* ఈ పుస్తక ముద్రణకుగాను ధన సహాయము చేసిన విశాఖపట్నం పోర్టు ట్రస్టు యాజమాన్యమునకూ—

* ఈ కార్యక్రమ నిర్వహణకు ఉత్సాహము, ప్రోత్సాహము లందించి ఆశీర్వదించిన ఆధ్యాత్మిక తత్వగుణ విశేషణ సంపన్నులు పోర్టుట్రస్టు అధ్యక్షులు శ్రీ పి.వి ఆర్.కె. ప్రసాద్ గారికి, పోర్టుట్రస్టు ఎఫ్.ఎ. అండ్ సి.ఎ.ఒ శ్రీ ఎస్ సత్యానందరావుగారికి

* ఈ సన్మార్గ దర్శకులు, గురుతుల్యులా శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలా చార్య స్వామి వారికి —

* ముఖచిత్రాన్ని అందంగా అలంకరించి ఇచ్చిన శ్రీ బాలి గారికి —

* అత్యంత సల్ప వ్యవధిలో అతి సుందరంగా ఈ పుస్తకాన్ని ముద్రించి ఇచ్చిన శ్రీకృష్ణాప్రింటర్స్ అధినేతలు శ్రీ రాజా గారికి —

* విజయవాడలో తమ సలహా, సహాయ, సహకారాలు అందించిన సుప్రసిద్ధ రచయితలు శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మగారికి శ్రీ సైమల్ గారికి—

* నవోదయా పబ్లిషర్స్ అధినేతలు శ్రీ రామ్మోహనరావు గారికి, —

* బుక్ సెంటర్ అధినేతలు శ్రీ వరహాలు చెట్టి గారికి —

* ఈ సంకలనం సమీకరించడానికి ఉపకరించబడిన ఎందరోమహానుభావులు. అందరికీ—

* చివరగా ఈ మొత్తం కార్యభారానికి సర్వం తానె ఐ నిలచిన మిత్రులు సుప్రసిద్ధ కథారచయిత శ్రీ ఏ యశ్వీ రమణారావు గారికీ—

సంకలనకర్త

ఓం

## సర్వ సమర్పణము

కాయేన వాచా మనసేంద్రి యైర్వా
బుద్ధ్యాత్మనావా ప్రకృతేః స్వభావాత్।
కరోమి యద్యత్ సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి॥

భావము : మనోవాక్కాయ కర్మముల ద్వారా జ్ఞానేంద్రియములద్వారా నేనచరించినదంతయు ప్రకృతి స్వభావము. కనుక సర్వము ఆ పరాత్పరునికే సమర్పించుకొనుచున్నాను.

## ఉపకారము

నీవద్ద జ్ఞానం ఉన్నప్పుడు దానితో తమ జ్ఞాన జ్యోతుల్ని వెలిగించుకునే అవకాశం యితరులకు కల్పించు.

**PULLET**
(ఆంగ్ల కవి)

హరిః ఓం

# ఆధ్యాత్మిక దర్పణం

### భగవన్నామము - దాని మహిమ

భగవన్నామము నందు అనంతశక్తియు, అఖండమహిమయు, అపూర్వ సామర్థ్యమును కలవు. హృదయ మాలిన్యము నంతటినీ కడగివైచి భగవద్దర్శన మొసంగ సమర్థమయినది భగవన్నామము.

ఆ పురుషోత్తముని దివ్యనామము ఒక సామాన్య శబ్దమని ఎన్నటికినీ భావింపరాదు. అఖండ మహామహిమలతో, అనంత శక్తిసామర్థ్యములతో, అనుపమ దివ్యభూతులతో, మహత్తర తేజఃపుంజముతో గూడి అద్భుతముగా హృదయ సంచలనము కలిగించు బలిష్టమైన శబ్దతరంగములతో, ఉధృతమైన ఆధ్యాత్మిక వాయువీచికలతో చిజ్జడగ్రంధిని అమాంతముగ ఛేధించు జ్ఞానరూపమారణ యంత్రములతో గూడునది. భగవానుని పవిత్రనామము.

### నాలుగు విధముల రామభక్తులు

జ్ఞాని, జిజ్ఞాసువు, అర్థార్థి, ఆర్తుడు అనబడు నాలుగు విధముల రామభక్తులున్నారు.

ఈశ్వరుని తెలిసి భజించు నారదాదులు జ్ఞానులు.

ఈశ్వరుని తెలియనిచ్చగించు పరీక్షిన్మహారాజు మొదలగువారు జిజ్ఞాసువులు.

కార్యసిద్ధికై ఈశ్వర స్మరణ మొనర్చు సుగ్రీవాదులు అర్థార్థులు.

దుఃఖములో చిక్కుకొని భగవంతుని స్మరించు గజేంద్రుడు, ద్రౌపది మొదలగువారు ఆర్తులు.

### భగవద్భజనము

భగవానుని పూర్ణముగ నెవ్వరును వర్ణింపజాలరు. అయినను ప్రతివారును తమ శక్తినిబట్టి పరమాత్ముని గుణకీర్తనము చేయుచుండవలెను. అట్టిగుణానురూపమగు 'భగవద్భజనము' సాటిలేనిదని సర్వశాస్త్రములు చెప్పును.

రామనామ మహిమ

ర్ + అ + మ = రామ

'ర' కారమగ్నికి, 'అ'కారము సూర్యునికి, 'మ'కారము చంద్రునికి ఉత్పత్తి స్థానములు. ఆ నామము బ్రహ్మ విష్ణు మహేశ్వర రూపము. వేదములకు ప్రాణము.

జయము గూర్చు స్యందనము

'జయము గూర్చు స్యందనము' శ్రీరాముడు విభీషణునితో చెప్పిన విధము-

ఆ యరదమునకు శౌర్యధైర్యములు చక్రములు. సత్య శీలములు దానికి దృఢ ధ్వజ పతాకములు. వివేక, బల, దమ, పర, హితములు గుఱ్ఱములు, క్షమ, కృప, సమత్వములను త్రాళ్ళతో అది జోడింపబడి యుండును.

ఈశ్వర భజనము చతురుడగు సారథి.

వైరాగ్యము డాలు
సంతోషము కృపాణము
దానము పరశువు
బుద్ధి ప్రచండశక్తి
పర విజ్ఞానము కఠిన కోదండము
స్వచ్ఛమగు నచంచల చిత్తమమ్ముల పొది
శమ, యమ, నియమాదులు నానావిధ శిలీముఖములు
విప్ర, గురు పూజ యభేద్య కవచము
విజయము నందుటకు దీనిని మించిన యుపాయము లేదు
ధర్మమయమగు నీరథము గలవానిని జయించు రిపులెచ్చటను లేరు

(శ్రీ గోస్వామి తులసీదాస్ విరచిత రామాయణము తెలుగుసేత శ్రీ దిన వహి సత్యనారాయణ గారి శ్రీరామ చరిత మానసము లోనివి)

మానవ జన్మ

సృష్టిలో మానవజన్మ అత్యున్నతమైనది. పశుపక్ష్యాదుల కంటె మానవునకు విశిష్టతను ఒనగూర్చునది అతని బుద్ధియే। ఈ బుద్ధిని సరిగా వినియోగించి జ్ఞానము నార్జించుటే మానవుని ముఖ్యకర్తవ్యము. దీనిని మరచి ఆహార, నిద్రా మైథునము లందే కాలము గడుపుతూ జ్ఞానోపార్జన చేయక అధమంగా జీవించుచున్నారు.



(శ్రీ శిష్టా సుబ్బారావు M. A. రచించిన 'శ్రీమద్భగవద్గీతా' గ్రంథము లోని ఉపోద్ఘాతము లోనిది—శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారి ప్రచురణ)

ఉపనిషత్సారములు - 1

ఈ సృష్టికంతకు ప్రభువు ఈశ్వరుడే। ఆయన సర్వవ్యాపి. అందరి మానవుల హృదయములలో కూడ నున్నాడు. ఆయన స్వరూపమే ధర్మము. ఆయన పేరే సత్యము. ధర్మమే సత్యము. ధర్మముకన్న గొప్పది లేనేలేదు.

ధర్మము పక్షము నవలంబించిన వాడెట్టి బలహీనుడైనను, అధర్మ ప్రవర్తన గల గొప్ప బలవంతుని ఓడించగలడు. ధర్మపక్షమున పోరాడువానికి జయము తప్పదు. ఇది ఈశ్వర శాసనము।

ఉపనిషత్సారములు - 2

ఎవడునూ, తాను చేసిన అధర్మ కార్యములకు శిక్ష తప్పించుకొనజాలడు. ప్రభుత్వమాతనిని శిక్షించకపోయిన ఈశ్వరుడైనను శిక్షించును. ఈ జన్మలో గాకపోయినను, మరియొక జన్మలోనైనను తగిన శిక్ష కలుగును. దుఃఖము కలుగును. అతనికి చెడుజన్మ కలుగును. అటులనే ధర్మమైన పనులు చేసేవానికి సుఖము కలుగును. ఈశ్వరానందము కలుగును. అతను మంచిజన్మ యెత్తును. ఇటుల ప్రతీ మానవుడు తన యొక్క బాగోగులకు తానే కర్తగా చేయబడినాడు. ఇది కర్మ సిద్ధాంతము.

జీవాత్మ

"నిత్యశ్శాశ్వతోఽయం పురాణో
నహన్యతే హన్యమానే శరీరే"

మనుష్యుని శరీరము చంపబడినను లోపలి జీవాత్మ చంపబడదు. ఆ జీవాత్మ శరీరము వదలి పోవుటయే శరీరమునకు మరణము. జీవాత్మ ఎల్లప్పుడును ఉండునది, శాశ్వతమైనది, సనాతనమైది.

(అని యమధర్మరాజు జవాబు చెప్పెను)

శరీరము—జీవాత్మ

ఆత్మానగ్ం రథినం విద్ధి శరీరం రథమేవతు
బుద్ధింతు సారథిం విద్ధి, మనః ప్రగ్రహమేవచ

(ఈ జీవయాత్ర చేయుటలో) శరీరము అను రథము మీద జీవాత్మ అను రథికుడు ఎక్కి ఇంద్రియము లనెడి గుఱ్ఱములను రథము నకు కట్టి తన మనస్సనెడి పగ్గముతో వాటిని లాగుచు తన బుద్ధియనెడి సారథితో రథమును తోలించు చున్నాడు (అని తెలుసుకొనవలెను అని యమ ధర్మరాజు జవాబు చెప్పెను)

ఉపనిషత్సారము—3

ఆనన్దో బ్రహ్మేతి వ్యజానాత్
ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే
ఆనన్దేన జాతాని జీవన్తి
ఆనన్దం ప్రయన్త్యభి సంవిశన్తీతి

(తైత్తిరీయ, భృగు. షష్ఠ)

ఈశ్వరుని 'సత్', 'చిత్', 'ఆనందం' అని ఉపనిషత్తులు చెప్పినవి. 'శాశ్వతమైన సత్యము,' 'జ్ఞానము', 'ఆనందము' అని చెప్పినవి. ఈ విశ్వ మంతయు (ఈశ్వరుని) ఆనందములో జన్మించి, ఆనందములో వృద్ధి చెంది, జీవించి యుండి ఆనందములో లయమగు చున్నదని పై మంత్రము చెప్పుచున్నది.

ఆనందము—సుఖము

ఆనందము సుఖముకంటె చాల ఉత్కృష్టమైనది. సుఖము ఇంద్రియ లోలత్వమై, కల్మషమై, క్షణ భంగురమై, దుఃఖ భూయిష్ఠము కావచ్చును. ఆనంద మటుల గాక కల్మష రహితమై, పరిశుద్ధమై, శాశ్వతమైయున్నది. మానవుడు (జీవుడు) స్వభావము చేత ఆనంద మయుడు. జీవితము సహజముగా ఆనందముతో కూడినది. అందువలననే ప్రతీ జీవికిని ఎట్టి కష్టములు కలుగు చున్నను జీవించ వలెనను కోరిక స్వభావముగ నుండును. సృష్టియొక్క సౌందర్యము, పవిత్రమైన ప్రేమ, జ్ఞానసంపాదనము, మధురగానము, శిల్పము చిత్తరువులు, కవిత్వము మొదలగు లలితకళల యుపాసన మానవునికి ఆనందమును కలుగ జేయుచున్నవి. ఈశ్వరుడనెడి వీణాగానములో జీవుడొక మధుర శ్రుతియగుటకు ప్రయత్నించవలెనని ఉపనిషత్తులు శాసించు చున్నవి. కాని మానవుడు ఇంద్రియలోలుడై, దురాశాపరుడై దుష్టచింతన గలవాడై, స్వల్ప సుఖములను కోరి తాపత్రయములలో చిక్కుకొని ఆనందమును కోల్పోయి దుఃఖమును పొందుచున్నాడు.



పునర్జన్మ—మోక్షము

యోని మన్యే ప్రపద్యన్తే
శరీర త్వాయ దేహినః
స్థాణు మన్యేఽను సంయన్తి
యథా కర్మ యథా శృతమ్.

వారి వారి కర్మల ననుసరించియు, వారి వారికి కలిగిన జ్ఞానమునను సరించియు కొందరు జీవాత్మలు శరీరమును పొందుట కొరకు పునర్జన్మ లెత్తుచున్నారు. మరి కొందరు జీవాత్మలు స్థావర భావమగు మోక్షమును పొందుచున్నారు. (పునర్జన్మ నుండి ముక్తిని పొందు చున్నారు)

మంచి జన్మలు... హీన జన్మలు

పుణ్యేన పుణ్యం లోకం నయతి
పాపేన పాపం.

జీవాత్మ పుణ్య కార్యములు చేసి మంచి జన్మలను, పాప కర్మములు చేసి హీన జన్మలను పొందుచున్నది.

జీవాత్మ శరీరమును వదలిపోవుట

(బృహదారణ్యక 4-4-2)

తేజోవంతమైన హృదయాగ్రము నుండి జీవాత్మ, శరీరము యొక్క కంటి నుండిగాని, శిరస్సునుండి గాని, శరీరము యొక్క యితర భాగముల నుండిగాని బయటవెళ్ళిపోవును జీవాత్మ శరీరమును విడిచి వెళ్ళినపుడు దానితో కూడ ముఖ్య ప్రాణము,యితర ప్రాణములు పోవును. అపుడు జీవాత్మ అహంకార, మమకారములతో పోవును. ఆ అహంకార మమకారములకు అనుకూలమైన నూతన శరీరములో జీవాత్మ ప్రవేశించును. జ్ఞానము, కర్మ, వెనుకటి అనుభవము జీవునితో కూడ పోవును.

త్యాగమయ జీవిత మహాయజ్ఞము

పరమాత్మను పొందుట కొఱకు చేయబడు త్యాగమయమైన జీవితమే యీ మహాయజ్ఞము. ఇంద్రాది దేవతల అనుగ్రహమును పొంది స్వల్ప సుఖములను సంపాదించుటకై పశ్వాదులను చంపి యజ్ఞయాగాదులను గావించుట హీనమైనదని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. ఉపనిషత్తుల ప్రకారము యజ్ఞమనగా త్యాగము. పరమాత్మ యొక్క ప్రీత్యర్థము మాతృదేశము యొక్కయు, మానవకోటి

యొక్కయు, సేవలో సంపూర్ణత్యాగము గావించు జీవితమును నడపుట, ధర్మస్వరూపుడగు పరమేశ్వరుని యొక్క యుద్దేశ్యమైన ధర్మ సంస్థాపన కార్యములో ఆత్మార్పణము గావించుట యీ మహాయజ్ఞము.

'ఓం'కార ప్రణవము—విశిష్టత

ఓం అనునది 'అ'కారము, 'ఉ'కారము, 'మ'కారము ఈ మూడిటిని ఏకము చేయు నాదరూపమగు అర్ధమాత్ర అను నాలుగు పాదములు గలది.

'అ'కారము మేల్కొనియున్న, జాగ్రదవస్థలో నున్న మానవునికి జ్ఞానము నొసంగువాడు, జాగ్రదవస్థకు ప్రభువు.

'ఉ'కారము స్వప్నావస్థకు ప్రభువు. జీవునికి స్వప్నావస్థకు సంబంధించిన జ్ఞానము నొసంగువాడు.

'మ'కారము సుషుప్త్యవస్థలో జీవునికి పరమానందము నొసంగువాడు.

'నాదరూపము' సుషుప్తి కానిది, మేల్కొన్నది కానిది, స్వప్నములేనిది అగు యోగావస్థలో అత్యంత మనో నిగ్రహము చేసి కేవలము ఈశ్వరునిమీద మనస్సు నిల్పుట వలన ప్రపంచమును,తన శరీరమును మరచిపోవుచుండెడి యోగసమాధిలో జీవునికి పరమానందము నొసంగువాడనగు పరమాత్మయొక్క నాలుగు స్వరూపములు కలసి 'ఓం' అను ప్రణవము అయినదని ఉపనిషత్తు వర్ణించుచున్నది.

భక్తుడు-భగవంతుడు

భక్తుడు భగవంతుని తనకు తండ్రియనియు, తల్లియనియు ప్రేమించును. శ్రీ రామకృష్ణపరమహంస భగవంతుని తల్లియని యుపాసించియున్నాడు. భగవంతుని ప్రేమించుట అనగా ఆయనను శుష్కస్తోత్రము చేయుటకాదు. ప్రతి దినము భగవంతుని ధ్యానము చేయుటవలనను,ఆయనయొక్క కళ్యాణగుణములను వర్ణించి మననము చేయుటవలననూ, ఆ గుణములలో కొన్నియైనను మానవులలో అలవడుటకు, మనశ్శాంతి, మనోధైర్యము, ఆనందము కలుగుటకును తోడ్పడగలదు.

[కీర్తిశేషులు అయ్యదేవర కాళేశ్వరరావుగారు (Madras Assembly speaker) రచించిన "ఉపనిషత్సారములు" గ్రంథములోనివి.]

లోకశాంతి ప్రార్థన

పూజనీయమైన ఓ దివ్యస్వరూపా ! మా లోపలను, వెలుపలను, మీదను, క్రిందను, అంతటను నిండియున్న ఓ సర్వాంతర్యామీ!

మాలోపల ప్రత్యక్షమునందును యిమిడియుండి మా నేత్రములకు నేత్రము, కర్ణములకు కర్ణము, హృదయములకు హృదయము, మనస్సులకు మనస్సు, శ్వాసలకు శ్వాస, ప్రాణములకు ప్రాణము, ఆత్మలకు ఆత్మవై వెలుగొందు ఓ దేవా! ఓ ప్రేమైక మూర్తీ! నిన్ను తెలుసుకొను భాగ్యము యిప్పుడు యిచ్చుటనే మాకు ప్రసాదింపుము.

ఓ తేజోమయమూర్తీ! తూర్పు పడమరల ఉత్తర దక్షిణముల ఈ విశ్వమందంతటను, అందరును నీ దివ్యతేజస్సును గ్రహింతురు గాక!

ఓ సచ్చిదానందస్వరూపా! ప్రతి మానవ హృదయమునందును, నానాజాతి మధ్యస్థమునందును శాంతి సామరస్యములను ప్రతిష్ఠింపజేయుము.

ఓ దేవా! ఇదియే మా మనః పూర్వకమైన ప్రార్థన.

—ఓంకార మహరాజ్
ఓంకార ఆశ్రమము
తోటపల్లి.

శరీరము

శరీరము అంటే మనకు కనిపించే యీ భౌతిక శరీరము ఒక్కటే కాదు. శరీరములు మూడు రకములు ; అవి భౌతిక శరీరము, సూక్ష్మశరీరము మరియు కారణ శరీరము.

భౌతిక శరీరము ఆకృతి కలిగియుండి జననం నుండి అభివృద్ధి చెందుతూ యవ్వనంతో తొణికిసలాడి చివరికి వృద్ధాప్యంలో కృశించి మరణంతో నశించిపోతుంది.

సూక్ష్మశరీరము ఆకృతిలేక ప్రయాణము చేస్తూ నిద్రలో,కలలో, ఊహాలలో వివిధ అనుభూతులను పొందుతూ మనం చేసిన కర్మలకు శిక్షలను కూడా పొందుతుంది. ప్రాణం పోయిన తరువాత 11(పదకొండు) దినములు ఆ పరిసరములలోనే చరించి తరువాత నశించిపోతుంది. మరణానంతరము కర్మలను ఆచరించకపోయిన శాశ్వతంగా ఆ పరిసరములలోనే ఉండిపోవును.

కారణశరీరము భగవంతునితో సాన్నిహిత్యం కలిగి మనలను ఆ మార్గాన పయనింపచేస్తుంది. దైవసాన్నిధ్యానికి తీసుకొని వెళ్ళగలిగేది యీ కారణశరీరమే. ప్రాణంపోయినతరువాత ముందుజన్మలో మనం చేసుకున్న కర్మల ననుసరించి

సరిగ్గా సంవత్సరమునకు తిరిగి జన్మను పొందుతుంది. అయితే మనం చేసుకున్న కర్మలనుబట్టి జన్మల సంఖ్య తగ్గి దైవసాన్నిధ్యానికి చేసుకుంటాము. మన గమ్యం అదే.

మనకు, దైవ సాన్నిధ్యానికి గల నిర్ణీతమైన దూరం ఒక్కొక్క జన్మలో మనం చేసుకున్న కర్మలను బట్టి పాపములు యెక్కువయితే దూరం యెక్కువవుతూ, హీనజన్మలను పొందుతూ, పుణ్యము యెక్కువయితే ఆ దూరం తగ్గుతూ గౌరవమయిన, ఉత్తమమయిన జన్మను పొందుతాము.

ఆ విధంగా అతి హీనమయిన క్రిమికీటకాదులు, పశుపక్ష్యాదులు, క్రూర మృగములు, సరీసృపములు, జలచరములు, వానర, నర జన్మలను వరుసగా పొందుతూ మానవజన్మ ఒక మజిలీగా ఉంది ఆ జన్మలో మనం చేసుకున్న పుణ్యం ఉంటే తిరిగి ఉత్తమమయిన మానవ జన్మను పొందుతూ గమ్యానికి దగ్గఱవుతాము పాపములు యెక్కువయితే మానవజన్మలోనే అతిహీనమయిన జన్మములు పొందుతూ గమ్యానికి దూరమవుతాము. ఆ విధంగా ఏడు (7) సార్లు మానవజన్మలు పొందుతాము ఇంకా పాపములు యెక్కువయితే నరజన్మలకు ముందున్న హీనజన్మములను పొందుతూ కోట్లకొలది జన్మలతోనే అతిహీనంగా బ్రతుకుతాము.

కాబట్టి ఎన్నరాని జన్మలలో ఎన్నికైన ఉత్తమమయిన మానవజన్మ నెత్తిన మనం మనసా వాచా పైన పేర్కొన్న మూడురకాల శరీరాలూ యేకం కాగా భగవంతుని స్మరిస్తే ఆయనలో విలీనం అవుతాము. (స్వీయానుభూతి)

శివభక్తి

శివుని పూజించు హస్తములు —హస్తంబులు
శితికంఠు కథవిన్న శృతులు—శృతులు
శివ వందనము చేయు శీర్షంబు—శీర్షంబు
ప్రమదేశు కీర్తించు రసన—రసన
చిత్తజారి భజించు చిత్తంబు—చిత్తంబు
దేవదేవు నెఱుంగు తెలివి—తెలివి
శివునకు వలగొన్న పదములు—పదములు
త్రిపురాంతకుని జూచు దృష్టి—దృష్టి



భూతనాధునిపై గల బుద్ధి—బుద్ధి
భర్గమహిమల నుడివిన పలుకులు—పలుకులు
విశ్వనాధుని తెలిపెడు విద్య—విద్య
హరుని యెడ భక్తి కలిగిన నరుడు — నరుడు.

శిరమున గంగ
కరమున త్రిశూలము
సరసను సతి
శిఖపై శశాంకుడు
ఉరమున కపాల హారము
మెడను పన్నగము
మొలపై గజ చర్మము
నుదుటిపై నేత్రము
కలవానికి
ఇవియే మా నమస్కారములు.

(Volume 3 of Father's Readers Harvest)

అమృత ఫలములు

సంసారమనెడి విషవృక్షమునకు
రెండే రెండు అమృత ఫలములు
అవి
కావ్యామృత రసపానము,
సజ్జన సాంగత్యము.

—(జగన్నాథ పండితరాయలు)

రెండవది కష్టసాధ్యమయినను, మొదటిది కృషి ఫలితముగా సులభ సాధ్యము —శ్రీ కొమ్మూరు భాస్కరరావు.

భగవంతుని నీడ

మనం వెలుతురుగా పరిగణించేది భగవంతుని నీడ.

— ప్లేటో
సోక్రటీసు గురువుగారు.
గ్రీకుదేశం.

భూత భవిష్యద్వర్తమానాలు

ఎంత తీయనిదైనా భవిష్యత్తుని నమ్మకు గతించిన భూతకాలాన్ని విస్మరించు. వర్తమానంలో నీ కర్తవ్యాన్ని నిర్వర్తించు లోపల 'హృదయాన్ని' కలిగియుండు, పైన 'ఈశ్వరుడున్నాడు'

—H.W. Longfellow.
ఆంగ్ల కవి.

జీవితం

మృత్యువు శతవ్రక్కలు చేసేంతవరకూ పంచవర్ణాత్మకమైన జీవితం ధవళమైన భగవత్ప్రకాశాన్ని కళంక పరుస్తూనే ఉంటుంది.

SHELLEY.
ఆంగ్ల కవి.

అబద్ధం

పాపకర్మలకు సాధనాలు మెండు.
వాటికన్నిటికీ అటపట్టు అబద్ధం.

O.W. HOLMES.
ఆంగ్ల కవి.

ఇచ్చి-పుచ్చుకోవడము

దైవానికి నిన్ను నువు నిశ్శేషముగా ఇచ్చుకోవడం నేర్చితే, దైవముకూడ నీకు తనకు తాను నిరర్గళంగా ఇచ్చుకోవడం జరుగుతుంది. ఇది నీ అంతరంగంలో అనుభవానికి రాగల విషయం, అనగా జగన్మాత సాన్నిధ్యం నీ అన్నమయ, ప్రాణమయ, మనోమయ, చేతనలలో నీకు స్ఫురిస్తుంది. ఆమె దివ్య ప్రేమ నిన్ను ఆవరించి తన చేతులతో లాలించి పరమ గమ్యానికి చేరుస్తుంది.

—శ్రీ అరవిందుడు.

సహాయం

తమ విద్యుక్త ధర్మం నిర్వహించడానికి సిద్ధంగా ఉండేవారికి భగవంతుని సహాయం ఎల్లప్పుడూ ఉంటుంది.

—T. L. CULOR.



స్వర్గము

పాపం, మృత్యుభయం ఉన్న యీ లోకమే ఆనందమయంగా ఉంటే, అవి లేని స్వర్గం యింకా ఎంత సుఖవంతంగా ఉంటుందోనని భ్రమపడతాం.

కాని పాపం లేనిచోట పుణ్యానికి,
మృత్యువు లేనిచోట అమరత్వానికి
విలువ కనిపించదు.

—రాబర్ట్ మాంట్ గోమరి.
అమెరికన్.

పూజవల్ల ప్రయోజనం

శరీరమునకు ఆహారము ఎటువంటిదో జీవాత్మకు పూజ అటువంటిది. మానవుడు నిత్యకృత్యాలలో విజయం సాధించాలంటే యుక్తాహార విహారుడై యుండాలి.

అదేవిధంగా అధ్యాత్మిక రంగంలో భయభ్రాంతి రహితుడై సహజశక్తి సంపన్నుడు కావాలంటే నియమబద్ధుడై దైనందిన పూజావిధానాలు శ్రద్ధతో నిర్వహించాలి.

పూజ చేయడానికి కాలం అవసరం!
శ్రద్ధతో చేయడానికి చిత్తశాంతి అవసరం!

శ్రీ వసంతరావు వెంకటరావు
Retd Principal, M. R: College-VZM

మానవుని ప్రకృతి

మనిషి ఒకేస్థితిలో ఎల్లప్పుడూ వుండలేడు. సుగుణాలతో సుకృతాలతో దైవత్వం వేపుకైనా వెడుతుంటాడు..............లేదా
అకృత్యాలతో దుర్గుణాలతో అధోగతిలోనైనా ప్రయాణం చేస్తుంటాడు.

COLERIDGE
ఆంగ్లకవి.

బుద్ధ భగవానుని- అష్టదళపద్మం

బుద్ధభగవానుడు ప్రజలకు చూపించిన నూతన మార్గము — 'అష్టదళ పద్మం' అనే మహాసత్యం, అందులోని ఎనిమిది రేకులూ:

1. మాయ అనే పొరని ఛేదించగల జ్ఞానం
2. బుద్ధి తీక్షతతో కూడిన యోచన
3. నిర్మలమైన సత్యవాక్కు
4. నిష్కలంకమైన సౌమ్య ప్రవర్తన
5. ప్రాణికోటి విషయంలో భూతదయ
6. మనో నిబ్బరంతోకూడిన ఏకాగ్రత
7. సృష్టిచైతన్యం పట్ల జీవస్పందన
8. జీవన వాస్తవికత పట్ల నిశితదృష్టి

— THE GIST OF BUDDHISM
గ్రంథములోనిది.

## భారతదేశ శక్తులు

శ్రీరాముని నామము, శ్రీకృష్ణుని ఉపదేశము. ఇవి రెండే రెండు భారత దేశమునకు గల శక్తులు. ప్రపంచ ప్రజలు గుర్తించగలిగినచో ఇవి కేవలము భారత దేశ శక్తులేకాక యావత్ ప్రపంచము యొక్క శక్తులని చెప్పవచ్చును. ఒకటి భగవన్నామము! రెండవది సామ్యయోగ ఉపదేశము!

— వినోబాభావే.

## నామ మహిమ

(నా స్మృతిపథంలో- ఆచంట జానకిరాం)

హరి, రామ మాహాత్మ్యం తెలుసుకొనవలెననే కుతూహలం కల్గిన నారద మునీంద్రునికి బ్రహ్మ అప్పుడే ప్రసవించిన గోదూడను అడిగి తెలుసుకొనమనగా నారదుడు వెళ్ళి ఆ దూడను అడిగిన తోడనే అది హఠాన్మరణము పాలవగా, గోహత్యా దోషము తనను పట్టుకుందని బ్రహ్మ దగ్గర మొఱపెట్టుకోగా తిరిగి బ్రహ్మ నారదుని పోయి అప్పుడే జన్మించనున్న మానవ శిశువుని ప్రశ్నించమనగా నారదుడు జంకు జంకుగా పోయి ఆ శిశువును ప్రశ్నించగా అదియును హఠా న్మరణము పాలయ్యెను. అందుకు నారదుడు మిగుల కించపడుతూ బ్రహ్మతో తనకు శిశుహత్యాపాపము కూడ సంభవించెనని మొఱపెట్టెను. అయిననూ యీసారి పోయి ఒక బ్రాహ్మణ శిశువును అడుగుమని ప్రేరేపించగా చేయునదేమియు లేక మిగుల దుఃఖార్తుడై నారదుడు బ్రాహ్మణ శిశువును ప్రశ్నించగా ఆ శిశువు!



"మహర్షీ! నీ పుణ్యమున గోరూపమున నున్న నేను హరినామ సంకీర్తన విని నంతనే నా జన్మ తరించి మరల మానవ జన్మము దాల్చగా తిరిగి ఆ జన్మనుండి నీ సంకీర్తన ప్రభావము వలన బ్రాహ్మణ జన్మప్రాప్తమై సర్వేశ్వరుని సాయు జ్యమునకు సోపానము నిర్మించు భాగ్యము కలిగినది" అని మహదానందముతో చెప్పగా సంకీర్తనలోని మహత్తును తెలుసుకున్న నారదుడు ఆనందముతో నామ స్మరణ చేసుకుంటూ బ్రహ్మ వద్దకు పోయెను.

## భగవద్భజనకు తగిన వయస్సు

ఓ రామా! రామా! అనే కరుణాభూయిష్టమైన గాంధీగారి ఆక్రందనం, చీరను కోల్పోయే ద్రౌపది పిలుపుగానో, మొసలినోట్లో చిక్కుకున్న గజేంద్రుని ఆర్త నాదం లాగానో మనకు వినపడుతుంది.

ఒకమారు భక్తుడు అనిపించుకునే ఒక పెద్దమనిషి గాంధీగారికి ఒక ఉత్తరం వ్రాశాడు. అందులో యిలా వుంది. 'నాకు రాత్రి ఒక కల వచ్చింది. నాకు కృష్ణుడు కనపడి గాంధీకి కాలం సమీపించింది. కనుక అన్నిపనులు విడిచిపెట్టి భగవద్భజనము మాత్రం చేస్తూ ఉండమని చెప్పవలసిందని చెప్పాడు'

దీనికి గాంధీగారు బదులు వ్రాశారు. 'సోదరా! నేను భగవద్భజనము మర్చి పోను. ప్రజాసేవ చేయడమే నాకు భగవద్భజనము. కాలం సమీపించినది కనుక భగవంతుణ్ణి భజించనా! ఇది చాల వింతగా వుంది. మనం పుట్టిన రోజు నుంచీ మన ప్రాణాలు యమధర్మరాజు గుప్పిట్లో వున్నాయని నా నమ్మకం! అటువంట ప్పుడు భగవద్భజనము చేయడం కోసం ముసలితనం వరకు వేచి వుండటం యెందుకూ? సర్వకాల సర్వావస్థలయందు ఈశ్వర స్మరణ చేయటం అత్యంతవసరం కాదా!

## దైవోపగతుడు

పాండవులు, ద్రౌపది అడవులలో తిరుగుతూ వుండగా యుధిష్ఠిరుడు నిరంత రం భగవన్నామ స్మరణ చేస్తుండడము ద్రౌపది గమనించింది. తమయొక్క కష్ట పరిస్థితి ఆమెకు తెలుసును. కనుక ఆమె 'ఎందుకు మీరు ఎల్లప్పుడూ భగవన్నామ స్మరణ చేస్తారు. బాల్యంనుండి కూడ మీరు దైవాన్ని ఆరాధిస్తున్నారు. అనేక యజ్ఞాలు చేశారు. శాస్త్రవిహిత కర్మలన్నీ ఆచరించారు. కాని ఈనాటి వరకు భగవంతుడు యేమి అనుగ్రహించాడు? న్యాయరీత్యా మీకు రావలసిన సింహాసనం కూడ మీకు

దక్కలేదు. ప్రతిక్షణం ప్రమాదాలకు గురియవుతూ ఈనాడు ఒకచోటినుండీ మరియొకచోటికి తిరగవలసివచ్చింది. ఇప్పటికైనా ఆ భగవన్నామస్మరణ అంటే విసుగుపుట్టలేదా? అని యుధిష్ఠిరుని అడిగింది. అందుకు ఆయన 'ఆ హిమాలయాల వంక చూడు, ఎంత ప్రశాంతగంభీరంగాను ఉన్నాయో! దాన్ని మనం ప్రేమిస్తున్నాం కదా! దానినుంచి ఏదైనా ఆశించి ప్రేమిస్తామా? దాని ఉజ్జ్వల గాంభీర్యమూ, ప్రశాంతత, పవిత్రతల్నిబట్టి దాన్ని ప్రేమిస్తాము. భగవంతుడూ అంతే! అయితే ఆయనది అవధులు లేని మహత్తు! ఆ ఉదాత్త గాంభీర్యము ముందు మరింత ఆనందించడం, దాన్ని మరింత ప్రేమించడం తప్పిస్తే నాకే కోరికాలేదు' అని యుధిష్ఠిరుడు ప్రశాంతంగా సమాధానం చెప్పాడు.

## భక్తుడు

భక్తుడు కావాలనుకుంటే నుదుట నామాలు, తులసి, రుద్రాక్షమాలలు ధరించవచ్చు. పూలతో పూజలు చేయవచ్చు. కాని ఇవే భక్తికి నిదర్శనములు కావు.

ఎన్నడూ యెవ్వరిని గురించి అసూయపడనివాడు; అహంకారం వర్జించినవాడు; స్వార్థరహితుడు; శీతోష్ణములందు, సుఖదుఃఖములందు సమత్వము కలవాడు, క్షమాగుణము కలవాడు; నిత్యతృప్తుడు; దృఢమైన విశ్వాసములు కలవాడు; మనోవాక్కాయములను భగవదర్పితము చేసినవాడు; ఎవ్వరినీ భయపెట్టనివాడు; తాను యెవ్వరికీ భయపడనివాడు; స్వాతిశయము-చింత, భీతిలేనివాడు; పరిశుద్ధుడు, కర్మ చేస్తున్నా దానికి బద్ధుడుకానివాడు; కర్మఫలమును మంచిగాని, చెడుగాని త్యజించేవాడు; మిత్రులను శత్రులనూ సమదృష్టితో చూసేవాడు; ఏకాంత ప్రశాంతతలను ప్రేమించేవాడు; సుశిక్షిత, హేతువాద బుద్ధిమంతుడు-నిజమైనభక్తుడు. గాంధీజీ తన జీవనరథాన్ని గీతా ప్రతిపాదితమైన ఈ లక్ష్యానికి మరల్చాడు.

-VINDENT SHEEN.

## శుష్క వేదాంత చర్చ

ఒక ప్రియునికి తన ప్రేయసి లేఖ వ్రాసింది. 'క్లిష్ట పరిస్థితిలోనున్నాను. నీవు అర్ధరాత్రివేళ, అతి జాగ్రత్తగా, నిర్మానుష్యమైన దారిలో, నిర్దిష్టమైన సంకేత స్థలము చేరినచో నేను నీకు దక్కను.' అని దానిని అతి గారాబంగా చదువుకొని ఉవ్విళ్ళూరుతూ యీ శుష్కప్రియుడు ఆ లేఖను పలుమార్లు చుంబించి పదిలముగా తన దిండు క్రింద పెట్టి హాయిగా నిద్రపోయాడుట. తెల్లవారేసరికి పర్యవసానం విషమించింది. ప్రియురాలు పరాధీనమయిపోయింది, తల్లిదండ్రుల ఒత్తిడిలో పడి. కావున శుష్క వేద పారాయణములు, వేదాంతచర్చలు నిరుపయోగము, నిరర్థకము. త్రికరణశుద్ధిలోపించినప్పుడు నిష్ఫలమగును.

- శ్రీ అరవిందులు.



## సంఘసేవ:

నువు భగవంతుణ్ని ప్రేమిస్తే చాలదు. భగవంతుడు నిన్ను ప్రేమించేటట్లు నడుచుకోవాలి. అయితే భగవంతుడు మెచ్చే కర్మలేవి? భజనలు, పూజలు, వ్రతాలు, క్రతువులు-యిలాంటివేనా? ఈ సత్కర్మలన్నీ మనం దైవాన్ని ప్రేమించడానికి నిదర్శనాలు. మనం దైవాన్ని మెప్పించడం యెలాగ? 'అబూబెన్ ఏడమ్' కథ మనకు ఆదర్శం!

అబూబెన్ ఏడమ్ మతగ్రంథాలు చదవడు. నమాజు చేయడు. మసీదుకు వెళ్ళడు. మత సంబంధమైన ఉత్సవాలలో పాల్గొనడు. తోటి ముస్లిములు యితన్ని నాస్తికునిగా జమకట్టి నిరసించేవారు. అయితే అబూబెన్ ఏడమ్ కష్టాలలో వుండే తోటి ప్రజలకు శక్తివంచన లేకుండా సేవ చేసేవాడు.

ఒకరోజు రాత్రి స్వప్నంలో ఒక దేవదూత కనపడింది. ఆమె పుస్తకంలో యేదో వ్రాసుకుంటూంది. అబూ ధైర్యంగా 'ఏమిటి వ్రాస్తున్నావు' అని అడిగేడు. 'దేవుణ్ని ప్రేమించేవారి జాబితా' అంది ఆమె. 'అందులో నాపేరు వుందా' అని అడిగాడు. చిరునవ్వుతో లేదని తల ఆడించింది. అతనాశ్చర్యపడలేదు.

మర్నాడు స్వప్నంలో అదేదూత మళ్ళీ యేదో వ్రాస్తూ కనబడింది. 'ఇంకా యేమిటి వ్రాస్తున్నావు?' అని అడిగేడు. 'ఈసారి భగవంతుడు ప్రేమించిన వారి జాబితా తయారు చేస్తున్నాను' అంది. సంశయంతో 'నాపేరు ఉందా?' అని అడిగేడు 'మొదటి పేరు నీదే' అంది దేవదూత.

ఎంత మహత్తరమైన సందేశం! తనను ప్రేమించకపోయినా, తోటిమానవులను ప్రేమించిన వారిని భగవంతుడు ప్రేమిస్తాడన్నమాట! అందుకే 'మానవసేవే మాధవసేవ' అనీ 'సంఘసేవయే సర్వేశ్వరసేవ' అనీ అంటుంటారు.

—శ్రీ. బి. వి. రమణారావు.
'యుగావతారి బాబా' గ్రంథము.

సనాతన ధర్మము:

దూషణ భూషణములను, సుఖదుఃఖములను, మానావమానములను సహించుకొని కర్తృత్వమును, కర్మఫలమును త్యజించి దైవ నియమమును, శ్రద్ధాభక్తులతో నిర్వహించి ఆనందించుటయే ఈశ్వరసేవయని సనాతన ధర్మము చాటుచున్నది.

ఒక చెవితో ఉపనిషచ్ఛ్రుతి పాద్యబ్రహ్మమును వినుడు. రెండవ కర్ణముతో దీనుల దుఃఖాలాపములను ఆకర్ణించి తన్నివృత్తికై యత్నింపుడు.

"ఒక దృష్టితో బ్రహ్మము ననవరతము దర్శింపుడు రెండవ నేత్రముతో దీన జనుల ఆర్తి నవలోకింపుడు"

ఒక చేతితో ఇహపరధనముల నార్జింపుడు. రెండవ చేతితో వానిని లోకమునకిచ్చుటకు త్వరపడుడు.

ఒక పాదముతో జ్ఞాన విజ్ఞానములను సంపాదించుటకై చరింపుడు. రెండవ చరణముతో వానిని భక్తుల కొసంగుటకై పరుగిడుడు.

ఇట్లాచరించుటే యదార్థమైన తపస్సనియు, ఋషిమతమనియు, సనాతన ధర్మమనియు మఱువకుడు.

—కలియుగ బుద్ధుడుగా పేరు పొందిన
శ్రీ సద్గురు మళయాళస్వామివారి
అధునాతన బోధ

నిష్కలంక హృదయము:

జనులెటుల వర్తించిన మీకు ప్రీతి కలుగునని శ్రీ సద్గురు మళయాళస్వామి వారిని ఒక భక్తుడు అడుగగా ఆయన, 'జనులు విద్య నేర్చుకొన్ననూ, తపస్సు చేసిననూ, భక్తిజ్ఞానము కలిగియుండిననూ యివి యేమియూ నాకు గొప్పగాతోచవు. నిష్కలంక హృదయులై యుండుట కంటె గొప్పది నాకెద్దియు కనిపించుటలేదు. ఇది యొకటి మాత్రమే వారిని నిర్వాణపదములోనికి, నిరతిశయ సుఖములోనికి గొనిపోవును' అని సమాధానమిచ్చిరి.

'వీరహనుమాన్'

శ్రీరామచంద్రుడు అశ్వమేధయాగాన్ని చేసినప్పుడు, ఆ యాగాశ్వాన్ని అనుసరించి లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు వెళ్ళారు.



మణిధ్వజుడనే రాక్షసుడు శివభక్తుడై పరమేశ్వరుడిచ్చిన వరప్రభావముచే అహంభావముతో యాగాశ్వాన్ని బంధించి శివభక్తి మహిమచే లక్ష్మణ, భరత, శత్రుఘ్నులను మాయా యుద్ధములో మూర్ఛ నొందించాడు.

ఈ విషయం తెలిసిన ఆంజనేయస్వామి వీరావేశంతో వెళ్ళి మణిధ్వజుణ్ని యెదుర్కొన్నాడు. ఆంజనేయుని ధాటికి తట్టుకోలేక మణిధ్వజుడు పారిపోయి శివుని శరణు వేడినాడు.

"ఏమిటిది? మణిధ్వజా! కోటిమంది రాముళ్ళు వచ్చినా లెక్కలేదన్నావే! ఒక్క రాముడి బంటును యెదుర్కోలేవా? వెళ్ళు. యుద్ధం చేయి. నీకు నేను అండగా నిలబడతాను" అని శివలింగము నుండి మాటలు వినిపించాయి.

ఆ ప్రకారంగానే నందివాహనం యెక్కి శివుడు మణిధ్వజునికి అండగా యుద్ధరంగంలో సాక్షాత్కరించాడు. హనుమంతుడు శివునితో, "నువ్వు దేవుడివే కావచ్చుకాని నీకు నేను జంకేది లేదు, కాచుకో!" అంటూ సింహగర్జనచేసి శివుడి మీదకు బయలుదేరాడు. నంది బెదిరిపోయి శివుణ్ని క్రిందకు పడతోసి పారిపోయింది. శివుడు సర్దుకొని లేచి హనుమంతునితో, "నా త్రిశూలాన్ని పట్టేశావు, పాశుపతాస్త్రాన్ని నీలో ఐక్యం చేసుకున్నావు. ఇలా చేయడం విష్ణుదేవుడికి ఒక్కడికే సాధ్యం! నువు విష్ణువువా? విష్ణుభక్తుడివా? ఎవరునువు?" అన్నాడు.

"మీ దేవుళ్ళతో నాకు నిమిత్తం లేదు నేను మానవుడైన రాముడిని నమ్ముకున్నవాడిని, కోతినైన నాకు ఆ మానవుడే దేవుడు! బుద్ధికూడ కోతిలాగే అతి చంచలమైనది. నా బుద్ధిని ఏకాగ్రతతో ఉత్తమ మానవుడిమీద నిలిపి, అంతులేని మనోబలాన్ని, సాహస పరాక్రమాల్ని పొందాను. దీన్ని భక్తి అన్నా, లక్ష్యసాధన అన్నా రెండూ ఒక్కటే! లోకకళ్యాణంకోసం నేను నమ్మిన రాముడు చేస్తున్న అశ్వమేధ యాగాన్నియే దైవశక్తీ, యెటువంటి శక్తులూ అడ్డలేవు. శక్తులమని చెప్పే మణిధ్వజుడు లాంటి రాక్షసులుచేస్తున్నదేమిటి? ఇలాంటి అహంకారులకూ, స్వార్థపరులకూ అండగా నిల్చే దేముళ్ళు వుంటేనేం లేకపోతేనేం" అని హనుమంతుడు దిక్కులు దద్దరిల్లేలాగ గద్దించాడు.

ఆ మాటలకు శివుడు నవ్వుకొని లేని కోపాన్ని తెచ్చిపెట్టుకుంటూ, "నా ఫాలనేత్రాన్ని తెరుస్తున్నాను కాచుకో!" అన్నాడు.

'త్వరగా తెరు! నీ భక్తుడికి కూడ కనువిప్పు కలిగించు' అన్నాడు హనుమంతుడు. శివుడు తన మూడోకన్ను తెరవగానే భగ్గున ప్రళయాగ్ని హనుమంతుడి మీదకు దూసుకువచ్చింది. హనుమంతుడు కుడిచేయి చాచి అగ్నిని దోసిట్లో పట్టి ఒకప్పుడు శివుడు హాలాహలాన్ని త్రాగినట్లుగా 'రామార్పణమస్తు!' అంటూ నోట్లో వేసుకొని గుటుక్కున మింగేశాడు.

అప్పుడు శివుడు మణిధ్వజుడిని చూసి, "అంతా చూశావుగా! ఇక నేను చేయగలిగింది యేమీలేదు. హనుమంతుడు ఎవరోకాదు, నా ఆత్మస్వరూపమే! నా అంశతో అవతరించిన అతనిలో నా సర్వ శక్తులూ విలీనమైనాయి. అతని వల్ల భక్తి అంటే యేమిటో తెలుసుకో" అని చెప్పి అంతర్ధానమయ్యాడు.

ఈ లోగా హనుమంతుడు రివ్వున ద్రోణగిరికి వెళ్ళి సంజీవ కరణిని పెళ్ళగించి తీసుకొని వచ్చి, మూర్ఛ పడివున్న లక్ష్మణ, భరత, శత్రుఘ్నులనూ, సైన్యాన్నీ బ్రతికించాడు.

మణిధ్వజునికి కనువిప్పు కలిగింది. హనుమంతుని ముందు మోకరిల్లి అంజలి ఘటించాడు. హనుమంతుడు అతనితో, "మణిధ్వజా! స్వార్థంతో నీ భక్తి యెంత క్షుద్రమైపోయిందో గ్రహించావా? స్వప్రయోజనాల్ని కోరి ఈశ్వరుడిని సేవకుడిగా వినియోగించుకోవడం భక్తి కాదు! జీవకోటి సుఖంగా వుండాలనే యీశ్వర సంకల్పాన్ని నెరవేర్చడమే భక్తి! నీ లాంటి వారివల్ల దేవుళ్ళ పరువు పోతున్నది. భక్తుల మనిపించుకునే స్వార్థపరులనూ, అహంకారులనూ, ఏవగించుకుని మంచి వాళ్ళు నాస్తికులుగా మారుతున్నారు. ఇపుడు నీ అజ్ఞానం తొలగింది కనుక యిక నుండీ ద్వేషం వదలి దైవత్వం అన్నిటిలోనూ ఒక్కటేనని గుర్తుంచుకొని ప్రజలందరి సుఖమే నీ పరమావధిగా పాలించు" అని చెప్పాడు. అప్పుడు మణిధ్వజుడు, "ఆంజనేయ స్వామీ! గర్వం మితిమీరి భంగపడితేనేగాని జ్ఞానం రాదు. నా గర్వం మితిమీరడానికే శివుడు నేను కోరిన వరాలన్నీ యిచ్చాడని యిప్పుడు అర్థం చేసుకున్నాను. గర్వంతో నేను బంధించిన యాగాశ్వం నాకు మేలే చేసింది. జ్ఞానోదయం కలిగించింది. ఇదంతా రాముడి దయ అనుకుంటాను. నేను రాముడి దగ్గరకు వెళ్ళి క్షమాపణ వేడుకొని, నన్ను తన బంధుకోటిలో చేర్చుకోమని అర్థిస్తాను!" అనిచెప్పి యాగాశ్వాన్ని తెచ్చి వినమ్రుడై లక్ష్మణునికి అప్పగించాడు.



యాగాశ్వాన్ని స్వేచ్ఛగా వదలి అందరూ దాని వెంట బయలుదేరారు. వారికి మణిధ్వజుడు ఘనంగా వీడ్కోలు యిచ్చాడు.

(—1978 మేనెల చందమామ)

(FROM A READER'S HARVEST.)

ఉప్పుతిన్న విశ్వాస ప్రభావము

మహాభారత యుద్ధములో భీష్ముడు అర్జునునిచే పడగొట్టబడి అంపశయ్యపై స్వచ్ఛంద మరణ వర ప్రభావము వలన ఉత్తరాయణ కాలము కొఱకు, తన భౌతిక కాయాన్ని విడిచిపెట్టి సద్గతికి వెళ్ళడానికై నిరీక్షిస్తున్న కాలంలో కౌరవ పాండవుల మధ్య యుద్ధము నిలిపివేయబడినది. ఆ సమయంలో భీష్ముడు పాండవులకు బోధిస్తుండగా ద్రౌపది వచ్చి చూసి ఫకాలున నవ్వింది. పాండవులందరూ కౌరవసైన్య మహాసేనాధిపతి అయిన భీష్ముని పట్ల ద్రౌపది అనుచిత ప్రవర్తనకు నిశ్చేష్టులయి కోపోద్రేకులయినారు.

అప్పుడు సర్వజ్ఞాని అయిన భీష్ముడు ఏదో కారణము లేకుండా ద్రౌపది ఆ విధంగా ప్రవర్తించదని వారిని అనునయ పఱచి ద్రౌపదిని దగ్గఱకు పిలిచి ఆమె నవ్వుకు కారణమడిగాడు. అప్పుడు ద్రౌపది యెంతో వినయంగా, 'నిండు పేరోలగంలో ఏకవస్త్రనయిన నన్ను కౌరవులు అవమానిస్తున్నప్పుడు మాట్లాడని మీరు యిప్పుడు యీ స్థితిలో, నిరంతరం ధర్మాన్ని అనుసరిస్తూ న్యాయం కోసం యుద్ధం చేస్తున్న నా భర్తలకు ధర్మాన్ని గురించి బోధిస్తుంటే నేను నవ్వు నాపుకోలేకపోయాను.' అని తలవంచుకొని పలికింది.

అప్పుడు భీష్ముడు చిరునవ్వుతో, "నువు చెప్పింది నిజమే! ఆ సమయంలో నేను దుర్యోధనుని రాజాస్థానంలో ఉద్యోగిగా అతని తిండితో తయారయిన రక్తంతో కలుషితమై పోయాను. నా రక్తంలో అతని భావాలైన స్వార్థం, అహం, నిర్దయ, అధర్మం సంపూర్ణంగా విలీనమై పోయాయి. ఇప్పుడు అర్జునుడు వదిలిన బాణం నాలోనున్న రక్తాన్ని వాటి అవలక్షణాలన్నిటితోను బయటకు తీసుకువచ్చేసింది. ఇప్పుడు నేను ఆ కలుషిత భావాలతో కాక నా సహజ సిద్ధమైన గుణాలతో ధర్మశాస్త్రమును బోధించుటకై తగిన అర్హతలతో ఉన్నాను." అన్నాడు.

(సత్యసాయి కథా సుధ-7)

ఆంగ్లమూలం.

(FROM A READER'S HARVEST.)

మనస్సు-అనే మాత్ర

దురదృష్టములను, చింతలను, కష్టాలను యిచ్చిన భగవంతుడు వాటిని భరించే శక్తిని కూడ మనకు యిచ్చాడు. అంతేకాక 'మనస్సు' అనే మాత్ర ద్వారా వాటిని పోగొట్టుకునే అవకాశం కూడ యిచ్చాడు. ఆ మాత్రను ఉపయోగించుకొని చింతలను మఱచి భవిష్యత్తును గురించి చూడటం మన కర్తవ్యం!

(C. రాజగోపాలాచారి)
రాజాజీ గారి జైలు డైరీ
Dec. 25-1921
FROM A READER'S HARVEST.

భక్తరాజ హనుమాన్

కృష్ణావతారంలో శ్రీష్ణుడు దేవలోకంనుండి పారిజాత వృక్షాన్ని. దేవేంద్రుని జయించి, తీసుకువచ్చి సత్యభామకు యిచ్చాడు. శ్రీకృష్ణుడు ఆ విధంగా తన కోరిక నెఱవేర్చడము వలన శ్రీకృష్ణునికి తనకన్నా ఎవ్వరూ యెక్కువకాదు, తానే గొప్ప అనే గర్వం సత్యభామను ఆవహించింది

అదే సమయంలో విష్ణుమూర్తి వాహనమైన గరుత్మంతుడు కూడ తనకన్నా వేగంగా యెగరగలవారు, విష్ణుమూర్తి సన్నిహితులు లేరనే గర్వాతిశయంతో వున్నాడు.

దేవేంద్రుడు కూడ బాణాసురుని చేతులు ఖండించటముతో దేవతలందఱికీ తానే అధిపతినని, తనను గెల్వగలవారెవరూ లేరనే అహంభావముతో ఉన్నాడు.

జగద్గురువైన శ్రీకృష్ణ పరమాత్ముడు యీ ముగ్గురికీ సరిఅయిన గుణ పాఠం చెప్పి వారి స్థానాలేమిటో వారికి తెలియచెప్పాలనుకొని ముఖానికి విచారం అలుముకొని సత్యభామ వద్దకు వెళ్ళాడు. శ్రీకృష్ణుని విచార వదనం చూసి సత్యభామ వ్యాకులతతో, "నా ప్రభువా! మీ అంతటివారికి విచారించవలసిన అగత్య మేముంది?మీ అర్ధాంగినైన నాతోచెప్పి ఆ బాధను నన్నుకూడ పంచుకోనీండి" అని పలికింది.

అప్పుడు శ్రీకృష్ణుడు, "దేవీ! పెద్దగా విచారించవలసిన విషయమేమీలేదు. నా భక్తుదొకడు నాకు దూరమయిపోవడమే నేను విచారించడానికి గల కారణం. అతడు నాకెంతో సన్నిహితుడు. ఇంకా చెప్పాలంటే ప్రద్యుమ్నునికన్నా (శ్రీకృష్ణ-సత్యభామల సంతానం) సన్నిహితుడు, ప్రియమైనవాడు. ఇన్ని మాటలేల నాయీ శరీరంకన్నా నాకు ఆప్తుడు!" అనగా సత్యభామ, "ఎంత ఆశ్చర్యం! మీకు ప్రియాతి ప్రియమైన నా గురించి కూడ మీరింతగా యెప్పుడూ విచారించటం చూడలేదు. అతని వద్దకు వెళ్దాం పదండి! ఇంతకీ మీ దీవెనలు పొందిన ఆ మహాభక్తుదెవరు? దయచేసి అతనిపేరు చెప్పండి. అతని వివరాలు తెలియజేయండి" అని అడిగింది

అప్పుడు శ్రీకృష్ణుడు, "నాభక్తుని యేకాంత భక్తిని నువు అర్థం చేసుకోలేవు అతనిని యిక్కడికే రప్పిస్తాను, అతనిపేరు, 'హనుమాన్'. అతనొకకోతి. ఇప్పుడు గంధమాదన పర్వతాలలో నివసిస్తున్నాడు అతని హృదయంలో నాకుతప్ప మరెవ్వరికీ స్థానం లేదు. క్రిందటి అవతారంలో నేను రాముడిని' ఆంజనేయుని విశిష్ఠమయిన శక్తివలన నేను రావణాసురుణ్ని అంతం చేయగలిగాను. ఇంద్రజిత్తు మాయాశక్తివలన లక్ష్మణుడు మూర్ఛపోయినప్పుడు, విరక్తితో నేను ఆత్మాహుతి చేసుకుందామనుకున్న సమయంలో ఆంజనేయుడే నాకు పునర్జన్మనిచ్చాడు. అయితే వచ్చిన చిక్కంతా ఆంజనేయుడు కృష్ణుడిగా నన్ను గుర్తించడు, విలువివ్వడు. అతనికోసం రాముడి రూపం నేను దాల్చాలి. అది నేను చేయగలను. నేను ఆలో చిస్తున్నది జానకిగా నువు రూపు దాల్చుతావా? లేక రుక్మిణి దాల్చగలదా? అని" అన్నాడు. అది విని సత్యభామ నవ్వి, "ఇంతేనా? జానకిగా నేను నిలబడతాను, మీ భక్తుడిని రప్పించండి" అని తేలికగా పలికింది.

శ్రీకృష్ణుడు తనవాహనమైన గరుత్మంతుడిని తలుచుకోగానే మరుక్షణంలో అంజలి ఘటించి, వినయంతో శ్రీకృష్ణుని ముందుప్రత్యక్షమయి, 'స్వామీ! ఏమి ఆజ్ఞ' అని అడిగాడు. అంత కృష్ణుడు, "గరుడా! గంధమాదన పర్వతాలకు వెళ్ళి అక్కడ నివసిస్తున్న నా భక్తుడయిన హనుమంతుని వద్దకు వెళ్ళి అతణ్ని నేను చూడాలనుకుంటున్నానని చెప్పు. ఇంకా యిలా చెప్పు. సీతా సమేతంగా రాముడు ద్వారకలో నీకోసం చూస్తున్నాడు అని చెప్పు. చెప్పి వెంటనేరా" అన్నాడు. గరుత్మంతుడు కృష్ణునికి భక్తితో నమస్కరించి వాయువేగ మనోవేగములతో గంధమాదన పర్వతాలకు వెళ్ళి అక్కడ రామనామ సంకీర్తనలో మునిగి తేలుతున్న ఆంజనేయుని చూచి శ్రీకృష్ణుని సందేశాన్ని వినిపించాడు.

ఈ లోగా శ్రీకృష్ణుడు గరుత్మంతుడిని పంపిన వెంటనే దేవేంద్రుని తలచు

కాని అతడు ప్రత్యక్షమవగానే, "ఇంద్రా! నాయింటి వీధిగుమ్మం వద్దవేచి వుండి హనుమాన్ రాగానే అతడిని ఆపి అతడు వచ్చిన విషయం నాతో చెప్పి అతడిని లోపలికి పంపించు" అని చెప్పారు.

సీతాసమేతంగా రాముడు ద్వారకలో తన గురించి యెదురు చూస్తున్నాడన్న వార్తను విని ఆంజనేయుడు ఉబ్బితబ్బిబ్బై వార్తావాహకుడైన గరుత్మంతుడిని తగు రీతిగా సత్కరించి సాదరంగా పంపించాడు. వచ్చినపని అయిపోయిందని గరుడుడు అతివేగంతో కృష్ణుని వద్దకు బయలుదేరాడు. కాని అతను బయలుదేరేసరికి ప్రయాణ సన్నాహాలే చేసుకోని హనుమంతుడు అతను ద్వారకకు చేరుకోకముందే ద్వారకలో శ్రీకృష్ణుని యింటిముందు వున్నాడు. ఇంద్రుని చూడగానే ఆంజనేయుడు, "నాదేవుడెక్కడా?" అని అడిగాడు.

ఆంజనేయుని గొంతు వినగానే శ్రీకృష్ణుడు క్షణాల్లో ధనుర్బాణములతో శ్రీరాముని రూపు దాల్చి సత్యభామ వంక చూశాడు. సత్యభామ యెంత విశ్వ ప్రయత్నం చేసినా సీత రూపు దాల్చలేక సిగ్గుతో తలవంచుకుంది. అప్పుడు శ్రీ కృష్ణుడు రుక్మిణీవంక చూశాడు. రుక్మిణీ మరుక్షణంలో సీత రూపుదాల్చి రాముని ప్రక్కగా నిలచింది.

అసలు వీధి గుమ్మం వద్ద యింద్రుడు ఆంజనేయునితో, "నువు యిక్కడే నిలబడు. నేను లోనికి వెళ్ళి ఆయన అనుమతి తీసుకొని నిన్ను లోపలికి తీసుకు వెళ్తాను" అని చెప్పాడు. ఇంద్రుని మాటలు విని అసహనంతో కోపోద్రేకుడై కళ్ళు రెండూ గుండ్రముగా త్రిప్పుతూ దేవేంద్రుని ఒక్క చేతితో పైకెత్తి గిరగిరా త్రిప్పుతూ, "నా రాముడెక్కడ? నా హృదయ నాధుడెక్కడ?" అని బేజారెత్తి పోయి పిలుస్తున్నాడు. అతను అలా పిలుస్తుండగానే నీలమేఘశ్యాముడైన రాముడు అతని ముందు మెరుపుతో కూడిన మేఘమువలె సీతాసమేతంగా ప్రత్యక్షమయ్యాడు. రాముణ్ణి చూసిన వెంటనే ఆంజనేయుడు ఆనందాతిశయంతో ఉద్భవించిన నీళ్ళుగల కళ్ళతో, మాటలు పోయిన గొంతుకతో, వణుకుతున్న శరీరంతో శ్రీరాముని పాదాల వద్ద అచేతనంగా కూలబడి, "ప్రభూ! నాకింత అదృష్టం కలగడానికి కారణం ఏమిటి?" అని అడిగాడు.

శ్రీ కృష్ణుడు ఆర్తిగా తన భక్తుడిని హృదయానికి హత్తుకొని శిరస్సుపై చేతితో రాస్తూ తన ప్రక్కను కూర్చుండపెట్టుకొని ఒక్క క్షణం మాట పలుక



లేక ఉండిపోయాను. సీత రూపులో వున్న రుక్మిణి ఆప్యాయంతో అందించిన లడ్డులను, యితర భోజ్యపదార్థములనూ, ఆంజనేయుడు ఎంతో ప్రీతిగా భుజించాడు.

అప్పుడు శ్రీకృష్ణుడు, "ఆంజనేయా! ఎందుకో నిన్ను చూడాలనిపించి గరుడిని పంపించాను. నా చిరకాలం వాంఛ తీరింది. ఇంక నువ్వు మళ్ళీ నాకెంతో ప్రీతికరమైన ఏకాంతసేవకు గంధమాదన పర్వతాలకు వెళ్ళు! చిరంజీవివై వర్ధిల్లు!" అని ఆశీర్వదించాడు.

ఆవిధంగా జగద్గురువైన శ్రీకృష్ణపరమాత్మ ఒకేసారి ముగ్గురికి గర్వభంగం చేసి ఆంజనేయస్వామి శక్తి సామర్థ్యాలను లోకానికి విశదం చేసి ఆంజనేయునికీ తనకూ గల ఆత్మీయతను ప్రదర్శించాడు.

ధర్మాన్ని పరిరక్షించడానికీ, భక్తులను కాపాడడానికీ, భక్తరాజు అయిన ఆంజనేయుడు చిరంజీవిగా వున్నాడు.

(ఆంగ్లమూలానికి స్వేచ్ఛానువాదం)
(From A Readers Harvest)

రాగ తాళయుక్తమైన సంకీర్తనము

రాగ తాళయుక్తమయిన రామనామ సంకీర్తనము అపూర్వ శక్తివంతము. ఈ మూడింటి సమ్మేళనము ఆ చుట్టు ప్రక్కల ప్రదేశాన్ని అత్యంత మధురమైనది గాను, అనిర్వచనీయమైన ఆనందము కలిగించు నదిగాను భక్తులను మైమరపించేది గాను తయారు చేయును.

—మహాత్మాగాంధీ.
From. 'A Reader's Harvest

సత్యము

మన జీవిత గమనాన్ని సక్రమమైన, సవ్యమైన దారిలో నడిపించాలంటే 'సత్యము' అనబడే దివ్యజ్యోతినుండి మన ఆత్మజ్యోతులను ప్రేరణ పొందించు కోవాలి.

— మహాత్మాగాంధీ
From. 'A ReaedersHarvest

చరణ కమలములు-మహిమలు

ఏ చరణ కమలములు శివుని హృదయ సరోవరమున సదా శోభించు చుండునో!

ఏ పాదపద్మములను స్మరించిన మాత్రమున సకల కలిదోషములు హరించు కొని పోవునో!

ఏ చరణ స్పర్శచే అహల్య తరించెనో!

ఏ పాదములందు దేవ గంగ అవతరించెనో!

శ్రీరాముని ఆదివ్య చరణములను అలనాడు జనకుడు ప్రక్షాళన చేసి భాగ్య మందెను॥

—తులసీరామాయణము.

ఆ శ్రీరాముని సంతత నామ స్మరణచే కలియుగమున గాంధీ మహనీయ గుణాత్ముడై మానవ కళ్యాణమూర్తిగా విరాజిల్లెను

శ్రీ కొమ్మూరు భాస్కరరావు.

From A Raders Harvest

జీవశక్తి-భగవంతుడు

జీవుని శక్తి అంతయూ కలిసి ఒకటి (×) అనుకొనిన, ఆ ఒక్కటిని అనంతముతో హెచ్చించిన భగవంతుడగును.

From 'A Reader's Harvest

దృశ్య విముఖత్వము-దైవ సుముఖత్వము

శివాలయములో నందికేశ్వరుడు, విష్ణాలయములో గరుత్మంతుడు, రామా లయములో హనుమంతుడు ఏ ప్రకారముగా ఆసీనులై యుందురో చూడుడు.

వారి ముఖములు భగవంతునికి నేరుగా నుండును వారు కొంచెము కూడ వంకరగా కూర్చొనరు. అనగా దృశ్యవిముఖత్వము, దైవ సుముఖత్వము వారి పై భరిలో దృగ్గోచరమగుచుండును. వారి ముఖ పద్మములయందు భక్తి ప్రపత్తులు, వినయ విధేయతలు, ఆధ్యాత్మిక తన్మయత్వము ఉట్టిపడుచుండును ఆ విధముగా వారు కూర్చుండి సర్వజనులకు, 'శాశ్వత సచ్చిదానంద పరబ్రహ్మము నవ లోకించి ధన్యులు కండు' అని ప్రబోధించుచున్నారు.

—గీతోపన్యాసములు.

బ్రహ్మచారి గోపాల్.



నామాపరాధములు

నామ సంకీర్తన చేయుటకు ముందుగా నామాపరాధముల వివరము తెలిసి కొనుట ముఖ్యము. ఒక్కమారు నామోచ్చారణ చేయుటవలననే మహాఫలము కలుగునని శాస్త్రము శాసించుచుండగా, అనంతకాలము నామోచ్చారణ చేసినను ఫలము సిద్ధింపకుండుట అనుభవములో కనిపించు చున్నది. మనకు తెలిసియు, తెలియకయు నామాపరాధము జరుగుచుండుటయే యిందుకు కారణము. ఈ నామాప రాధములను వివరముగ తెలిసికొని, హృదయమున జీర్ణింపచేసుకొని, విశ్వాస ముతో, ఆర్తితో భగవన్నామోచ్చారణ చేసిన దాని ఫలము తప్పక కలుగును.

నామాపరాధములు పది విధములు :-

1) సత్పురుషనింద :- సత్పురుషులవలననే నామము లోకమున ప్రచారము నొందును. కాన సత్పురుషనిందను నామము సహింపదు.

2) శివకేశవులయందు భేద దృష్టి :-శివకేశవుల నామ గుణములను భేద బుద్ధితో చూచుటయు నామమునకు అహితము చేయునట్లే యగును.

3) గురు నింద :- గురువును,ముఖ్యముగా నామోపదేశము చేసిన గురువును నిందించుటయు నామాపరాధమే యగును.

4) శ్రుతి శాస్త్రనింద :- భారతీయ జీవిత విధానమునకు ఆధారభూతములగు వేదములను, ధర్మశాస్త్రములను నిందించుట మహాపరాధము.

5) నామమందు అర్థవాద కల్పన :- శాస్త్రములందు వర్ణితమైన భగవ న్నామ మహిమను సత్యము కాదనియు, ప్రశంసామాత్రమేయనియు తలచుట అర్థ వాదమనబడును. ఇది మిక్కిలి భయంకరమైన అపరాధము.

6) నామబలము నూతగ గొని పాపవృత్తి కలిగి యుండుట :- హింస, ద్యూతము మొదలగు దుష్టకార్యముల నాచరించుచు, నామస్మరణ వలన సర్వ పాపములు తొలగునని తలచుట మహాపరాధము. ఇటువంటివారు వ్రత నియమాదుల చేతను పవిత్రులు కాజాలరు.

7) ధర్మవ్రతాదులయందును, నామమునందును సమదృష్టి :- దాన, ధర్మ, వ్రత, హోమాది శుభకర్మలతో నామమును సమానమని తలచుట నామాపరాధము.

8) విముఖుని యెదుట నామోపదేశము :- విముఖుడు, శ్రద్ధా విహీనుడు వినుచుండగ నామోపదేశమును చేయుటయు అపరాధము.

9) నామమునందు ప్రేమ లేకుండుట :- నామ మహాత్మ్యము వినినను నామమునందు ప్రేమ లేకుండుటయు అపరాధమగును.

10) అహంకార మమకారములను పరమ పురుషార్థములని తలచుట :- అహంకార మమకారాదులనే పరమ పురుషార్థములుగ భావించి నామస్మరణ చేయుచుండుటయు నామాపరాధమగును.

నామాపరాధ మొనరించిన వారల సమస్త దురితములను. నామమే హరించును. గాన నిరంతర నామస్మరణచేతనే సర్వపాపములు తొలగిపోవును. నాలుగు వేదముల (ఋగ్వేద, యజుర్వేద, సామవేద అధర్వణ వేదములు) యధ్యయన ఫలము భగవన్నామము వలనకలుగును.

—శ్రీశ్రీశ్రీ అవధూతేంద్ర సరస్వతి స్వామివారి
భగవన్నామ సంకీర్తన.

భగవంతుని పొందుటకు మార్గములు

మానవ జన్మము దుర్లభము. ఈ జన్మలో మనము దీనిని అహార, నిద్రా భయ, మైథునాదులకు పశువులవలె వినియోగించి తరణోపాయము చూచుకొనుచుండిన, చేత దొరికిన నిధిని పోగొట్టుకున్నట్లు కాగలదు. ఈ మానవ జన్మము మరల వచ్చునను నమ్మకము మనకు లేదు. కావున నీ జన్మమునందే తరించు నుపాయము వెదుకుకొనవలయును. మనమీ జనన మరణ సంసారమునుండి తరించుటకు జనన మరణ రహితుడును, శాశ్వతుడునగు భగవంతుని ఆశ్రయించవలయును.

భగవంతుని ఆశ్రయించుటకు మార్గమెద్ది? 1) కొందఱు నిష్కామ కర్మము ద్వారా ఆరాధింతురు, 2) కొందఱు భక్తి మార్గమునను, 3) మరి కొందఱు జ్ఞాన మార్గమునను 4) అన్యులు ప్రపత్తి మార్గమునను ఆయన నారాధింతురు.

ఏ మార్గము ననుసరించినను ఆయనను పొందవచ్చును. పైన చెప్పిన నాలుగు మార్గములలో ప్రాణరూపముగ నున్నది భగవన్నామము భగవన్నామ సంకీర్తన స్మరణములకు భావము మిక్కిలి సహాయము చేయగలదు. కావున నామ సంకీర్తనము



చేయునపుడు భావము వచ్చుట, భావయుక్తమగు కీర్తనములతో కీర్తించుట వలన పరిపూర్ణత కలుగును.

—శ్రీ కుందుర్తి వేంకట నరసయ్య, బులుసు సూర్యప్రకాశ
శాస్త్రిగార్లచే రచింపబడిన ప్రస్తావన, అవధూతేంద్ర
స్వామి గ్రంథములోనిది.

ఆలయంలో పరమేశ్వరుని దర్శనం ఎలా చేసుకోవాలి?

చాలామంది భక్తులు శివాలయములోనికి వెళ్ళినప్పుడు ముందుగా నందికి నమస్కరించి నంది మీదుగా వంగి గర్భాలయములోనున్న పరమేశ్వరుని చూచి, అప్పుడు గంటకొట్టి పరమేశ్వరునికి నమస్కరించి పూజలు మొదలయినవి చేయించుకుంటారు. ఇలా యెందుకు చేస్తుంటారో మనకు తెలియకపోయినా, అందరూ చేస్తున్నారని మనం కూడ చేస్తుంటాము. ఎందుకు అని తెలుసుకోవలసిన ఆవశ్యకత ఉంది. పరమేశ్వరుడు నిత్యం తదేకదీక్షతో ధ్యానంలో ఉంటాడు. ఆయన ధ్యానానికి భంగం కలిగితే ఆ కోపంలో తన మూడోకన్ను తెరిస్తే యెదురుగా ఉన్న వారు భస్మం అవుతారనీ, లేకపోతే కోరికలు సిద్ధించక పోవడమయినా జరుగుతుందని భక్తులు నమ్ముతారు

పరమేశ్వరుని ధ్యానానికి భంగం కలుగకుండా నిత్యం ఆయనను సేవిస్తూ ఆయనను వదలకుండా ఎదురుగుండా ఆశీనుడై ఆయననే చూసుకుంటూ భక్తిపారవశ్యంలో నందీశ్వరుడు (క్షేత్రపాలకుడు) ఆశీనుడై ఉంటాడు.

అందుచేత భక్తులు మూడుసార్లు ఆలయ ప్రదక్షిణచేసి (ఆ సమయంలో— యాని కానిచ పాపాని జన్మాంతర కృతానిచ, తాని తాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదే! పదే! —అంటూ మననం చేసుకోవాలి) నందీశ్వరునికి నమస్కారంచేసి నందిని ప్రసన్నం చేసుకొని నంది కుడి ప్రక్కను నిలబడి కుడిచేతి చూపుడువ్రేలు, బొటనవ్రేలు నంది రెండు కొమ్ములమీద ఉంచి మన ముఖం శివునికి కనిపించకుండా యీ రెండు వ్రేళ్ళ సందులో నుండి, శివుని చూస్తూ, ఆ సమయంలో ఎడమచేతితో నందితోక దిగువుగా ఉన్న సున్నితమైన ప్రదేశాన్ని తాకాలి మనం ఆ ప్రదేశాన్ని తాకగానే నందికి ఒళ్ళు పులకరించి మెడలోనున్న గంటలు సున్నితంగా, మధురంగా శబ్దం చేస్తాయి. ఆ శబ్దానికి ధ్యానభంగం జరిగినా తనకు పరిచిత

మైన మువ్వల శబ్దంగా గుర్తించి శివుడు తన భక్తుడే శబ్దం చేస్తున్నాడని ప్రసన్నంగా వుంటాడు. అప్పుడు గంటకొట్టి శివుని దర్శనం చేసుకొని సేవించిరావాలి.

ఇటువంటివి తెలుసుకొని చేస్తే మన చర్యలు పరిపూర్ణంగా వుండి మన కోరికలు సిద్ధిస్తాయి.

—స్వీయానుభూతి.

## ఆలయంలో శఠకోపం (శఠారి) దేనికి మన తలమీద పెడతారు?

రామాలయంలోగాని, వేణుగోపాలస్వామి ఆలయంలోగాని, శివాలయంలో గాని, అమ్మవారి ఆలయంలోగాని, ఆంజనేయస్వామి ఆలయంలోగాని మరే ఆలయంలోగాని భగవంతుని దర్శించినపుడు పూజారిగారు మన తలమీద శఠకోపం పెడతారు అందులో విశిష్టత యేమిటి?

కొంతమంది భక్తులు పూజారి శఠకోపం తలమీద పెట్టినపుడు భక్తితో తల వంచి నమస్కారం చేస్తుంటారు. మరి కొంతమంది కనీసం తలకూడ వంచకుండా పూజారిముందు మనం తలవంచేదేమిటి అన్నట్లు నిర్వికారంగా నిలబడతారు. శఠకోపం విశిష్టత తెలుసుకుంటే అలా నిలబడలేము.

మనం ఏవో కోరికలతోనో. భగవంతుని ఆశీస్సుల కోసమో దేవుని దర్శనానికి వెళ్ళి పళ్ళూకాయలు సమర్పించుకొని పూజాలుకూడ చేయిస్తుంటాం.

పూజారి మన గోత్రనామాలతో దేవునికి పూజచేసి మనం తెచ్చిన పళ్ళుకాయలు భగవంతునికి అర్పించి మనకు తీర్థం యిస్తూ శఠకోపం మన తలమీద పెడతారు.

ఆ శఠకోపంమీద భగవంతుని పాదాలు ముద్రింపబడివుంటాయి. మనం అందరం భగవంతుని (విగ్రహం) పాదాలు మన తలతో తాకలేము. అందుచేత శఠకోపం రూపంలో భగవంతుని పాదాలు పూజారి ద్వారా మన తలమీద ఉంచబడుతాయి. మరి అటువంటప్పుడు మనం మామూలుగా ఉండగలమా?

—స్వీయానుభూతి.

## నీవు చేయదగిన సహాయం

అన్ని సమయాల లోను
అన్ని స్థలముల లోను
సర్వ మార్గాల ద్వారా



సర్వ జనావళికి
నీ జీవితాంతం వలకూ
నీవు చేయదగిన సహాయం చేయి

— JOHN WESLEY
(ఆంగ్లానువాదం)

## పితృ కార్యాలు — దైవ కార్యాలు

పితృ కార్యాలు నెరవేర్చేటప్పుడు నొత్తి పంచెలు గాని, నూలు పంచెలు గాని కట్టుకోవాలి. పట్టు పంచెలు కట్టుకోకూడదు.

దైవకార్యాలు నెరవేర్చునప్పుడు మాత్రం పట్టు పంచెలు కట్టుకోవచ్చును. అవి లేనివారు నూలు పంచెలు కట్టుకోవచ్చును.

— శ్రీ కొమ్మూరు భాస్కరరావు

## శ్రీరామ మంత్రం—తారక మంత్రం

పరమేశ్వరుడు నిత్యం జపించేది శ్రీరామ మంత్రమే । ఈ తారకమంత్రం పరమేశ్వరుడు మొట్ట మొదట పార్వతీదేవికి ఉపదేశిస్తూ 'విష్ణు సహస్రనామం' జపిస్తే యెంత ఫలితముండునో శ్రీరామ నామాన్ని జపిస్తే అంత ఫలితము కలుగును. అని చెప్పెను,

ఈ తారక మంత్రం బ్రహ్మదేవుడు నారద మహర్షికి ఉపదేశిస్తే నారదుడు ఒక వేటగానికి ఉపదేశించాడు. ఆ వేటగాడు యీ మంత్ర మహిమ వల్ల వాల్మీకి మహర్షిగా మారి సంస్కృతములో శ్రీ రామాయణ మహాకావ్యం రచించెను.

జటాయువు, శబరి యీ తారకమంత్రం జపించుట వలననే ముక్తిని పొందారు. ఆంజనేయస్వామి యీ రామనామ జపం వలననే శ్రీరామునికి సేవకుడు, మిత్రుడు, ఆప్తుడు అయి చిరంజీవిగా వర్ధిల్లుతున్నాడు.

తులసీదాసు యీ నామ జపము వలననే శ్రీరాముని దర్శించ గలిగి 'రామ చరితమానస' గ్రంథము వ్రాయగలిగాడు.

సమర్ధ రామదాసు 12 సం॥లలో 13 కోట్లు సార్లు యీ మంత్రం జపించి భారతదేశమంతా పర్యటించి ప్రచారం చేశాడు.

"ఎవరైనా, ఏ స్థలంలోనయినా, ఏ విధంగానయినా, ఏదేశంలోనయినా యీ మంత్రాన్ని జపించవచ్చు, లిఖించవచ్చు. ఈ మంత్రం పాపములను నాశనము చేసి ముక్తిని ప్రసాదించును" అని పురందరదాసు తెల్పెను.

శ్రీరామ మంత్రము సకలవేదసారము. ముక్తి మార్గమునకు సాధనము. భక్తితో. నమ్మకముతో స్మరించాలి. శాంతిని, ఆనందాన్ని, భగవద్దర్శనాన్ని ప్రసాదించును.

ఈ మంత్రబలం వలననే భారతదేశాన్ని అహింసా పద్ధతిలో దాస్య విముక్తిని చేయగలిగే మానసిక బలాన్ని మహాత్మాగాంధీ సంపాదించెను.

— సద్గురు కేశవదాస్ జీ.

## మన వేదాలు—మాక్స్ ముల్లర్

ఎంతో ప్రాచీనమైన, మహత్తరమైన మనవేదాలు మొట్టమొదట మన దేశ భాషల్లో ముద్రింపబడలేదు. లిపిద్వారా యివి ప్రచారంలోనికి వస్తే అనామకులు, అర్హత లేనివారి చేతిలో పడి నిష్ప్రయోజనమవుతాయనే భయంతో గురువులు మన వేదాలను అర్హత కలిగిన శిష్యులకు చెప్పేవారు. ఆ విధంగా తరతరాలుగా యీ వేదాలు వంశపారపర్యంగా, గురుముఖంగా శిష్యులకు చెప్పబడేవి. అంతేగాని లిపి ద్వారా వీటిని జాగ్రత్త పరచలేదు.

1760 లో జర్మను పండితులు మనదేశం వచ్చారు. పోర్చుగీసువారు, డచ్ వారు, ఫ్రెంచ్‌వారు ఇంగ్లీషు వారు వచ్చి వ్యాపారాలు చేసి మన సంపదను తీసుకు వెళ్తే,జర్మనులు వచ్చి మన విజ్ఞానాన్ని తీసుకు వెళ్ళారు 1780 లో J Adverd Thomson భగవద్గీత మీద తన అభిప్రాయాన్ని (Comment) వ్రాశారు. అప్పటినుండి జర్మనులు మన ఘనాపాటీలను, ఉద్దండ పండితులను వారి దేశం తీసుకు వెళ్ళి నెలల తరబడి వారిని పోషించి వేదాలను, వాటి సారాలను గ్రహించి వాటిని జర్మను భాషలో వ్రాయించారు.

19 వ శతాబ్దం ఆఖరులో Max Muller అను జర్మను పండితుడు మన వేదాలను జర్మను భాషనుంచి ఆంగ్లములోనికి తర్జుమా చేసెను. ఆయన రోజుకి 17 నుండి 18 గంటల వరకు పనిచేసేవారు. ఆంగ్లాను వాదాలు సుమారు 100 Volumes వచ్చాయి వాటికి పీఠిక (INDEX) 1000 పేజీల గ్రంథంగా వచ్చింది.



"నిష్కామ జీవితం నిర్భయత్వం యిస్తుంది. నిర్భయత్వమే-అమృతత్వం" అని చనిపోయే ముందు (20-10-1900) అన్నారాయన.

## సుఖప్రాప్తికి ఈశ్వరానుగ్రహము

భక్తులారా! ప్రపంచములోని ప్రతీజీవి సుఖమును కోరుకోనుట సహజము. అందులోనూ బుద్ధి ప్రధానుడగు మానవుడు సుఖప్రాప్తిని కాంక్షించుటలో ఆశ్చర్యము లేదు. కాని అడుగడుగునా సంభవించుచున్న కష్టములు, సమస్యలు మానవుని సుఖాపేక్షకు, సుఖప్రాప్తికి అడ్డుతగులుచున్నవి. అట్టి కష్టనివారణకు మహాత్ములు ఈశ్వరానుగ్రహము అవసరమని చెప్పుచున్నారు. కావున ప్రతీ ఒక్కరూ దైవానుగ్రహమునకై నిరంతరము ప్రయత్నించవలెను. జపము, స్తోత్రపఠనము, అర్చన, సంకీర్తన యిట్టివే మనస్సును దైవపరముగా చేసి దైవానుగ్రహమును ప్రాప్తింపచేయు సాధనలు.

ఈ సాధనలు సకామముగా చేసినచో ఐహిక సుఖములు, నిష్కామముగా, ఈశ్వర ప్రీతితో చేసినచో అంతఃకరణ శుద్ధి కలిగి తద్వారా జ్ఞానప్రాప్తి కల్గునని శాస్త్రములు వేనోళ్ళ చాటుచున్నవి.

కావుననే ఆస్తికులగు మానవులెల్లరు వారి వారి సంప్రదాయముల ననుసరించి జప, ధ్యాన, స్తోత్ర పఠనాదులు చేసికొనుట ఆచారమైయున్నది.

— మాతా నిరంజనానందగిరి
శ్రీ ఆత్మ-రామాశ్రమము కొవ్వూరు.
(నిత్యానుష్ఠానము-తొలిపలుకులు.)

## ఉపనిషద్బోధ

సముద్రములో లంగరు పడవేసి ఓడను నడిపిన ఏలాగున పోజాలదో, ఆలాగున దృశ్యమగు సంసార సాగరములో మనస్సనెడి లంగరు పడవేసిన వారికి యెంతగా ధ్యాన జపములు చేసినను ధ్యేయాకారము కలుగుట దుస్తరము. ధ్యానము చేయునప్పుడు దృశ్యమేమియు జ్ఞాపకమునకు రాకూడదు. దేహేంద్రియములన్నిటిని మఱపు చేసికొనవలెను. అనగా చుట్టూ కనిపించెడి ప్రపంచము జ్ఞాపకము రాకూడదు. తాము పురుషులుగాని, స్త్రీలుగాని అనువృత్తికూడ ఉండరాదు. ధ్యానము చేయునప్పుడు దేహస్మృతిగాని, దృశ్యవృత్తిగాని యుండిన మనస్సు యింకను ధ్యేయాకారములోనికి ప్రవేశించుట లేదని గ్రహించవలెను.

సూది రంధ్రములో దారము నెక్కించునప్పుడు యేలాగున చేతులు నిశ్చలముగా నుండవలెనో, ఆలాగున మనస్సు నిశ్చలముగా నున్నవారికే బ్రహ్మ రంధ్రములో అనగా ప్రకృతి రహిత ప్రబోధములో నిలకడకలుగును.

ధనస్సులో శరమునను సంధించువాడు యేలాగున నిశ్చలముగ నుండునో, ఆలాగున ఆత్మధ్యానమందు నిలకడ కలిగి యుండువారే మనస్సను ప్రకృతిన్ దాటి పరమాత్మని పొందగలుగుదురు. అనగా అట్టివానికే అమనస్కము కల్గును. కనుకనే ఉపనిషత్తు యీలాగున చెప్పుచున్నది.

"ప్రణవో ధనుశ్శరోహ్యాత్మా బ్రహ్మతల్లక్ష్యముచ్యతే
అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్."

"ఓంకారమే ధనస్సు, మనస్సే బాణము, బ్రహ్మమే లక్ష్యము. ఆ లక్ష్యమును చేరవలెననిన జీవుడు అప్రమత్తుడై ఏకాగ్ర చిత్తుడై, తదేక నిష్ఠుడై, లక్ష్యమందే మనస్సు సంలగ్నమైనవాడైయుండవలెను."

ఇట్టి ఉపనిషద్బోధను ముముక్షువులు చక్కగా గ్రహించినవారై ప్రణవ స్వరూపుడగు పరమాత్మను నిశ్చల చిత్తులై ధ్యానించుచు బంధ విముక్తిని, పరమానందమును బొందుదురు గాక!

—మహర్షి సద్గురు శ్రీమళయాళస్వాములవారు.
వేదాంతభేరి. జనవరి 1967. సంచిక.

శాంతిగీతము

ఆకసంబున శాంతి వెలుగు గాక!
స్వర్గధామమున శాంతి ప్రతిష్ఠితమగును గాక!
జలములందు శాంతి సుస్థిరంబగుగాక!
పృథ్వియందున శాంతి కీర్తింపబడుగాక!
సకల వృక్షలతా గుల్మములయందు శాంతి
సతతము ప్రవహించును గాక!
సమస్త చరాచరములు శాంతిలో వ్యాప్తింపబడుగాక!
సర్వ గృహముల శాంతి వ్యాపింపబడుగాక!
లోకా సమస్తా స్సుఖినోభవంతు.
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

—ఓంకార మహరాజ్
ఓంకార ఆశ్రమము



## కలి కల్మషనాశన మహామంత్రము

(కలి సంతరణోపనిషత్తు)

కలి సంతరణోపనిషత్తునందు బ్రహ్మదేవుడు. నారదునకు కలికాల దోషములను నిర్మూలించుటకు చక్కని మంత్రమును ఉపదేశించెను. ఆ మంత్రమునే "కవి కల్మషనాశన మహామంత్రము" అని చెప్పుదురు.

అది ఏమనిన "ఓమ్. హరేరామ హరేరామ రామ రామ హరే హరే
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే."

ఈ మహామంత్రము పదునారుఅక్షరములతో గూడియున్నది. దీనినే షోడశాక్షరీ మహామంత్రమనియు అందురు. ఇద్దానిని భక్తి పూర్వకముగ జపించువారికి పాపక్షయమై మహత్తర శ్రేయము కలుగ గలదు. దీనిని మించిన ఉపాయము యే వేదమందును లేదు. ఈ రహస్యమునే యీక్రింది ఉపనిషత్ శ్లోకము నిరూపించుచున్నది.

"ఇతి షోడశకం నామ్నాం కలి కల్మష నాశనమ్
నాతః పరతరోపాయః సర్వ వేదేషు దృశ్యతే."

కాబట్టి ముముక్షువులు శ్రద్ధా పూర్వకముగా పైన తెలిపిన మహామంత్రమును జపించుచు, తదర్థమును మననము చేయుచు, సచ్చిదానంద స్వరూపులగు శ్రీరాముని యెడల, శ్రీకృష్ణమూర్తి యెడల అనన్య భక్తి కలవారై భగవత్కృపకు పాత్రులై తరించుదురు గాక!

—శ్రీ విద్యాప్రకాశానందగిరి స్వాముల వారు.
వేదాంత భేరి, 1967 జనవరి సంచిక.

## ఆంజనేయస్వామికి ప్రియభక్తుని నివేదన

రామాయణగాధ అంతటికీ సుందరకాండ అతి రసవంతమయినది అంటారు. అటువంటి సుందరకాండకు అంద అయిన శ్రీ ఆంజనేయస్వామి చరిత్రను పూజ్య శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి గారు "శ్రీ హనుమచ్చరిత్ర" గా హిందీ భాషలో చాల విపులంగా రచించగా ఆయన ఆదేశించగా డా॥ కె. శివ సత్యనారాయణ MA.Ph.D, హిందీ శాఖాధిపతి, శ్రీ వై. యస్. కళాశాల, నర్సాపురం, గారు

తెలుగులో చక్కగా అనువదించారు. అందులో రచయిత "తను యీ 'హనుమచ్చరిత్ర' గ్రంథము వ్రాయడానికి కారణం ఆయనే అంటూ, ఎవరి చేత 'వారు' ఎప్పుడు ఏం పని చేయించుకుంటారో అతని చేత ఆ పని అదే సమయంలో హఠాత్తుగా చేయించుకుంటారు." అని చెప్తూ, "ఓ పవన తనయా! మీరు ఏ విధంగా ప్రేరేపించారో, ఆ పని మీ ప్రేరణ చేతనే, మీ అనుగ్రహ ఆశీర్వాదాల చేతనే పూర్తయింది. ఇక మీరు ఈ సాంసారిక మాయా మోహాలలో మనస్సు రమించకుండా వుండునట్లు అన్ని వేళల ప్రభు చింతనలోనే సమయం గడచి పోయేటట్లుగా ఆశీర్వదించండి. శరీరం పట్ల అహంకారమూ, సాంసారిం వస్తువుల పట్ల మాయా మమకారాలూ కలుగరాదు." అంటూ ప్రార్థించారు. ఇంకా ఆంజనేయస్వామి గుణాలన్నీ వర్ణిస్తూ,

"ఓ రుద్రావతారుడా! మీరు అందరకూ స్వాములు. ఓ ప్రభువుకు అత్యంత ప్రియుడా! మీరు రాముని ప్రతిరూపులు. ఓ సర్వగత! మీరు రాముని సేవకులు, స్నేహితులు, మిత్రులు, మంత్రులు, వాహనము, షాహుకారు, సైనికులు, సర్వస్వమూను. ఓ జానకీ ప్రియ పాలితుడా! మీరు శ్రీరాముని అంతఃకరణము. సేవకుడు ఎల్లప్పుడు స్వామికంటె శ్రేష్ఠంగానే ఉంటాడు అందుచేత మీరు శ్రేష్ఠతములు. ఓ అంజనా మాత ఆనందాన్ని వృద్ధిచేయు అంజనేయా! మీరు అంజనా మాత గర్భాన్ని సార్థకం చేశారు. ఓ కేసరి తనయా! మీరు కేసరి వానర కులాన్ని పునీతం చేశారు. ఓ పవన తనయా! మీరు వాయువేగాన్ని కూడ తిరస్కరించి, పుత్రుడు తండ్రికంటె కూడ మిన్నగా వుంటాడు, అనే లోకోక్తిని సార్థకం చేశారు. ఓ కపిల కుల కేశరీ! మీరు చంచల వానర జాతి గౌరవాన్ని వృద్ధి చేశారు.

ఓ రామదూత! మీరు లంకను కాల్చి జగజ్జనని జానకి నుండి అనుజ్ఞ తీసుకొని, గుర్తుగా చూడామణిని పుచ్చుకొని, దుఃఖసాగరంలో మునిగి వున్న మీ స్నేహితులను సంతోషపరిచారు. రామునకు సీత సమాచారాన్ని వినిపించి వారిని జన్మ జన్మాంతరాల దాకా ఎప్పటికీ మీకు ఋణపడి వున్నట్లుగా చేశారు.

ఓ సంకీర్తన ప్రియుడా! మీరు మీ రామ కథానురక్తి చూపి భక్తులకు ఒక ఆదర్శ విధానాన్ని చూపించారు. రామకథ జరిగే ప్రతిచోటా అశ్రు విమోచన చేస్తూ ఆ కథను వింటుంటారు. మీరు రాముని ద్వార పాలకులు, జానకి ముద్దుబిడ్డలు, భక్తులకు "ఒకే ఒక ఆసరా". భవసాగరాన్నించి తరింప చేసేవారు.



మీరు దీనులకు సర్వదా రక్షకులు. మీరు మాపై కనికరించండి! అనుగ్రహించండి! మీ అగాధ చరిత్ర సాగరాన్నించి కొన్ని బిందు కణములను తీసుకొని కొంత నటన చేద్దామని అనుకుంటున్నాం. ఈ నటన చేయునట్లు మమ్ములను ఆశీర్వదించండి" అంటూ ఆర్తిగా ప్రార్థించారు.

ఆంజనేయస్వామికి ప్రియమైనవి

మహావీర హనుమాన్ గొప్ప బలవంతుడు. చాల విచిత్రమైన, చాల సరళ స్వభావం గల్గిన సర్వసామాన్య దైవం. విష్ణు భగవానునికి వస్త్రాలు, ఆభరణాలు, పళ్ళు, పూలమాలలు, గంధము, అత్తరు యిలాటివి ఎన్నో అలంకరణ వస్తువులు కావాలి. స్నానానికి పంచామృతాలు, గంధము, దివ్యౌషధులు, మహౌషధులు మొదలగు పెక్కు వస్తువులు కావాలి. కాని మా యీ హనుమంతుణ్ణి దర్శిస్తే చాలు, లడ్డు నివేదన చేస్తే చాలు, పూజ అయిపోయినట్లే! స్నానం చేయించే పనిలేదు. చందన, ధూప దీపాల నిమిత్తం లేదు. వారానికో, పక్షానికో, మాసానికో లేక సంవత్సరానికో ఒక్కసారి ఎఱ్ఱని వస్త్రం అర్పించండి. పూలమాలా, ఫలాలూ మీకు అర్పించాలని వుంటే అర్పించండి. కాని లడ్డూ మాత్రం తప్పని సరిగా కావాలి. అదికూడ శనగపిండితో చేసినవి. పాలకోవాతో చేసినవైనా సరే! లడ్డూ లేకపోతే హనుమంతుడు త్వరగా అనుగ్రహించడు. లడ్డు లేకపోతే శ్రీరాముని ఆదేశాన్ని కూడ తారుమారు చేస్తాడు అంత యిష్టం!

—పూజ్యశ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారి
శ్రీ హనుమచ్చరిత్ర గ్రంథములోనిది.

"బేడీ ఆంజనేయస్వామి"

జగన్నాథపురిని సముద్రుడు ఎప్పుడు తలచుకుంటే అప్పుడే ముంచేస్తున్నాడు. ఇందువలన జగన్నాథునికి చాలా కష్టం కలుగుతుండేది.

ఒకసారి జగన్నాథజీ శ్రీరామునితో నేరారోపణ చేశారు. అప్పుడు శ్రీరాముడు సముద్రునితో జగన్నాథునికి కష్టం కలిగించవద్దని చెప్పితే సముద్రుడు సరేనన్నాడు కాని ఎవరికి ఎలాంటి స్వభావం యేర్పడుతుందో అదిపోదు. అప్పుడప్పుడు సరదా కల్గినప్పుడు పట్టణాన్ని ముంచుతునే వున్నాడు. శ్రీ జగన్నాథస్వామి మరల శ్రీరామునితో ఫిర్యాదు చేశాడు.

అపుడు శ్రీరాముడు హనుమంతుని పిలిచి 'యీ సముద్రుడు జడ స్వరూపుడు, బొత్తిగా వినటంలేదు. నీవు జగన్నాధపురిని రక్షించడానికి సముద్రపు ఒడ్డున కూర్చొని వుండు. ముందుకి పొంగివస్తే బుద్ధి వచ్చేలాగా గదతో గట్టిగా ఒక దెబ్బ కొట్టవలసింది' అని చెప్పాడు.

హనుమాన్ అజ్ఞాపాలకుడు కదా! జగన్నాధపురిలో సముద్రపు ఒడ్డున కూర్చున్నాడు. సముద్రునకు హనుమంతుని బల పరాక్రమాలు తెలుసు! భయం చేత పట్టణాన్ని ముంచడంలేదు.

కాని జగన్నాథపురిలో హనుమంతునికి ఒక గొప్ప యిబ్బంది కలిగింది. జగన్నాధస్వామి అన్నం తింటారు. అన్నమే వారికి ముఖ్య భోజనం. అక్కడ అన్నాన్నే అందరికీ ప్రసాదరూపంలో ఇస్తారు. జగన్నాధుని అన్నానికి జగత్తంతా చేతులను సాచుతుంది. వారిదగ్గర వండీ, వండని అంటూ, ఆచారమూ, ఎంగిలి, అలాంటివి వుండవు. జగన్నాధునికి నివేదన చేస్తేచాలు, అన్నం పవిత్రమౌతుంది దాన్ని ఎవరు తాకినా అంటులేదు. ఎక్కడికైనా తీసుకొని వెళ్ళవచ్చు. హనుమంతునికి అన్నం రుచించడములేదు. మనస్సు విసిగిపోయి రాత్రిపూట మెల్లగా ఎవ్వరికీ తెలియకుండా అయోధ్యకు వచ్చి మనసారా లడ్డులను భుజించి సూర్యోదయము కాకుండాపురికి తిరిగి వచ్చేవాడు.

సముద్రుడు, అవకాశం చూసుకొని ఒకరోజు హనుమాన్ లడ్డులను తిన దానికి అయోధ్యకు వెళ్ళగానే, తనపూర్తి బలాన్ని వినియోగించి పురిని ముంచేశాడు. జగన్నాధస్వామి వెదికించగా హనుమంతుని జాడ తెలియలేదు. ఆయన అయోధ్యలో శ్రీరామునితో తిరిగి ఫిర్యాదు చేశారు. శ్రీరాముడు అంజనేయుని నిలదీసి అడిగితే ఆయన లడ్లు తినటంకోసం తాను రాత్రిపూట అయోధ్యకు వచ్చి శ్రీరాముని కలుసుకోకుండా తిరిగి వెళ్ళిపోతున్నట్లు అంగీకరించారు.

అప్పుడు శ్రీరాముడు జగన్నాధునితో అంజనేయునకు నిత్యం లడ్లు యేర్పాటు చేయమని ఆదేశించి ,అంజనేయస్వామి కాళ్ళకు, చేతులకు సంకెళ్ళు వేయించి సముద్రపు ఒడ్డున బంధించి వుంచారు. జగన్నాధపురిలో నేటికీ ఆయన 'బేడీ హనుమాన్' అనేపేరుతో వున్నారు!

—శ్రీ హనుమచ్చరిత్ర
మూలం:- ప్రభుదత్త బ్రహ్మచారిగారు.
అనువాదం: శ్రీ కె. శివ సత్యనారాయణ



## మహాశివరాత్రి ప్రాశస్త్యము

పంచ భూతాత్మకమైన ప్రపంచాన్ని తనలో లీనం గావించుకొను పరమేశ్వరుని “ఓం నమఃశివాయ” అనే పంచాక్షరీ నామస్మరణ చేసి మోక్షప్రాప్తినందుకునే యీ పర్వదినం (మహాశివరాత్రి) మాఘశుద్ధ చతుర్దశి నాటి రాత్రి వస్తుంది. వానర ప్రాయుడైన నరుని నరోత్తముడిగా మారుస్తుంది. ఈ పండుగ గొప్పదనాన్ని గూర్చి 'స్కాంద పురాణాంతర్గమైన ఈశాన సంహిత'లో 336 అనుష్టుప్పులలో అభిభాషించబడినది.

బ్రహ్మదేముడు ఒకప్పుడు తానే జగత్కర్తనని గర్వించి, పాలసంద్రాన పవ్వళించు నారాయణుని కవ్వించాడు. విరించీ విష్ణుదేవుడు వీరావేశంతో కయ్యానికి కొనసాగించగా లోకాలన్నీ గగ్గోలు పడినాయి. ఆ సమయములో పైన తెలిపే పవిత్ర దినమునాడు పరమేశ్వరుడు అనల స్తంభాకృతిలో అవతరించి వారిద్దరి మధ్య నిలిచి తన మహిమను చూపాడు. వారు ఆ స్తంభపు ఆద్యంతాల నెరుగక, సిగ్గుపడి పరమశివుని ఆధిక్యతను అంగీకరించారు. శివుడు వారికి శివరాత్రి వ్రతం ఉపదేశించి వారిని తరింపజేశాడు. తదాది యీ ఉదంతం ప్రతి సంవత్సరం భక్తులీ నాడు శివరాత్రి వ్రతం ఆచరించి పునీతులు కావటం పరంపరగత ఆచారమైంది.

మహాశివరాత్రి నాడు జాగరణ చేసి శివ నామస్మరణం చేత ప్రతివ్యక్తి స్వీయ సంకటహరణుడై “అభిషేక ప్రియో పరమేశ్వరః” అన్నట్లుగా మహాన్యాసాభిషేకములు చేయించి ధన్యులవుతారు.

సుస్నాతుడై, నూతన వస్త్రాలు ధరించి పార్వతీపతికి పూజలు చేస్తూ శివరాత్రినాడు జాగరణ చేసిన భక్తులను యమదూతలు సైతం చేరలేరని ఈశ్వరార్చన కళాశీలుడైన శ్రీనాధ మహాకవి శివరాత్రి మహాత్మ్య గ్రంథంలో తెలిపాడు.

అఖిలాంగకాల్లో భస్మావలేపనం గావించుకొని, భసితత్రిపుంఢ్రాన్ని ఫాలపట్టికయందుంచుకొని, రుద్రాక్షమాలలు ధరించి,లింగపూజా సక్తమానసుడైన భక్తుడే లింగమాత్మక శివ స్వరూపము.

—ఆంధ్రభూమి దినపత్రిక (8-3-86) 2వ పేజీలో 'సుచంద్ర' చే రచింపబడిన మహా శివరాత్రి ప్రాశస్త్యము వ్యాసములోనిది. (సంక్షిప్త సంకలనము.)

## రామ నామ మహిమ

భగవన్నామము ఆధ్యాత్మిక కల్పవృక్షము. అది మనో మాలిన్యముల విధ్వంసిని. అది పరమ శాంతిని, శాశ్వతానందమును, అనంతజ్ఞానమును, ప్రసాదించును. స్మరణ చేయువారి హృదయములలోనది దివ్యప్రేమను ప్రసరింపజేయును. అది సమస్త ఆనందములకు మూలము. అమృత ప్రసాదినియగు ఆ నామము మీ భయము లన్నింటినీ పోగొట్టి సర్వులకును ఉపశమనమును, పరమ సంతోషము కలుగజేయుగాక!

శ్రీరాముని నామము మధురతమమైన వస్తువుల కంటె మధురతరమైనది. అది శాంతిధామము. పవిత్ర ఆత్మల జీవనమే అది. అది ప్రపంచ వాసలనెడి ప్రజ్వలితాగ్నులను చల్లార్చును నీ హృదయములో నిహితమైయున్న దివ్యజ్ఞానమునది మేల్కొలుపును అది సాధకుని దివ్యానంద సాగరమున స్నానము చేయించును. శ్రీరామునకు జయము! రామ నామమునకు జయము!

ప్రతి వస్తువునందు ఒక్క రాముడు మాత్రమే యున్నాడు ఈ ప్రపంచమంతయు వారి లీల రాముడు లేకుండా ప్రపంచమే లేదు. ఈ విశ్వమంతయు రామమయము. రాముడు లేకుండా ప్రపంచమే లేదు. రాముడు, రామనామము వేరు కాదు.

శ్రీరాముని చేరుటకు సాధన యేదీయన వారి నామమును అనుసరించి అందులోనే లీనమగుటయే. ఏది వేదసాగరమునుండి మథింపబడినదో, ఏది కలియుగమందలి దోషములను తొలగించునో, ఏది సతతము పరమేశ్వరుని జిహ్వయందుండునో, ఏది భవరోగములను పోగొట్టుటకమోఘమైన ఔషధమో, ఏది జానకీ మాతకు ప్రాణము వంటిదో, అట్టి రామనామామృతమును నిరంతరము గ్రోలు పవిత్రాత్ముడు ధన్యుడగు గాక!

శాస్త్రములలో వర్ణింపబడిన పలు విధములైన జపమార్గములలో (లిఖిత జపము) మంత్రము వ్రాయుట శక్తివంతమైనది. అది సాధకుని మనోధారణకు దోహదమొసగి ధ్యానమునకు క్రమముగ గొంపోవును. నైతిక మార్గమున జిజ్ఞాసువుల ఆత్మ వికాసమునకు లిఖితజపము చాల తోడ్పడును. మంత్రము వ్రాయునపుడు మనస్సు, జిహ్వ, చేతులు, కన్నులు మంత్రములో లీనమగుటచే పరధ్యాన



ములు తగ్గి ధారణశక్తి పెంపొందును. మనోనిగ్రహము, శాశ్వత శుభ సంస్కారములు, శాంతి, ఆత్మశక్తి లభించును.

— శ్రీ స్వామి శివానంద.

శ్రీరామ బైండింగు వర్క్సు, సికిందరాబాదు వారి
శ్రీరామకోటి లిఖితపుస్తకములోని పలుకులు.

## సౌరభం:

"లలిత స్కంధము, కృష్ణమూలము, శుకాలాభిరామంబు, మం
జులతా శోభితమున్, సువర్ణ సుమనస్సు జ్ఞేయమున్, సుందరో
జ్జ్వల వృత్తంబు, మహాఫలంబు, విమల వ్యాసాల వాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరువుర్విన్ సద్ద్విజశ్రేయమై"

భక్తికి మారుపేరుగా భాగవతాన్ని చెప్పుకుంటారు తెలుగువారు. దానికి కారణం దానిలో ఉన్న భక్తగాథలే కాదు- బమ్మెర పోతరాజు కమ్మని కవిత్వం. స్వయంగా భక్తుడై భగవన్నామ స్మరణం చేతనే పారవశ్యాన్ని భజించే చిత్తంతో భగవంతుని ప్రేరణతో- భాగవతరచన చేపట్టాడు పోతన్న. కవిత్వం అతనికి కైవల్య సాధనం. కైవల్యం జ్ఞానంవల్లకాని కైవశంకాదు. నిర్గుణమైన బ్రహ్మాన్ని జ్ఞానంవల్ల పట్టుకోవచ్చును. కాని అది సర్వజన సులభం కాదు అందరికీ అందుబాటులో ఉండేది భక్తి! భక్తిమార్గం మధురాతి మధురమైనది. సగుణబ్రహ్మాను సమాహితంతో సాక్షాత్కరించుకొనడానికి అంతకంటె సులభమైన మార్గం మరొకటి లేదు.

భక్తి అనేది ఒక విధమైన చిత్త పరిపాకం ఆకలి అవుతున్న పసిబాల అమ్మ పాలకోసం అలమటించినట్లుగానే మానవుని అంతరాత్మ అఖండ చిన్మయానందం కోసం ఆరాటపడుతుంది. తియ్యని పాలకై తల్లి పాలిండ్లకోసం తడివే పసికూన లాగానే అంతరాత్మ ఆ అనిర్వచనీయానందాను భూతికోసం అన్వేషణ ప్రారంభిస్తుంది. ఆ అన్వేషణలోనే అంతరాత్మ ఎంతో ఎదుగుతుంది.

— డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం డా॥ సి. నారాయణరెడ్డిగారి కమనీయవ్యాఖ్యతో పోతన భాగవతం నుండి మందార మకరందాలు గ్రంథంలోని ముందుమాటలు. యువభారతి వారిప్రచురణ 1973.

పూజ:

మనము పూజల గురించి బోధపరచుకొనుటకు బాహ్యపూజ, మానసపూజ, ఆత్మపూజ అని మూడు విధములుగ భావించవచ్చును.

1. బాహ్యపూజలను గురించి తెలియని వారెవ్వరూ నుండరు. ఏలనన లోకములో ప్రతి మానవుడు దుర్లభమైన మానవ జన్మను పొందగల్గితినని గ్రహించినచో, దైవమును ఏదో విధమైన ఆకారములో పూజించుచు గమ్యస్థానము చేర ప్రయత్నించుచుండును

2. బాహ్యపూజా పురస్కారములను, బాహ్య చిహ్నములను వదలి మానసికముగా తమ యిష్టదైవమును, తమ హృదయస్థానమందో, భ్రూమధ్యముననో, నిరంతరము ధ్యానించుచు ఆదర్శమైన, పరమపావనమైన జీవితములను గడిపెడి మహనీయులను గూడ అచ్చటచ్చట మనము గాంచుచునే యుంటిమి.

3. ఇంక ఆత్మపూజ చేయు మహనీయులు- వీరు చాల అరుదు. వీరే విశ్వపూజ చేయు మహాత్ములు. ఏలనన విశ్వపూజ అనినను ఆత్మపూజ అనినను ఒక్కటే. ఈ పూజకు పుష్పములు, ఫలములు, ధూపదీప నైవేద్యములు అవసరము లేదు. ఈ విశ్వపూజలో హృదయస్థానమును, భ్రూమధ్యస్థానమును మీరి ఆత్మస్థానమునందే బ్రహ్మవిదులు నిరంతరము ఆత్మపూజ అహర్నిశములు సహజముగానే జరుపుచుందురు. లోకములో నున్న పూజలన్నిటిలో ఈ విశ్వపూజయే మహోత్కృష్టమైనది.

— పూజ్యశ్రీ ఓంకారస్వాములవారు.
సందేశ తరంగిణి గ్రంథములో.

దైవమును పొందుటకెంతకాలము పట్టును? :

జన్మలన్నింటిలో మానవజన్మయె ఉత్కృష్టమైనదని చెప్పబడెను. దుర్లభమైన ఈ మానవజన్మ దైవమును పొందుటకే యీయబడినదనిగూడ మహనీయుల చేతను, సద్గ్రంథముల చేతను వక్కాణింపబడెను.

కాని దైవ సంభూతుడైన మానవుడు దైవమును పొందుటకై ఉత్తమమైన మానవజన్మను పొందియు, దైవ పరితాపనతో నిండియుండి తన జన్మకు ఆధారమైన దైవమును తెలిసికొనుటకు బదులు ఒక్క దైవమును తప్ప అమూల్యమైన



వాటినన్నింటిని తెలిసికొనుటకై తన జీవితమునంతటిని అర్పించి పాటుపడుచుండెను.

ప్రపంచములో 'ప్రవృత్తి, నివృత్తి' యని అందలుకు విదితమైన రెండు మార్గములు కలవు. నివృత్తి మార్గము ఆధ్యాత్మిక చింతకలిగిన వారికే తెలియును, గాని ప్రవృత్తి మార్గము సామాన్య జనులందరకును తెలియును,

నివృత్తి మార్గము చాల యిరుకుగాను, రాళ్ళురప్పలు, తుప్పలు, ముండ్లు మొదలగు వానితో నిండి నిర్జనముగా యేకాంతముగా నుండును.

ఇక ప్రవృత్తి మార్గమో? చాల విశాలముగాను, అహ్లాదకరముగాను, కిక్కిరిసి యుండును.

దైవమును పొందుటకెంత కాలము పట్టునో- నివృత్తి మార్గానుసరులైన వారే ఆలోచించెదరు. దైవమును పొందుట కనేక జన్మలు కావలెనని కొందరు చెప్పియుంటిరి. నివృత్తిపరులై సత్యమార్గమున నడచిన ఈ ఒక్క జన్మలోనే దైవమును పొందవచ్చునని మరికొందరు చెప్పిరి కొందరు యోగిపుంగవులు సాధన సంపత్తియు, యోగాభ్యాసము చేసిన పండ్రెండు సంవత్సరములలో దైవమును పొందవచ్చుననిరి కొందరు ఋషీశ్వరులు ఆరు సంవత్సరములనియు, మరి కొందరు మూడు సంవత్సరములనియు, మరికొందరు అనుభవపరులు ఒక్క సంవత్సరము పట్టుదలగా కృషి చేయుచు ధ్యానధారణ సమాధుల నభ్యసించిన దైవమును పొందవచ్చుననియు చెప్పిరి. కొందరు బ్రహ్మవేత్తలు పాలుపండ్లు తీసికొనుచు, కఠినమైన దీక్ష వహించి, నిరంతరము కృషిచేసిన ఆరునెలలలో సమాధిని పొందగలరని నుడివియుండిరి. మరికొందరు మూడు నెలలనియు, ఒక నెలయనియు, పక్షము రోజులలో దైవమును పొందవచ్చునని చెప్పియుంటిరి.

ఇక శ్రీరామకృష్ణులు మూడురోజులు మాత్రమే మానవుడు నివృత్తుడై, బిడ్డ తల్లికై రోదన చేయునట్లు, తాను కూడ దైవమునకై విలపించుచు పాటుపడిన దైవమును తప్పక పొందవచ్చునని, వారి స్వానుభవముతో నుడివి యుంటిరి. ఇంకను కొందరు సమాధి స్థితి ననుభవించిన పురుషులు, మునిపుంగవులు, దైవమును ఏడు ఘడియలలో పొందవచ్చుననియు, మరికొందరు ఒక్క ఘడియలోనే పొందవచ్చుననియు చెప్పియుంటిరి. గృహస్థులకు ఆదర్శ పురుషుడైన శ్రీ జనక

మహారాజా దైవము నెంతలో పొందగలనని శ్రీ అష్టావక్రమునీంద్రుని ప్రశ్నించగా "గుఱ్ఱము నెక్కుటకు రికాబులో కాలుపెట్టి గుఱ్ఱము వీపుమీద నెగురునంత కాలములో దైవమును పొందవచ్చును" అని ఘంటాపథముగా చెప్పియుండెను.

— పూజ్యశ్రీ ఓంకార స్వాములవారు.
'సందేశ తరంగిణి' గ్రంథములో.

దివ్య తేజస్సు

భక్తులకే కష్టములు మెండు అనెదరు. ఏ కష్టములు, పరీక్షలు లేని యెడల అందరు భక్తులుగనే యుందురు ఎన్ని అవస్థలు, పరీక్షలు కలిగినను, దైవ పరితాపనతో నిండియున్నవారే నిజమైన భక్తులు.

ఒక భక్తుడొకప్పుడు బందిఖానాలో నుంచబడెను. నిజమైన భక్తునకు, బందిఖానాయైనను, అంతఃపురమైనను ఒక్కటే కదా! చెర చాలదా యన్నట్లు అతడు చీకటికొట్టులో బంధింపబడెను. అతడు నిజమైన భక్తుడు కనుక చీకటిగదిలో నుంచబడినను, దైవమును గురించియే పరితపించుచుండెను.

విముక్తి, బంధవిముక్తి అందరకును ఎప్పటికైనను కల్గును కదా! అందును సాధకులకు, దైవ పిపాసకులకు ముఖ్యముగా కలుగును. నిజమైన భక్తులు ఖైదు నుండిగాని, చీకటికొట్టు నుండిగాని బయట పడుటకైనను ప్రయత్నింపరు. వారు మాయనుండి, అజ్ఞానాంధకారము నుండి మాత్రమే బయటపడుటకు నెచ్చటున్నను సదా ప్రయత్నింతురు.

మన భక్తునకు ఒకానొక పుణ్యదినమున చీకటి గదిలోనే భగవద్దర్శనమాయెను. దైవమునకై రోదనము చేయుచుండ, ఒక మహా దివ్యతేజస్సు తన ముందు గోడమీదనే ప్రత్యక్షమై క్రమముగా ఆ చీకటి గదియంతయు వ్యాపించి, తనలో ప్రవేశించెనట. ఆ క్షణము నుండి భక్తుని జీవితము మారిపోయెను. బంధింపబడిన ఖైదీ, చీకటిగదిలో చెర పెట్టబడిన భక్తుడు, స్వర్గములో సింహాసనము మీద నున్నట్లే ఆనందింపసాగెను. ఆ దివ్య తేజస్సే అతని పరిపూర్ణ ఆనందము గమ్యస్థానమునై అతని మనస్సంతయు ఆ తేజస్సు నందే విలీనమై అఖండమైన తృప్తిని పొందుచుండెను.

కొంతకాలమునకు ఆ సాధువైన భక్తుడు బంధ విముక్తిని పొందెను. ఖైదు నుండి విముక్తుడైనను, మనస్సు సదా ఆ చీకటి గదిలో గోడమీద ప్రత్యక్షమైన తేజస్సునందే విలీనమై యుండెను. పూర్వజన్మ కర్మచేతనో, దురదృష్టము చేతనో, ప్రాపంచికుల సహవాస దోషముననో, ఏ కారణము చేతనో, అతడు సంసారములోనికి సంఘములోనికి రాగానే ఆదివ్యతేజస్సు మరుగయ్యెను అతడు పరితపించుచు ఎంతవెదకినను, ఎచ్చట వెదకినను మరల కనిపించదాయెను. మన భక్తుడు దుఃఖించసాగెను. దైవ పరితాపనలో హృదయము విలపించసాగెను. ఆ దివ్య తేజస్సు యొక్క పునర్దర్శనమునకై కొట్టుకొనసాగెను దేశాటన ప్రారంభించెను.

కంచి, కాళహస్తి, రామేశ్వరము మొదలైన తీర్థయాత్రలు చేసెను. దివ్య తేజస్సు దర్శనమునకై తిరుపతి కొండలు కూడ నెక్కెను. తాను ఖైదులో నుండగా అనుభవించిన దివ్యతేజస్సును మరల దర్శించుట యెట్లు? కాశీ, ఋషీకేశమేగాక, హిమాలయములందలి గంగోత్రి యమునోత్రి, బదరీ, కేదారము మొదలగు తావులందు ఆ మహాతేజస్సునకై వెదుక ప్రారంభించెను. చివరకు కైలాసము, మానస సరోవరములందు కూడ ఆ తేజస్సు నతడు గాంచలేకపోయెను తిరిగి, తిరిగి నిరాశతో కాళ్ళు యీడ్చుకొనుచు అతి కష్టము మీద చివరకు గృహము చేరెను. తాను బందిఖానాలో నుండగా దర్శించిన దివ్య తేజస్సును ఒక్కమారు దర్శించుటకై పరితాపనతో విలపించసాగెను.

ఒకానొక రోజున అదృష్టముచే ఒక ఆశ్రమమునకు వెళ్ళుట తటస్థించెను. అచ్చట తలనెరిసిన ఒక ముసలి సాధువు తపస్సు చేసుకొనుచుండెను. మన భక్తుడు ఆయన చెంత చేరి ధ్యానము చేయుచుండెను. కొంత తడవైన తదుపరి ఆ తపస్వి కనులు తెరువగా మన భక్తుడు తన చెంతనే కూర్చొని యుండుట చూచెను. అప్పుడు మన భక్తుడు తన వృత్తాంత మంతయు తెలియజేసి తనకు తిరిగి ఆ దివ్య తేజస్సును దర్శించే అవకాశమును కల్గించమని చేతులు జోడించి ప్రార్థించగా, ఆ తపస్వి చిరునవ్వుతో "బిడ్డా! నీవు లోకమంతయు వెదికితివి గాని, ఒక్క తావున మాత్రము వెదుకవైతివి. ఆ అఖండమైన జ్యోతి స్వరూపము, కోటి సూర్యుల తేజస్సుతో ఎచ్చట వెలుగుచున్నదో, ఆ తావునగాక అన్ని తావులందును వెదకితివి దాని వలన యేమి ప్రయోజనము?" అనగా ఆ భక్తుడు తపస్వితో, "తండ్రీ ఆ తావేదియో సెలవిండు" అని వేడుకొనెను. అంతట ఆ వృద్ధ తపస్వి "నాయనా! అది నీ లోనే, నీ పవిత్ర హృదయ స్థానమునందే నిరంతరము వెలుగుచున్నది.

అట్టి దానిని లో చూపుతో చూడ ప్రయత్నించక బైట ఎంత వెదకినను యేమి లాభము!" అనెను శిష్యుడు మరల వేడుకొనగా ఆ వృద్ధ తపస్వి చిరునవ్వుతో నేత్రములు మూసెను. భక్తుడు కూడ అటులనే చేసెను. కొంతసేపటికి అంతయు నిశ్శబ్దముగా మారెను. ఆ పవిత్ర క్షణములలో మాటలు, భావములు, సర్వమూ అదృశ్యమాయెను. మహోపదేశము నిశ్శబ్దములోనే పూర్తి అయ్యెను.

శిష్యుని మనమున చింత, ఆందోళన, తాపత్రయము, పరితాపములన్నియు మాయమై ఆ స్థానమున పరిపూర్ణ సంతృప్తి ప్రకాశవంతమైన నూతన తేజస్సు నిండియుండెను.

ఏ దివ్యతేజస్సును ఆ పవిత్రమైన ఏకాంత స్థలములో గురుసన్నిధిలో అనుభవించెనో, ఆ దివ్యతేజస్సునే అటుపైన కూడ భక్తుడు అనుభవించసాగెను.

ఊరిలో ప్రవేశించినను, తన్ను ప్రేమించెడి వారిలోనూ, ద్వేషించెడి వారిలోను చిన్న వడ్లగింజ లోనూ, ఉప్పు కణికలోనూ, ఏది చూసినను దివ్య తేజస్సునే కాంచసాగెను.

ప్రేమ స్వరూపులారా! దైవపిపాసకులారా! ఇప్పుడు మనము కూడ కొంత తడవు నేత్రములను మూసి లోపల, వెలుపల, అన్ని దిశలయందును, సర్వకాల సర్వావస్థలయందు వెలుగుచున్న కోటి సూర్య ప్రకాశమైన ఆ దివ్య తేజస్సును అంతర్గత దృష్టితో దర్శించెదము గాక!

ఓ దివ్య తేజోరూపమా! లోకములోని జనులందరూ శరీరక భ్రాంతిని విడిచి నిరంతరము నీ ప్రకాశమును అనుభవించెదరు గాక!

లోకాస్సమస్తా సుఖినో భవంతు.

—పూజ్యశ్రీ ఓంకారస్వామి
సందేశ తరంగిణి గ్రంథమునుండి.

సంకీర్తన

ప్రియమైన పాఠకుడా!

దేవుని నామమును గానము చేయుటయే 'కీర్తన' యన బడును. అతని నామమును తలంచుటయే ప్రార్థన లేక ధ్యాన మనబడును భగవత్సాక్షాత్కారమున కియ్యవి సులభతమము, నిశ్చితమము మరియు సురక్షితమములునగు సాధనములు.

ప్రార్థన, కీర్తనలు అమృతపానము వంటివి. కీర్తన అంతరాత్మకు దివ్య



మైన ఆహారము వంటిది ధ్యాన ప్రార్థనలు ఆత్మకు విశ్రాంతి నొసంగును దైవ ప్రార్థన మరియు దేవుని సంకీర్తన నిన్ను అమృత తుల్యునిగా చేయును

హరేరామ హరేరామ రామరామ హరేహరే॥
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే॥

ఈ మహామంత్రము నెల్లవేళల పాడుకొనుచుండుము. మరియు రామకృష్ణుల నెల్లప్పుడు ధ్యానించుకొనుచుండుము.

నీవు దైవ ప్రార్థన, దైవ ధ్యానము మరియు భగవన్నామ సంకీర్తనల ద్వారా భగవత్సాక్షాత్కారమును ఈ జన్మయందే పొందెదవు గాక!

— శ్రీ శివానంద మహర్షి
8-8-1941
దివ్య భజనమాల పుస్తకము నుండి.

భగవత్సాక్షాత్కారము

భగవత్సాక్షాత్కారము నొందుటకు మానసిక శుద్ధి అత్యంత అవశ్యకము. మానసిక శుద్ధి కలుగుటకు జపధ్యానములు, ప్రార్థన, కీర్తనలే ముఖ్యములు. భగవన్నామము పరమ పవిత్రమైనది. సర్వ మంగళకరమైనది. కావున ఆ పవిత్రమైన భగవన్నామమును జపించినను, ప్రార్థించినను ధ్యానించినను, కీర్తించినను, మనోమాలిన్యములన్నియు శీఘ్రముగా తొలగిపోవును మనో మాలిన్యము దూరమగుటతో, మానసిక శుద్ధి కలుగుటతో భగవత్సాక్షాత్కారము సులభతరమగును. భగవంతుని మహిమను వేద పురాణములు వేనోళ్ళ పొగడినవి అనేక మహా పురుషులు, భక్తాగ్రేసరులా భగవానుని లీలా విశేషములను గుణగానములను కీర్తించి, ప్రార్థించి, తరించిరి

— స్వామి కృష్ణానంద
27-7-80
దివ్య జీవన సంఘ ప్రధాన కార్యదర్శి
దివ్య భజనమాల పుస్తకమునుండి

పరమేశ్వరుని నామ కీర్తనము

పరమేశ్వరుని యొక్క నామమును గానము చేయుట భక్తియొక్క ప్రధానాంగమై యున్నది దీని ద్వారా మనస్సు విషయ పదార్థములనుండి విడివడి,

ఈశ్వరుని యందు లగ్నమగును. శ్రేయో మార్గము, లేక అజ్ఞానమునందు విమగ్నమైయున్న మనస్సు శ్రేయో మార్గము లేక పరమాత్మునివైపు గొంపోవునట్టి సంగీతము శక్తియొక్క ప్రారంభదశయై యున్నది. సంగీతము మన శరీరము నందలి నాడుల యందు స్పందనమును, సమత్వమును కలుగజేయును. మనస్సుపై ప్రభావము చూపును. మరియు హృదయమును ప్రఫుల్లిత మొనర్చును. ఈశ్వరుని కీర్తించునపుడు మన హృదయము నందొక అనుపమగు ఆనందము కలుగును. అపుడు మన హృదయమునందుగల అహంభావము శూన్యమగును. ఈ హృదయ శుద్ధి పరాకాష్ఠను చేరునపుడు, పరిశుద్ధమగు పరమాత్మయందు లీనమగుటకు యోగ్య మగును

సంగీతము పాషాణము వంటి కఠిన హృదయమునైనను కరగించును కీర్తన మధురము, సుఖదము మరియు హృదయమును హృదయేశ్వరుని యందు లగ్నమొనర్చునట్టి ప్రభావశాలియై యున్నది. శుకమహర్షి భగత్సంకీర్తనముచే ముక్తి నొందినట్టి మహాత్ముడైయున్నాడు. పరీక్షిన్మహరాజుకు భాగవతమును వినిపించునప్పుడు వారు భావి సమాధియందు మునిగి యుండిరి అప్పుడు స్వర్గము నుండి దేవతాగణము భూలోకమునకు వచ్చి, తమ వాద్యయంత్రములచే కీర్తన చేయ దొడగిరి. నారదుడు వీణాగానము చేయుచుండెను. ఇంద్రుడు మృదంగమును వాయించుచుండెను ప్రహ్లాదుడు శంఖమును పూరించు చుండెను. శివుడు నృత్య మొనర్చుచుండెను. శ్రీమన్నారాయణమూర్తి స్వయముగా సాక్షీభూతుడై యుండెను. వారందరును భావ సముద్రమునందు మునిగియుండిరి. ఇంతకు మిక్కిలి సంగీతము యొక్క ప్రభావమును చెప్పుటకేమున్నది?

కలి సంతప్త హృదయములగు జీవులకు సాధక గణమునకు భగవన్నామ సంకీర్తనము తప్ప వేరు సాధనము లేదు.

— స్వామి మాధవానంద సరస్వతి.
దివ్య భజనమాల పుస్తకమునుండి.

## ఈశ్వర సాక్షాత్కారమునకు సాటిలేని సాధనము సంగీతము

'సర్వం ఖల్విదం బ్రహ్మ' ఈ నామరూప జగత్తంతయును బ్రహ్మమే నై యున్నదని వేదాంతము ఘోషించుచున్నది. మరియు మన ప్రాచీన భారతీయ ఋషులయొక్క శాశ్వతమగు నిత్యోక్తి ఇదియునై యున్నది. ఈ విశాల విశ్వము



యొక్క సమస్త పదార్థములయందు మరియు ప్రాణులయందును సత్పదార్థము వ్యాపించియున్నది. కావున ఇట్టి సత్యమును సాక్షాత్కరింపజేసికొనుటయే మానవ జీవితమునకు లక్ష్యమైయున్నది. విభిన్నమగు నదులు ఏకైక సముద్రమునెట్లు చేరునో, భిన్న భిన్నములగు సాధనములద్వారా అట్లే సత్యస్వరూపుడగు భగవానుని సాక్షాత్కరింపజేసికొనవచ్చును. ఆధ్యాత్మిక మార్గమునందున్నతి నొందుటకై చిత్రకళ, మూర్తికళ, నృత్యకళ. సాహిత్యకళ మరియు సంగీత కళలు ముఖ్యసాధనములై యున్నవి. ఈయైదుకళల యందును సంగీతకళ మానవునిహృదయ ఫలకము నందు ప్రేరణాత్మక ప్రభావమును ప్రస్ఫుటింపజేయునదై యున్నది.

సంగీతకళ స్పందన పూర్ణము, మర్మస్పర్శము మరియు హృదయ గ్రాహ్య మునై యున్నది. ఈశ్వర సాక్షాత్కారము నందీకళ సరళము, నిశ్చితము, మాధుర్యము మరియు సర్వోత్తమమగు సాధనమైయున్నది. సంగీతము గాయకుని భావ సమాధి నొందింపజేయును. సంగీతము ఒక జపాన్ వానిని, ఆంగ్లేయుని, ఫ్రాన్సు దేశవాసిని, ఇంతయేల? సకలజనుల హృదయములను రంజింపజేయును. సంగీతము దివ్యమగు బ్రహ్మప్రాప్తి నొందించున దగుటచే దీనిని "నాదబ్రహ్మ" యని అందురు.

పరమపూజ్యులగు శ్రీ శివానంద స్వాములవారీ సంగీతమును 'యోగము'గా స్వీకరించిరి. మీరాబాయి, గౌరంగప్రభువు, సూరదాసు, కబీరుదాసు, రామదాసు, తుకారామ్, త్యాగరాజు మొదలగు సత్పురుషులందరును ఈ సంగీతము ద్వారానే ఈశ్వర సాక్షాత్కారము నొందిరి.

ఓ పాఠకులారా! వీణాధారిణియగు వాణీమాత (సరస్వతీదేవి) యొక్క వీణ నుండి వెలువడునట్టి బ్రహ్మ స్వరూపమగు 'ఓంకార' ధ్వనిని విని ధన్యులుకండి. మరియు శ్రీకృష్ణపరమాత్ముని యొక్క అమృత హస్తమునందు గల ఆత్మసంగీతమును సర్వకాల సర్వావస్థలయందు ధ్వనింపజేయునట్టి మురళీగానమును విని మీ జన్మలను తరింపజేసి కొందురు గాక! యని నా ప్రార్థనయైయున్నది.

— శ్రీ స్వామి విద్యానంద్
27-7-80
దివ్యభజనమాల పుస్తకమునుండి.

కీర్తన:

పరమ భక్తాగ్రేసరులారా!

నవవిధ భక్తులలో 'కీర్తన' భక్తి యొకటి. సర్వసాధారణముగా భక్తులందరును ఈ మార్గమునే అనుసరింతురు. కీర్తన, ప్రార్థనలు భక్తులకు అఖండమైన అమూల్యమైన ధనమువంటివి. ప్రార్థన, కీర్తనలు మానవుని యొక్క మనస్సులను పరిశుద్ధ మొనర్చి మాధవుని సమీపింపజేయును. పసిబాలుడు తల్లిని గూర్చి గట్టిగా ఏడ్చును ఆ ఏడుపును వినగానే తల్లి ఎన్ని పనులున్నను విడిచిపెట్టి, త్వరగా బాలుని వైపు పరుగెత్తును. అదే విధముగా భక్తుడు భగవంతుని దర్శించుటకై, భగవంతుని ప్రార్థించి కీర్తించి ఏడ్వవలెను. అప్పుడు భగవంతుడు స్వయముగా భక్తునివద్దకు పరిగెత్తుకుని వచ్చును. ప్రార్థన యొనర్చని కార్యము ప్రపంచమునందేమున్నది?

నారదుడు భగవంతుని గుణగణములను కీర్తించి ఎల్లవేళల భగవదనుభూతిని పొందెను. గజేంద్రుడు భగవానుని ప్రార్థించిన వెంటనే, భగవంతుడు వైకుంఠమునుండి పరుగెత్తుకొని వచ్చెను. ద్రౌపది శ్రీకృష్ణభగవానుని ప్రార్థించిన వెంటనే అంతములేనన్ని వలువలొసంగెను. భక్త ప్రహ్లాదుడు శ్రీహరిని ప్రార్థించిన వెంటనే, అప్పటికప్పుడే ప్రత్యక్షమై అన్ని విపత్తులనుండి తప్పించెను. భక్త పోతనామాత్యుడు శ్రీరామచంద్రుని ప్రార్థించి అయన అనుగ్రహమును పొందెను. భద్రాచల రామదాసు దాశరథిని స్తుతించి, నవాబుయొక్క బాధనుండి విడివడెను. త్యాగరాజు కోదండపాణియగు రామస్వామిని కీర్తించి ఆయన సన్నిధానమును పొందెను. ఇట్లే భక్త మీరాబాయి, సక్కుబాయి, సూరదాసు, పురందరదాసు, కనకదాసు, తుకారామస్వామి మొదలగు భక్తులెందరో భగవంతుని ప్రార్థించి, కీర్తించి, స్తుతించి, భగవదనుగ్రహముచే భగవదైక్యము నొందిరి.

వేదములు భగవంతుని మహిమను స్తుతించినవి. పురాణేతిహాసములు పరమేశ్వరుని గుణగణములను కీర్తించినవి. మహాపురుషులగు ఋషీశ్వరులా సర్వేశ్వరుని మహిమను పొగడిరి. ఇంకను ఎందరో మహాపురుషులు, భక్తాగ్రేసరులా దేవదేవుని లీలలను వర్ణించిరి. భక్తుడు భగవద్ధామమును చేరుటకు ప్రార్థన రాచబాట వంటిది. కావున ప్రతి భక్తుడును ప్రతిసాధకుడును భగవత్ప్రార్థన, సంకీర్తనలను నిత్యము చేయుచు, భగవదనుగ్రహమునకు పాత్రులు కావలయును.

—దేవానంద- చిన్నస్వామి

27 - 7 - 80

దివ్య భజనమాల- పుస్తకమునుండి.



ఆశీస్సులు

'సత్సంగమూ' 'సంకీర్తనా' 'నిస్వార్థసేవా' ఈ మూడూ మన భజన మండలులకు సంకీర్తన బృందములకు భగవంతుడు ప్రసాదించిన మూడుకాళ్ళ ముక్కాలిపీట.

ఈ మూడూ నడుపుకుంటూ పోతే త్వరలోనే యోగపీఠమైన 'ధ్యాన,' 'సమాధి', 'కర్మనాశము' అనే మూడు స్థితులూ లభిస్తాయి.

ఇవి నేను పది సంవత్సరాలుగా (1968-1978) అనేకచోట్ల, ఏర్పాటు చేసిన యోగ కేంద్రాలలో (Yoga Centers) సాధకులకు రహస్యంగా ఉపదేశించిన విధానం. ఇప్పుడు అందరి ఉపయోగార్థం విచ్చలవిడిగా పంచిపెడుతున్నాము. అందుకోండి!

ఎందుకంటే కారణం యిక రెండు సంవత్సరాలలో 'కలియుగం' అంతమై 'సత్యయుగం' ఆరంభించనున్నది. గనుక సర్వులకూ 'ఆధ్యాత్మిక తరంగాలు' కుండలినీ విజృంభణతోపాటు నిత్యం పనులు చేస్తుండగానే శరీరంలో యోగ ప్రక్రియ నడుస్తూవుండే విధానం-'తారక రాజయోగ' విధానంగా నడుస్తోందే రహస్యం ఈ 'సత్సంగం' ద్వారా యివ్వబడుతోంది!!! ఇది గత 5000 సం॥ల మధ్యకాలంలో జరుగలేదు.

ఇది యుస్కేఫీ (USCEFI — United Social Cultural & Educational Foundation of India) లోని యోగమిత్రమండలి సభ్యులు అయిన అందరికీ ఉపదేశంగా లభిస్తున్నది.

భజన బృందాలు, సంకీర్తన బృందాలు యీ క్రింది మూడు నియమాలకు విధిగా కట్టుబడి వుండాలి.

1. అందరు దేవుళ్ళు, అన్ని సాధనామార్గాలు ఒక్కటేననీ-ఆ సత్యం దర్శించాలి. అందరు జీవులూ తన ఆరాధ్యదైవం యొక్క ప్రతిరూపాలు అని అంగీకరించాలి. గురువూ, దైవం-వేరుకాదు.

2. ప్రతి నిత్యం ఒక గంటయినా తనకు ఉపయోగించని నిస్వార్థ కర్మచేసి ఆ ఫలితాన్ని సంకీర్తన బృందముద్వారా భగవానునికి సమర్పణ చేయాలి. ఇదే

నిత్యసాధన: ఇదే కుండలినీని మేల్కొల్పుతుంది-యీ 'తారక రాజ యోగం' లో:

3. ఎక్కడవున్నా వారానికి ఒక్కరోజు తప్పనిసరిగా 'సత్సంగం' చేయాలి. కనీసం 7గురుకాని 4 గురుకాని చేరితే కలిసి చేయవచ్చును. ఇది చదివే మీకు ఇవే ఆశీస్సులు

1 ప్రశాంతి (ఆనందం)
2 ఆరోగ్యం
3 అదృష్టం

— సత్సంగము
యోగమిత్రమండలి
USCEFI

సత్సంగం అంటే ఏమిటి

1) సత్సంగం అంటే యేమిటి?

2) సంకీర్తన వల్లనే మన సమస్యలు ఎలా నివారణ అవుతాయి?

3) చాలామంది యీనాడు ప్రపంచంలో సంకీర్తనలు చేస్తున్నారుకదా? వాళ్ళ సమస్యలు ఎందుకు నివారణ కావటం లేదు?

4) భజనల్లోనూ, రేడియోలోనూ, గ్రామఫోను రికార్డులలోనూ యివే వింటాం కదా! సంకీర్తనవల్లే మన సమస్యలు తీరటం నిజమైతే రేడియోలోని భక్తిరంజని వింటే సరిపోదా?

అని యిలాంటివి యింకా అనేక ప్రశ్నలు చాలామంది మనస్సులో వున్నాయి. వీటికి సమాధానం యేమిటంటే .......

సత్సంగం అన్నా, సంకీర్తన అన్నా కొందరు మనుష్యులు ఒకచోటచేరి ఏదో కొంత గోల చేయటం కాదు. నియమబద్ధం కాని భజన, అరుపుల వల్ల ఉపయోగంలేదు: అలాచేస్తే అది సంకీర్తన అవదు. దానికి కొన్ని నియమాలున్నాయి. సూత్రాలున్నాయి. అవి యేమిటో తెలుసుకుందాం.

నియమాలు: 'రాజయోగం' తెలిసిన గురువు ఆశీర్వాదంతో చేస్తేనే యీ సంకీర్తన సరైన ఫలితాలను యిస్తుంది.......

కొన్ని అక్షరాలు 'సిద్ధగురువు' ద్వారా ఉపదేశం పొందితేనే అది మంత్రమై సిద్ధిస్తుంది. అవే అక్షరాలు రోడ్డుమీద చేరి గోలగా చేసే భజనల్లోలాగ మైకులో



చేస్తే ఫలితం యివ్వడంలేదుగదా! ఇది సినిమాలలో చేసిన సంకీర్తనలాగా నిరుప యోగం! దీని వెనుక ఆధ్యాత్మిక శక్తిలేకపోవడమే దీనికి కారణం! అందుకనే సంకీర్తన ఎప్పుడూ ఒక సద్గురువు ఆధ్వర్యంలోగాని, లేదా ఆయన అనుజ్ఞ పొంది గాని చేస్తేనే ఫలితమిస్తుంది. సంకీర్తన జరిగే చోట కనీసం వారి ఫోటో అన్నా వుండాలి.

1) సంకీర్తనకి కూర్చున్నవారందరూ ఏకమనస్సును(Universal Mind) ఏర్పాటు చేయాలి. అంటే అక్కడ కూర్చున్న అందరి మనస్సులూ కలిసి 'నేను' (Unified Mind) గా ఏకవ్యక్తిత్వంగా లయం పొందాలి. అప్పుడు అందరి జీవాత్మలూ ఒక్కటిగా లీనమై 'విశ్వాత్మ'తో ఏకమవుతాయి. (ఇది తాత్కాలికంగా నైనాసరే) అంటే ఎవరి గురించిన ఆలోచనలూ, వేరు వేరు మనస్తత్వాలూ వదిలి పెట్టాలి. అందుకనే తన ప్రక్కన కూర్చున్నదెవరు? తానెవరు? తన ఉద్యోగం, హోదా, తన సమస్యలూ యిలాంటివేమీ ప్రవ్వకోరాదు. కళ్ళజోడూ, వాచీ, టై, సూటూ యిలాంటివన్నీ వదిలేసి విరామముగా కూర్చోవాలి. కదలరాదు.

2) అటూ యిటూ చూడటం ప్రక్కవారితో మాట్లాడటం, మాటిమాటికీ టైము చూడటం. వంటి చర్యలవల్ల యీ 'ఏకత్వం' భంగమయిపోతుంది. అందు వల్లఅవన్నీ వదిలేసి మనస్సును మాత్రం దర్శిస్తూ కూర్చోవాలి.

3) ఆలోచనలు వసే వాటిని అణచడానికి గాని, వెంటనే తరిమివేయడానికి గాని ప్రయత్నించరాదు. మనస్సును ఊరికే వదిలివేయాలి. నీటిలో అలలు వస్తే ఎలాగైతే అవి చేత్తో తుడిచివేస్తే పోక ఎక్కువవుతాయో, మనస్సూ అంతే!!

4) తన మనస్సునేగాక తనజీవితం యావత్తూ గురుచరణాలవద్ద శరణాగతి చేసి (వదిలివేసి) నమస్కరించి కూర్చోవాలి. అంటే యిది మనము కొనే ఏకాగ్రతమాత్రం (Concentraction) కాదు. ఇలా గురుచరణాలకు 'శరణాగతి' చేయడం ఎందుకంటే తన 'అహం' ను తాను మర్చిపోవడానికే: గోడనున్న మేకును చాక్కా తీసి తగిలించినట్లే 'గురువు' అనే మేకును'అహం'అనే [illegible] తగిలించాలి. ఆ తర్వాత దానిని మరచిపోవాలి. తానున్నట్లే తనకు గుర్తుండరాదు.

5) ఇలాగ తన 'వ్యక్తిత్వం' గాలి లాగా, ఖాళీ ప్రదేశం లాగా శూన్యంలో లయమయిపోవడమే 'మోక్షం' జీవుడు బ్రహ్మలో ఐక్యం కలగడమే సదా మోక్షం

ఇది 'సత్సంగం'లో అనుగ్రహం చేత జరుగు తోంది. ఇది తాత్కాలింగా నైనా సరే జరగందే సమస్యలు నివారణ కావు!

6) ఇలా సరిగా శరణాగతి జరక్కపోతే అణిగి వున్న 'అహం' తిరగబడి అనివార్యంగా బుసలు కొట్టి గురువునుండి తరిమేస్తుంది. జీవితాన్నీ సాధనమూ కూడ వృధా చేస్తుంది. అందుకని మన మనస్సులోని అభిమానం అహంను జాగ్రత్తగా ఓ కంట కనిపెడుతూ వుండాలి ప్రతీ రోజూ.

—సత్సంగము
యోగమిత్ర మండలి
U S C E F I

భగవచ్ఛక్తి తరంగాలు

(COSMIC-FORCE RAYS)

ఆదివారం (వారానికి ఒక రోజు) సాయంత్రం 6,00 గంటలకు (నియమం తప్పకుండా) సత్సంగం చెయ్యటం అవసరం. అంటే సంధ్యాకాలంలో ఎందుకంటే ఆ సమయం హిమాలయాల్లో మహర్షులు ధ్యానం చేసే సమయం! వారు ఆసమయంలో తపోశక్తిని ధారపోస్తారు. అప్పుడు మనస్సు విప్పి శరణాగతి చేసేవారికి సత్సంగం ద్వారా 'శక్తి' లభిస్తుంది.

ఇది ఒక సుడిగాలి లాగా, వాయు గుండం లాగ గదిలోనికి ప్రవేశించి 'సత్సంగం' జరిగే ప్రదేశంలో మధ్యగా ఒక పెద్ద కరెంటు వలె ఏర్పడుతుంది. (Magnetic Field) ఈ శక్తి సాధకుల శరీరంలోనికి ప్రవేశించడానికి, వారి ఆలోచనలనే అడ్డు గనక తొలగిస్తే సత్సంగ ఫలితాలు వెంటనే కనబడతాయి.

అడ్డు గోడలు అంటే సందేహం, భయం, అనుమానం, ఈ అడ్డు గోడలు లేనివారికి యీ 'శక్తి' సరాసరి మనస్సులోకి ప్రవేశిస్తుంది. దీనివలననే శారీరక మానసిక ఆధ్యాత్మిక, బాధలు-రోగాలు నయమవుతాయి. ఇదే శక్తి అక్కడున్న సాధకులలో స్వార్ధ రహితమైన జీవితమూ. పవిత్రమైన మనస్సూ కలిగిన వారైతే అది, వారిలోని 'కుండలినీ శక్తిని' కదిలించి ప్రబోధం చేస్తుంది ఇదే సత్సంగం రహస్యం!

ఇది తనంతట తానుగా సామాన్యుడు చేయగలడా? లేదు. అందుకే సామూహిక సత్సంగం (Group Meditation) అవసరం.

కుండలినీ విజృంభణ

'కుండలినీ శక్తి' ప్రతి వారి శరీరంలోనూ నిద్రిస్తూ వుంటుంది. ఇది ఒక



భగవత్ శక్తి ఈ శక్తిమేల్కొంటే సిద్ధ పురుషులవుతారు. కొంచెం కొంచెంగా కదలిక కలిగితే క్రమక్రమంగా యీ క్రింది మార్పులు శరీరంలో కలుగుతాయి.

* శరీరంలో కరెంటు పెట్టినట్టుగా గగుర్పాటు. లేక రోమాంచనం కలుగుతుంది.
* మనస్సు ఉత్సాహంతో ఉరకలు వేస్తుంది.
* హృదయం ఆనందంతో నిండి అంతులేని వర్ణనాతీతమైన సంతోషాన్ని,శాంతినీ పొందుతుంది. శరీరంలోని నరాలు లేక నాడులు కరెంటు తీగెలవలె జివ్వుమంటాయి
* మెదడు పని చెయ్యడం మానేస్తుంది. ఆలోచనలు స్థంభించిపోతాయి.

మనిషి మంచివాడైతే,లేక సరైన సాధనలో ఉండే అతడైనా శరీర స్పృహనే కోల్పోతాడు! అంటే సమాధి యేర్పడుతుంది. తానెక్కడుందీ, ఏమైనదీ కూడ తెలియదు.

—సత్సంగము
ప్రచురణ: యోగమిత్రమండలి
(U S C E F I) యుస్కెఫీ

సంకీర్తన

పూర్వకాలంలో మహాయోగులు సంకీర్తన చేసేవారంటే వారు క్రమబద్ధంగా చేసినారు. అనాదిగా యిలాగ నారదమహర్షి, ఆంజనేయుడూ, ప్రహ్లాదుల వారూ యిలా సంకీర్తనచేసి, తద్వారా భగవదనుగ్రహం పొందినవారే. అయితే ఆ మహనీయులు వెంటనే ఫలం పొందిన కారణం? వారు సర్వస్వమూ-అంటే, మనస్సు, ఆత్మ సర్వం భగవంతునియందు లయమొనర్చి చేసినవారు. అంత త్వరగా మనకది సాధ్యంకాదు. కాని మానవులకు అసాధ్యమైనది లేదు.

ఇక యీ సంకీర్తన అంటే పూర్తిగా ప్రాపంచిక విషయాల గురించి ఆలోచించక కొంతసేపు నారాయణుని యందు మనస్సు లగ్నంచేయుట అని అర్ధం.

ఈ సంకీర్తన యెలా చేయాలి? అన్న ప్రశ్నకు సమాధానం ప్రతీ ఏడు రోజుల కొకసారి మనకొకసారి సమయము దొరుకువేళ ఆదివారం మాత్రమే! అది అందరికీ శెలవుదినం సాయం సంధ్యా సమయంలో ఒక పవిత్రమైన (శుచి,

శుభ్రత కలిగిన) స్థలమందు అందరూ సమావేశము కావలెను. వారు సమావేశమయినప్పుడు స్త్రీలు ఎడమవైపు పురుషులు కుడివైపు కూర్చొనవలెను. మధ్యన ఖాళీస్థలం వదలాలి.

ఇక యీ సమావేశమునకు ముందుగా కొందరు వచ్చినా వారు ప్రాపంచిక విషయాలను గురించి ముచ్చట్లు మాట్లాడకూడదు. ముఖ్యముగా నిర్ణీత సమయానికి ముందుగా రావలెను. అందరూ స్నానముచేసి రావలెను.

ఇవి యీ సత్సంగము యొక్క నియమములు. ఈ నియమములకు బలమైన కారణములు కూడ ఉన్నాయి. ఏడురోజులకొకసారి పారాయణ చేయుట ఎందుకనగా మన శరీరమందు ఏడు ధాతువులున్నవి. అవి భగవద్ధ్యానమువలన శక్తిని పొంది తిరిగి ఏడురోజుల వరకూ పనిచేయుచుండును. "బ్యాటరీ చార్జి (Battery Charge) అయిన తరువాత తిరిగి దానికి ఎలా చార్జి అవుతుందో, శరీరమూ అంతే.

ఇంక సంధ్యా సమయములోనే ఎందుకు చేయాలి అంటే-సాయం సంధ్యగాని, ఉదయంలో సంధ్యగాని మహర్షుల ధ్యానం సమయం. వారినుండి మనకు కొంతశక్తి లభించును. కాబట్టి యీ సంకీర్తన సమయమున ఎవ్వరైతే సర్వేంద్రియములను మనస్సును భగవంతునియందు శరణాగతిగా అర్పించి ధ్యానం చేస్తారో వారు "సమాధి స్థితి"ని పొందగలరు. అట్టి సమాధి స్థితిని పొందినవారు అధికంగా భగవంతుని వలన లభించే "కుండలినీ" శక్తిని పొందుతారు.

ఈ సంకీర్తనకు బాహ్య శుభ్రత ఎందుకంటే-మనస్సునకు ఆహ్లాదము కొంత శరీరము శుభ్రతవలన కలుగును. శరీరముపైన మురికి తొలగించిన చిరాకుండదు. మనిషి సత్కర్మ కలిగినవాడు, యీ సంకీర్తన సమయమునందు నిటారుగా కూర్చుండిపోవును. మామూలుగా యిది యెక్కువగా మహనీయులయందే జరుగును. మనం మానవులం. మన గురించి మనకు తెలుసును. కనుక మనము 'సమాధి స్థితి'ని పొందలేము. కాని పూర్తిగా ముందుకు వాలి భూదేవిపై శిరస్సును అనించు స్థితిని మాత్రము పొందగలము. దీనివలన మన శరీరములకు భూమినుండి శక్తిపారును. ఇక యీ స్థితికూడ సర్వజనానికీ ఒక్కసారిగా సాధ్యంకాదు.

ఇక కూర్చునే సమయమున మనమెవరి వద్ద కూర్చోవలెనన్న తలంపు ఉండకూడదు. అసలు ఎక్కడ కూర్చున్నాము అన్నస్థితిని మరిచిపోవలెను.



సంకీర్తన సమయమందు స్త్రీలు ఎడమవైపుకు పురుషులు కుడివైపుకు కూర్చోవాలి. స్త్రీలకు Negative Charge, పురుషులకు Positive Charge శరీరంలో సహజంగానే ఉంటుంది. ముఖ్యంగా అవి దంపతులు అర్ధనారీశ్వరత్వమునకు లోపలి పరమార్ధమిదే. ఇక యీ సంకీర్తన సమయంలో మధ్య ఖాళీస్థలం యెందుకు వదలాలి? మనం చేసిన సంకీర్తనలవల్ల పైన ఆకాశంలో కంటికి కనబడని దేవతలు అనుగ్రహిస్తారు. ఈ దేవతానుగ్రహం పైనుండి 'శక్తి'లా ఆ ప్రదేశమునకు దిగి అవరిస్తుంది. ఈ శక్తిని వారి వారి (సంకీర్తనలో పాల్గొన్న వారి) శక్త్యానుసారం గ్రహిస్తారు. అందుకనే యిలా ఖాళీ స్థలం వదులుతారు.

ఇక ఖాళీస్థలమే కాక ఒకచోటే జనం ప్రోగయి చేయవలసిన అవసరం ఏమిటి? ఈ సత్సంగం అనేది-అంటే పదిమంది ప్రోగయి చేసే సంకీర్తన చాల ముఖ్యమయినది. ఇదే Group Meditation అంటారు. ఇది మన పూర్వీకుల నుండి వచ్చిన విజ్ఞానం. కాని యీనాడు గ్రహించలేని స్థితిలో ఉన్నాం.

సత్సంగంలో పనిచేసేది సాధకుడి శక్తి కాదు. పైనుండి భూలోకంలోనికి జలపాతంగా ప్రవహించే భగవత్ శక్తి (Descent of God-Force)

ఇది ఒక్కసారి శరీరంలో ప్రవేశిస్తే 6 రోజుల వరకూ పని చేస్తుంది. (మనం అంతరాయం కలిగించకుండా ఉంటే) 7 రోజులలోగా యీ శక్తి క్రమంగా శరీరంలో ఉన్న సప్తధాతువులలోకి యింకుతుంది. మనం తిన్న ఆహారం జీర్ణమై రక్తంలో కరిగే అన్న సారంతో భగవత్ శక్తి మిళితమై శరీరాన్ని కూడ తేజోమయం చేస్తుంది. అందుకనే సత్సంగంలో పాల్గొన్నవారి ముఖాలు యిది వరకు లేని కళతో పచ్చని తేజస్సుతో నవనవలాడుతుంటాయి.

ఎప్పుడైనా యితరుల యిళ్ళలో నిద్రించినా లేదా క్రమజీవితం లేనివారి (సాధకులు కాని) యింటి ఆహారం భుజించినా వాళ్ళ కర్మ మనకు సోకి యీ తేజస్సు తగ్గి పొగరీతిగా కప్పివేసి నట్లుంటుంది ముఖం కొందరికి అనారోగ్యం కూడ కావచ్చును. అందువల్ల పరాయి యింటి భోజనం, పరాయి యింట నిద్ర లేకుండా జాగ్రత్త వహించాలి.

ప్రసాదం :- ఇక ఈ సంకీర్తన తరువాత తీర్థప్రసాదం - గురుదేవుని మృదుహస్తముల ద్వారా పొందాలి. ఇలా 7 వారములు చేస్తే సంపూర్ణంగా సత్ఫలితాలను పొందుతారు. అసలు 2, 3 వారాలకు వసనాలు పోయిన వారు అనేకులు

'ప్రసాదం' - అనేది పదార్థమనుకోకూడదు. ప్రసాదం అంటే అనుగ్రహం అని అర్థం. భగవంతుని ముందు ఉంచే పదార్థములలో మన సంకీర్తన వల్ల దేవతానుగ్రహ శక్తిలోని 'కరెంటు' కొంత కలుస్తుంది. అట్టి ప్రసాదం మనం తింటాము.

అయితే యీ ప్రసాదం తీసుకునే విధానంలో కూడ అనుగ్రహం లభించే విధానం వుంది. కొందరు నమ్రతగా రెండు చేతులూ చాచి తీసుకుంటారు, మరి కొందరు 'ఏదోలే' అన్నట్లుగా తీసుకుంటారు. మనం తీసుకునే ప్రసాదం అరగంటలో తినాలి ఇంటికి పట్టుకెళ్ళకూడదు. ఇంటికి పట్టుకెళ్ళితే అందులోని శక్తి తిరిగి అక్కడే వెనక్కి చేరి ఖాళీ పదార్థం యింటికి తీసుకు వెళ్తాము.

ఇక యీ భగవన్నామ సంకీర్తన యందు మనం 'ఓం' కారనాదం ఎందుకు చేస్తాము? ఇలా చేసేటప్పుడు శరీరంలో అధోభాగం నుండి ఊర్ధ్వ ముఖం వైపు అంటే మూలాధారం నుంచి శిరస్సువైపుకు సాగుతూ వుంటుంది యీ నాదం ఇలా అవటం వల్ల మనకు తల అదిరినట్లు పొట్టలోపలికి శబ్దం పోయినట్లు కూడ అనిపిస్తుంది. ఇలా అయినపుడు మన శరీరంలో ఒక 'Vacuum' లేక 'ఖాళీస్థలం. యేర్పడుతుంది. అంటే పైనుండి లభించే శక్తి (భగవదనుగ్రహం) యీ ఖాళీస్థలం లోనికి వెల్తుంది.

సంకీర్తన సమయంలో అంతా కళ్ళు మూసుకొని యేకాగ్రతతో చేయవలయును. సంకీర్తన అందరూ ఒకే స్వరముతో (ఒకే ధ్వనితో) పాడవలెను. ఏ ఒక్కరి కంఠమూ అందరికన్నా పైకి వినబడరాదు. అనగా అందరూ కలిసి సంకీర్తన చేయునపుడు అందరి గొంతుకలూ కలిసిపోయి 'ఝుమ్మని' (తుమ్మెద శబ్దంలా) ఓం కార నాదముగా ఒక్కటిగానే ధ్వనించవలెను. ఇదే సరిగా సంకీర్తన చేసినట్లు సూచన. ఫలితాలు అప్పుడే కనబడతాయి. ఎవరికి వారే పాడరాదు.

— 'యోగ మిత్రమండలి' వారిసత్సంగము పుస్తకము నుండి,

USCEFI

United Social Cultural & Educational Foundation of India.

1978.



పసిడి పలుకులు

* నీవు చేయగలిగిన పనిని లోకదృష్టితో నున్న భగవంతునికి అర్చన రూపములో సేవ (స్వధర్మము) చేయడమే 'మోక్షము';

* నీవు లేవలేని స్థితిలోనుండి నీ కన్నా లేవలేని వారికి సహాయం చేయడమే 'ధర్మం';

* అర్చన దృష్టితో కాక అర్జన దృష్టితో ప్రతిఒక్కరూ ప్రవర్తించడము వలన యిన్ని కోట్లు భారతీయులుండి కూడ మనం యింత దిగజారిన స్థితిలో నున్నాం.

* గాంధీ గారికన్నా అందమయినవారూ, బాగా మాట్లాడ గలిగినవారూ, పెద్దవాళ్ళూ, నాయకులూ ఉండవచ్చు. మరి ఆయనే మహాత్ముడెందుకు అయ్యారు? ఆయన లోకహితమునకై తనను తాను అర్పణ చేసుకున్నారు. అందువేత దివ్య శక్తి ఆయనలో ప్రవహించి ఆయన మహాత్ముడయినట్లు చేసింది,

* లోకహితము కాకుండా మన వ్యక్తిత్వము చూసుకుంటూ, స్వార్థము కోసం ప్రయత్నిస్తే కరెంటులేని ఫాను, లైటులాగ జీవచ్ఛవమై పోతారు లోకహితముతో ప్రవర్తిస్తే కరెంటు ప్రవహించి ఫానులు తిరిగినట్లుగా మనం ప్రయోజకులవుతాము.

* మనకు కష్టం వచ్చినప్పుడు మనం ఆ కష్టంలోనే దైవాన్ని చూడాలి. అలా కాక కష్టాన్ని చెప్పుకొని దేవుని వేరుగా చూస్తే ఫలితముండదు. కష్టంలోనే దైవాన్ని నేరుగా చూచితే మనకు ఆ కష్టం చెదిరిపోతుంది. ప్రహ్లాద చరిత్రలో మనం గ్రహించవలసినదదే.

* రాముడు చక్రవర్తి. మరి శ్రీ కృష్ణుడు ఏమీ కాడు కాని ఏమి కాడు? అతను లోకహితముతో తాదాత్మ్యము చెందుటవలన సమస్తలోకం తలవంచి ఆయన పాదార్చన చేసింది.

* మృత్యువు కోరలమధ్యను శ్రీ కృష్ణుని జననం జరిగింది. రేపల్లెలోకూడ వరుసగా అసురులు అతడిని అంత మొందించడానికి ప్రయత్నిస్తూనే వున్నారు. అయినా జీవితాన్ని ఉత్సవంగా జీవించేడు.

* శ్రీ కృష్ణుడు అస్ఖలిత బ్రహ్మచారి. తనను కోరిన వారినే వివాహం చేసుకున్నాడు. కాని తానుగా యెవ్వరినీ కోరి వివాహం చేసుకోలేదు. కోటి కామక్రీడలు పెట్టు శ్రీ కృష్ణుని తలంపుగా 16108 మంది భార్యలు మసిలేరు.

* రాసలీల అనగా కొన్ని వందలమందికి ఏకకాలంలో దగ్గఱ వున్నట్లుగా భావనతో కూడిన చిత్రమైన దివ్యమైన అనుభూతి.

* రామాయణము ధర్మాచరణమును, భారతము ధర్మనిష్టను మరియు భాగవతము ధర్మక్రీడను విశదపఱచుచున్నవి.

* నియమములు అతిక్రమించకూడదు. నియమముల మీద tension ఉండకూడదు.

—శ్రీ డా. మోపిదేవి కృష్ణస్వామి. మానవధర్మ శిక్షణసంస్థ, 23-10-7 పురుషోత్తం వీధి, సత్యనారాయణ పురం, విజయవాడ-11. శ్రీ సాంబమూర్తి కళా మందిరం (విశాఖ)లో 23-7-86 తేదీన యిచ్చిన ఉపన్యాసములో భాగములు.

## జపము చేయు విధానము

దండపాణిస్వామి భగవాన్ (శ్రీ రమణ మహర్షి) దర్శనార్థము మొదటి సారిగా శ్రీవారు స్కందాశ్రమములో ఉన్నప్పుడు వచ్చారు. వచ్చిన రెండురోజులకు, శ్రీ భగవాన్‌తో, తనకు పెద్ద సంసారమున్నదని, దానినంతయు పరిత్యజించి భగవాన్ శరణు కోరుతున్నాననీ, భగవాన్ తనకు ఉపదేశ మొసంగవలెనని ప్రార్థించారు.

శ్రీ భగవాన్ యిలా అన్నారు, "ఉపదేశమంటే యేమిటి? నిజమైన ఉపదేశము ఆత్మలో లీనమై ఉండటమే."

అయినను భగవాన్‌ను ఉపదేశము కోసము అనేకసార్లు అర్థించారు. తననిక వదిలిపెట్టరని తెలిసి యింతవఱకూ యేమి చేస్తున్నారని ప్రశ్నించారు, భగవాన్.

ఇప్పటివఱకూ రామనామం కోటిసార్లు జపించానని సమాధానమిచ్చారు, దండపాణిస్వామి "అది చాలు. ఇంకేమి కావాలి? ఆపకుండా అలా జపము చేసుకుంటే సరిపోతుంది" అన్నారు భగవాన్. 'జపము ఎలా చేయాలి' అని ప్రశ్నించారు దండపాణిస్వామి.



శ్రీ భగవాన్, జపము మూడు రకాలని వివరించారు. ఉచ్చజపమూ, ఉపాంశు జపమూ, మానసిక జపము. పెదవులు కదుపుతూ బిగ్గఱగా చేసేది "ఉచ్చ జపము", పెదవులు కదపకుండా లోన ఉచ్చరించుతూ చేసేది "ఉపాంశజపము." మనస్సులో చేసుకునేది 'మానసిక జపము' అన్నింటికంటే మానసిక జపము ఉత్తమమైనదని భగవాన్ చెప్పారు.

—'శ్రీ రమణ జ్యోతి' జూన్ 86 సంచికలో, స్మృతులు (21)-శ్రీ కుంజస్వామి, తెలుగు అనువాదము-హరి.

## భగవన్నామ మహిమ

* భగవన్నామ మహాత్మ్య శ్రవణము అందరికిని నిత్యకర్మ వంటిది.

* నామ సంకీర్తనము యజ్ఞ యాగాదులలో కలిగిన దోషములను, లోపములను పూరించగలదు. జపహోమాదికములను భగవద్భక్తి సఫలము చేయగలదు.

* భగవన్నామోచ్చారణ రూప మహాదావాగ్ని సమగ్ర సంసారరూప మహావృక్షమును సమూలంగా భస్మము చేసివేయుచున్నది. ఒక జీవితములో జరుగు పాపమంతయు కలిసినను నామాగ్నిముందు తృణముతో సమానము కూడ కాదు.

## భక్తి కర్మకంటే శ్రేష్ఠమును, నిరపేక్షమును

'తన యింద్రియముల ద్వారా శ్రీ కృష్ణునకు సేవయు అట్లే అతని భక్తుల యొక్క సేవయు చేసి పవిత్రుడు అయినట్లుగా పాప పురుషుడు తపాదుల ద్వారా పవిత్రుడు కాలేడు.' భాగవతమున చెప్పబడినది. కీర్తనాదులచే కృష్ణుని కీర్తించుటయే, ఆయన యందు యింద్రియములను సంలగ్నపరచుట అర్థము.

ఇంతకంటె స్పష్టమైన వివరణము-భగవన్నామోచ్చారణ ద్వారా పాపికి లభించునట్టి శుద్ధత్వము, వేదవాదముల ద్వారా ఉపదిష్టమైన వ్రతాదిరూపమైన ప్రాయశ్చిత్తములలో శుద్ధత్వము లభింపదు అని, కర్మతో కలుగు శుద్ధి వేరు, భక్తితో కలుగునది వేరు-అని తాత్పర్యము.

* విష్ణు పురాణమునందు తపస్సు మొదలగు కర్మరూప సమస్త ప్రాయశ్చిత్తముల కంటె శ్రీ కృష్ణ స్మరణము సర్వశ్రేష్ఠముగా చెప్పబడినది.

* నృసింహ పురాణములో 'కృష్ణ కృష్ణ' శ్రీ నృసింహ' అని యనుట మాత్రము చేతనే నరకానుభవము చేయుచున్న పాపులందరు ఉద్ధారణము, వైకుంఠప్రాప్తి

యగునని వర్ణింపబడియున్నది. శివపురాణమునందుకూడ 'హరహర' 'నమః శివాయ' అనెడి ఉద్ఘోష నరకయాతనలు పొందుచున్నట్టి ప్రాణులకు తత్కాలమే శివలోక ప్రాపకమని చెప్పబడినది. శ్రీ విష్ణు ధర్మమునందు 'విముక్తాన్య సమారంభః' అని చెప్పి, నారాయణ పరాయణునకు అన్యసాధనముల పరిత్యాగము ప్రబోధింపబడినది. అచ్చటనే గోవింద నామోచ్చారణముచే క్షత్రబంధునకు గోవిందత్వ ప్రాప్తి నిరూపించబడినది. ఈ అన్నిచోట్ల కీర్తన మాత్రముతోనే సమగ్ర పాపక్షయము చెప్పియున్నారు నిష్కర్షయేమనిన, కేవల హరి సంకీర్తనమే సమస్త పాపక్షయమునకు సాధనము. కర్మాదులైన అన్యసాధనల సముచ్చయముతో నున్న పనిలేదు మరియు, అది స్వయముగా యే యితర సాధనకు అంగమున్నూ కాదు.

నామకీర్తన యొక్క కేవలత్వమేమి?:

కారణము యొక్క పుష్కలతయే 'కేవలత్వము'. దీనిని 'నిరపేక్షత' అని కూడ అందురు. అది కార్యము యొక్క పూర్వక్షణమున నియతరూపమున నుండును. దీనికి కార్యోత్పత్తి యొక్క సామాగ్రిగా చెప్పుదురు. దేని తరువాత నిశ్చయముగ కార్యము సంపన్నమగునో, అదియే పుష్కల కారణము. ఇతర సాధనము అపేక్షించినచో అది పుష్కలము కాలేదు.

కారణముయొక్క పుష్కలత్వము యేదే నొక్కదానియందు మాత్రమే యుండును. ఎట్లనిన సంయోగము యొక్క నాశరూపమగుకార్యము కేవల విభాగము నందుండును కొన్ని చోటులందు రెండింటియందుండును. స్వర్గప్రాప్తిరూప కార్య విషయమున ధర్శ మరియు పౌర్ణమాసముల రెంటి సముచ్చయము యొక్క అపూర్వము కారణము అనినటుల కొన్నిచోట్ల అనేకములందుండును. ఎట్లనిన ఘటమను కార్యమునకు దండము, చక్రము, వస్త్రము, కుమ్మరి సాధనములన్నిటియందుండును ఎచ్చట అనేక పుష్కలకారణ స్వరూపములున్నవో, అచ్చట అవి తమ అక్రమమునందు కలిసిమెలిసి పోవుచున్నవి. అయితే ఎక్కడ ఒక్కదానియందే పుష్కల కారణత కలదో, అచట అది సంపూర్ణత్వమును పొందియున్నది. నామ సంకీర్తన రూపమగు భక్తియందు పాపక్షయమునకు పుష్కల కారణత్వమున్నది. ఇందువలన పాపక్షయమునకై, నామస్మరణముయే యితర సాధనాలతోను సముచ్చయముగా సమ్మిశ్రణముగా నుండవలసిన ఆవశ్యకతలేదు.



నామ ఫలములు:

మొదట కీర్తన పాపమును నశింపచేయును. తర్వాత పునః పునముగాచేయు కీర్తన భగవద్వాసనా రూపకమయిన శ్రద్ధాభక్తులను జాగ్రుతము చేయును. లింగ పురాణమునందు చెప్పబడినదేమనగా 'ఓం నమో నీలకంఠాయ'- యీ మంత్రము యొక్క ఉచ్చారణ మాత్రము చేతనే సర్వపాపములనుండి విముక్తి కలుగును, అని.

పాపము మంచువంటిదయితే నామము సూర్యుని వంటిది. పాపము కట్టెవంటిదయితే నామము అగ్నివంటిది పాపము రోగము వంటిది, నామము రోగనివృత్తి సమర్థమైన ఔషధము వంటిది

కీర్తనతో మోక్షమునకు క్రమము:

కీర్తనతో పాపక్షయమగును. కీర్తన యొక్క ఆవృత్తిచేత భగవద్విషయకమగు వాసనలు వృద్ధిపొందుతూ పాపవాసనలు క్షీణించును. సప్తమహాఋషుల యొక్క సేవ నిరంతరము లభించును. వారి శ్రీముఖము ద్వారా భగవన్మహిమను శ్రవణము చేయుటచేత పుణ్యశ్లోక శిరోమణియగు భగవంతునియందు నైష్ఠికమగు దృఢభక్తి సమృద్ధిగా ఉదయించును. శోకాదిములు ఉచ్ఛిన్నమగును. సత్త్వగుణోత్కర్షము సంభవించును. అనంతరము తత్త్వ సాక్షాత్కారము కలిగి ముక్తుడగును.

— శ్రీ మద్భాగవతమునందు యీ క్రమము కననగును.

లోప విలుంఠనుడు- శర్వుడు:

అవిగో! అవే హిమాలయ పర్వతశిఖర పరంపరలు. తళతళలాడే మంచు కొండలు మధ్య ఎత్తైన పీఠభూమి. మధ్యభాగంలో స్ఫటిక నిర్మల నీరముల నిండిన 'మానస సరోవరం'- అల్లదిగో! చుట్టుప్రక్కల సెలయేళ్ళు చెంగుచెంగున క్రిందికి దూకుతున్నాయి. అదిగో అదే 'కైలాసం'! దివ్యత్వం వెల్లివిరిసిన వాతావరణంలో దేదీప్యమానంగా ప్రకాశిస్తోంది

దివ్యదంపతులు పార్వతీ పరమేశ్వరులు- విష్ణు సహస్రనామ పారాయణం ముగించి ఏకాంత సేవలో నిమగ్నులై ఉన్నారు. సహస్రనామాలు జరిపించటం పూర్తి అయింది.

పార్వతీదేవి ప్రశ్నించింది— 'ఓ పరమేశ్వర ప్రభూ! ఇది విష్ణు సహస్ర

నామార్చన గద. ఇందులో మీపేరు మీరే వల్లెవేయటం దేనికి? "ఓం శర్వాయ నమః" అనటం ఎందుకు విష్ణుమూర్తిని ఉద్దేశించేటప్పుడు? అందరకూ తెలిసిన విషయం శర్వుడు అంటే పరమశివుడు".

పరమేశ్వరుడు చిరునవ్వుతో బదులు పలికాడు. "అసలు ఆ పేరు నారాయణునిదే కాని నాదికాదు, అందరిలో ఉండే చెడుగుణము అన్నింటినీ త్రుంచి వేసేవాడు గనుక నారాయణునకు 'శర్వుడు' అనే సార్థక నామధేయము ఏర్పడింది. మనము అందరమూ పరాత్పరుడైన ఆ నారాయణుని దేహంలో అవయవమాత్రులమే సుమా! మానవ మాత్రులు యేవిధంగా తమ శరీరం లోని అవయవాలలో ఉండే చెడుగుణము నిర్మూలిస్తారో, అదేవిధంగా శ్రీమన్నారాయణుడు గూడా మనలో ఉండే దౌష్ట్యాలను అన్నింటినీ తొలగిస్తాడు. నేను ఆదర్శ విష్ణు భక్తుడను గనుక, ఆయన నామాలలో 'కొన్నిటిని' ధరించాను. అది మా పరస్పర సాన్నిహిత్యాన్ని సూచిస్తుంది.

లోకమాత వివరణ కోరింది — సరే మీరు ఎన్నుకున్న నామాలకు ఏదైనా అంతరార్థం కాని విశిష్టప్రాముఖ్యం గాని ఉండవచ్చును గదా?

పరమేశ్వరుడు చెప్పిన సమాధానం "అవును. 'శర్వ' నామధేయం నాకు నచ్చిన నామం. ఆ పేరులో ఉన్న విశిష్టత నాకు అనుభవామ్రేడితం. ఆ చరిత్ర నాకు చిరస్మరణీయం. ఆ కథ. వింటే నీకే అర్థమవుతుంది, శర్వుడు అంటే సాక్షాత్తూ శ్రీమన్నారాయణుడే అని. మరి చెప్పనా నీకు ఆ మనోహర గాథ!" "సరే వింటాను చెప్పండి" అని తల పంకించింది పార్వతీదేవి. పరమశివుడు కథ చెప్పసాగారు.

అనగనగా ఒకానొకనాడు బ్రహ్మదేవునకు ఐదు తలలు ఉండేవి. తూర్పు దిశగా ఉండే శిరస్సు ఋగ్వేదం పఠించేది. దక్షిణ దిశగా ఉన్న తలకాయ యజుర్వేదం వల్లెవేసేది. పడమర దిక్కుగా ఉన్న ముఖం సామవేదగానం చేసేది ఉత్తర దిశగా ఉన్న ముఖం అథర్వణ వేదం పఠించేది. ఇక అయిదవ శిరస్సు నాలుగు శిరస్సులపై నిట్ట నిలువుగా నిలిచి ఇతిహాస పురాణాలు చదివేది

బ్రహ్మదేవుడు ఆ విధంగా అన్ని దెసలవైపు విజ్ఞాన దీధితులు వెల్లివిరియ చేస్తూ దేదీప్యమానంగా వెలుగొందేవాడు అయితే అంతలో అతనికి అహంకారం గూడా కలిగింది. బ్రహ్మదేవుడు — తన దగ్గరకు వచ్చిన ఋషీశ్వరులకు



స్వాగత మర్యాదలు చేసేవాడు కాదు. దేవతలను తృణీకరించసాగాడు. అతనిలో రాజస గుణం ఘనీభవించింది. గర్వం మితి మీరింది. అహంభావంతో 'ఈ ప్రపంచాన్ని సృష్టించేది నేనే! నాతో సమానులు ఎవ్వరూలేరు' అని ప్రగల్భాలు పలికేవాడు. అతని అయిదవ శిరస్సునుండి వెలువడే కాంతిరింఛోళి — వేల్పులకు కన్నులు మిరుమిట్లు గొల్పేది. దేవతలందరూ బ్రహ్మదేవుని దురహంకార పూరితమైన దుర్నిరీక్ష్య తేజస్సు చూడలేక — కైలాసానికి పోయి పరమేశ్వరుని ప్రార్థించి యిలా విన్నవించుకున్నారు.

"పరమశివా! బ్రహ్మదేవుని దురహంకారం పెచ్చు పెరిగిపోయింది. ఆయన మమ్మల్ని పురుగులవలె చూస్తున్నాడు. ఆయన అయిదవ శిరస్సును యెవరూ తేరిపార జూడలేరు ఎంతటి తేజోవంతులు మహామహులు అయినా సరే ఆయన దరిచేరితే చాలు నీడలో క్రీనీడలుగా మారిపోతున్నారు, దేవా! మేము కోల్పోయిన వర్చస్సును మాకు తిరిగి ప్రసాదించునది."

పరమేశ్వరుడు వారికి అభయప్రదానం చేసి, వారితో పాటు తానుకూడా బ్రహ్మదేవుని దగ్గరకు వెళ్ళాడు. బ్రహ్మదేవుడికి పది కన్నులున్నా ఎదుట నిలిచిన పరమశివుని గుర్తించలేదు స్వాగత మర్యాదలు నెరపలేదు. అయితే పరమశివుడే బ్రహ్మదేవుని పలుకరించి కుశల ప్రశ్నలు వేశాడు. బ్రహ్మదేవుని అహంకారం అతని కన్నులలో ప్రతిఫలించింది అతడు పరమశివుని పలుకరించలేదు—

బ్రహ్మదేవునికి యింకో అవకాశం యివ్వాలని పరమశివుడు అట్టహాసం చేశాడు. ఆ నవ్వుకు బ్రహ్మాండ భాండం మారుమ్రోగింది. ఏడేడు భువనాలు గజగజ వణికిపోయాయి కాని బ్రహ్మదేవుడు మాత్రం పరమశివునితో మర్యాదకైనా ఒక మాట మాట్లాడలేదు. పరమేశ్వరుడు ఆగ్రహోదగ్రుడై గంతులేస్తూ విజృంభించి బ్రహ్మదేవుని అయిదవ తలకాయను తన ఎడమ చేతి బొటన వ్రేలి గోరుతో గిల్లివేశాడు. అంతేకాక బ్రహ్మ కపాలం వామ హస్తంలో పట్టుకొని పరమశివుడు నటరాజలాస్యం చేయసాగాడు.

దేవతలు ఆనందంతో చిందులు త్రొక్కుతూ నాట్యం చేశారు. 'ఓహో — కపాలీ, కపర్దీ, కాపాడవయ్యా దేవా! నీ కోపం ఉపసంహరించుకో చాలు. బ్రహ్మ అహంకారం త్రుంచేశావు' అంటూ వేల్పులు కీర్తించారు అప్పటికి పరమేశ్వరుని ఆగ్రహం అణిగి అతడు శాంతమూర్తి అయినాడు. బ్రహ్మ అహంకారం అణిగింది.

బ్రహ్మదేవుని అయిదవ తలకాయ పోయింది. ఆయనకు మేలు జరిగింది ఒక విధంగా, కాని ఆ తలకాయ పరమశివుని వ్రేలికి అంటుకుపోయింది. ఎంత విదిలించినా వదలటం లేదు. దానికి కారణం బ్రహ్మహత్యాపాతకం పరమశివుని చుట్టుకొనడమే. అంతేకాక శివునికి సంక్రమించింది పితృహత్యాపాతకం కూడా.

పరమశివుడు ప్రశ్నించాడు బ్రహ్మదేవుని, "నా చేతికి అంటుకుపోయిన నీ కపాలం విడిపోయే విధానం ఏమైనా ఉందా!"

బ్రహ్మదేవుడు సవినయంగా సమాధానం చెప్పాడు—"పరమేశా! మనం అందరం ఆ నారాయణుని దేహంలో అవయవాలము మాత్రమే నీవు నెరవేర్చింది ఆయన సంకల్పమే కాని అనుకోకుండా బ్రహ్మహత్యాపాతకం ఒడిలో వేసుకున్నావు. సరే ఈ కపాలం నిండేవరకు నీవు లోకాలన్నీ తిరిగి ముష్టిఎత్తు. ఈ కపాలం నిండినప్పుడు నీ పాపం పోతుంది."

పరమేశ్వరుడు బిచ్చమెత్తుకుంటూ లోకాలన్నీ తిరిగాడు. ఎవరు ఎంత ముష్టి వేసినా కపాలం నిండనేలేదు. అంతేకాక కపాలం నుండి భరించలేని దుర్గంధం వ్యాపించసాగింది పరమశివుడు తిరిగి బ్రహ్మ దగ్గఱకు వెళ్ళాడు. కాని బ్రహ్మదేవుడు కనులు మూసుకొని బ్రహ్మహత్యా పాతకుని మొగం చూడనన్నాడు.

ఇక పరమశివుడు బదరికాశ్రమమునకు వెళ్ళి "శ్రీమన్నారాయణచరణౌశరణం ప్రపద్యే!" "అన్యథాశరణం నాస్తి" అని విష్ణు దేవుని ప్రార్థించాడు. (పరమశివుడు అప్పుడు చేసిన విష్ణుస్తవం పద్మపురాణంలో సృష్టి కాండలో పొందుపరచబడి ఉంది) "ఓ దేవ దేవా! ఈ సమస్త సృష్టి నీ శరీరమే. మేము అందరమూ నీ దేహములోని అవయవాలము. మాత్రమే నీవు సర్వాంతర్యామివి. నీవేమాకు ఏకైక శరణ్యం!"

అంతటితో వాతావరణము అంతా తులసీ పరిమళంతో గుబాళించింది రెక్కలు ఉన్న పసిడి కొండవలె కనిపించే గరుత్మంతుడు అక్కడ వ్రాలాడు. శ్రీమన్నారాయణుడు సాక్షాత్కరించాడు దయార్ద్ర హృదయంతో, "నాయనా! పరమశివా! నీకు ఏం కావాలి! కోరుకో!" అన్నాడు.

పరమశివుడు, "దేవదేవా! ఈ దుర్గంధ భూయిష్ఠమైన ఈ బ్రహ్మ కపాలం పీడ వదిలించు. చాలు!" అని ప్రార్థించాడు.



శ్రీమన్నారాయణుడు వెంటనే తన కుడి బొటనవ్రేలితో తన వక్షస్థలం ఎడమ వైపుకు కత్తిరించాడు. పాతాళగంగ పైకి ఉబికిపట్లుగా నెత్తురు పొంగి పొరలి బ్రహ్మకపాలాన్ని నింపింది. వెంటనే బ్రహ్మకపాలం ముక్క చెక్కలై క్రిందపడిపోయింది.

ఈ కథ పార్వతికి వినిపించాడు పరమశివుడు. "నాకు పీడవిరగడ అయింది శ్రీమన్నారాయణుడు అంతర్ధానం చెందాడు. నేను 'శర్వాయ నమః' అని జపిస్తూనే ఉన్నాను. నాకు కూడ ఆనామమే యేర్పడింది."

"ఓం శర్వాయ నమః" అని అందరం విష్ణు సహస్ర నామ జపించుదాం.

—ఆంగ్లమూలము: శ్రీ.వి.యస్ కరుణాకరన్, అనువాదము: డా॥ నండూరి రామకృష్ణాచార్య: సంగ్రహణ: శ్రీనృసింహప్రియ, జూలై 1987-సంచిక

## స్వరూప జ్ఞానము

* నిప్పు మంట వేయువాడు మొదట చాల చిన్న చిన్న కట్టె పుల్లలను మంటలేసిన తరువాత పెద్ద పెద్ద కట్టెలను వేసిన కాలునే గాని మొదటనే పెద్ద కట్టెలు వేసి ఊది యూది సంకట పడవలసిందే కాని అగ్ని ప్రజ్వలింపదు గదా! అలాగున బ్రహ్మ జ్ఞానాగ్ని ప్రకాశించుటకు ప్రథమమున పుణ్య కర్మానుష్ఠానము నిష్కామముగా శ్రద్ధతో చేయుటయు గురు శుశ్రూష దైవభక్తి మొదలైనవి యనుష్ఠించి తరువాత యోగానుష్ఠానము వేదాంత విచారణ జ్ఞానము మొదలగునవి అనుష్ఠించవలయును. ఇట్లు చేయని వారికి స్వరూప జ్ఞానము కలుగుట ప్రయాసకరము.

* సోహంపరులై యుండదలంచువారు మొట్టమొదట సోమరితనమునకు తర్పణము విడువవలెను. మోక్షమార్గము సోమరులు పోయెడు త్రోవ గాదనియు సోహం పరులు వెళ్ళెడు మార్గమనియు తెలుసుకున్న తర్వాత మాత్రమే అట్టి పద్ధతిలో ప్రవేశించ వలయును. లేనిచో తమకు క్షేమము కలుగ బోవుటయే గాక, లోకములో గల ముముక్షువులకు గూడ యాతంకము గలుగ చేసినవారే యగుదురు.

* మనోవాక్కాయ కృత్యములు మూడును ఒక్కే విధముగా లేనివారి అధ్యాత్మ విషయకమగు అనుష్ఠానములన్నియు వ్యర్థములే. ఎట్లన ప్రమిద ఒక

స్థలమున, తైలము మరియొక స్థలమున వత్తి యింకొక స్థలమున పెట్టి దీపమును ముట్టించిన వెలుగదు కదా!

—మహర్షి సద్గురు శ్రీ మలయాళ స్వాములవారు ఏప్రిల్ 1973 'యదార్థభారతి' మాసపత్రిక

## భద్ర వాక్యములు

శ్లో॥ అద్యం యత్త్ర్యక్షరం బ్రహ్మ త్రయీ యస్మిన్ ప్రతిష్ఠితా।
సగుహ్యోఽన్యస్త్రివృద్వేదో యస్తం వేద స వేదవిత్॥

తా॥ సర్వవేదములలో మొదటిదియై అకారోకార మకార స్వరూపమయి నందున త్ర్యక్షర స్వరూపమైన యే వేదసారము గలదో, ఏ మూడక్షరములందే మూడు వేదములున్నవో అది మరియొక త్రివృద్వేదము. అయ్యదియే ప్రణవమను నది. వేదమంత్రములలో శ్రేష్ఠమయినది కనుకను, పరమార్థ స్వరూపమగు బ్రహ్మమును వివరించునది కనుకను, పరమార్థకమై నందున జప తపంబుల వారికి మోక్షప్రదమైనందునను మిక్కిలి రహస్యము, గోప్యమైనది. ఎవడీ ప్రణవమును స్వరూపముతోను అర్థముతోను యెరుంగునో వాడే వేదవేత్తయగును.

—యదార్థ భారతి, ఫిబ్రవరి 1958 సంచిక

శ్లో॥ స్మరణాత్కీర్తనాద్వాపి శ్రవణాచ్చ జపాదపి।
బ్రహ్మ తత్ప్రాప్యతే నిత్యమోమిత్యేతత్పరాయణమ్॥

తా॥ ఓం కారము యొక్క స్మరణవలనను, ఉచ్చారణ వలనను, శ్రవణము వలనను, జపము వలనను, పరబ్రహ్మము పొందబడుచున్నది. అదియే మోక్ష సాధనము.

—యదార్థ భారతి, ఫిబ్రవరి 1958 సంచిక.

## శ్రీ సద్గురు వాణి

జీవుడు దేహోత్పత్తికి కారణ భూతములైన "సత్త్వ, రజస్తమో గుణముల నతిక్రమించి బ్రహ్మజ్ఞానము చేత త్రిగుణంబుల నడంచి పుట్టుక, చావు, ముసలితనము, దుఃఖములు మొదలగువానిని పొందక జీవన్ముక్తుడై యమృతత్వమును పొందుచున్నాడు. ఈ స్థితి కలుగుటకు ప్రతిరోజును నొక యనుకూల సమయమును ప్రతివారును యేర్పాటు చేసికొని సాధన చేయవలెను. బ్రహ్మముహూర్తము



నుండి మొదటి యామము అనగా తొమ్మిది గంటల లోపల యుండుట మంచిది. కావుననే పరమ ఋషులు ప్రాతః కాలమునకు బ్రహ్మ ముహూర్తమని పేరిడిరి. ఏ కార్యమైనను శుభముహూర్తమున జేయుటెంత శ్రేయస్కరమో, యీ ధ్యానానుష్ఠానములను బ్రహ్మముహూర్తములోనే జేయుట మంచిది; శరీరమొక యంత్రము వంటిది. గడియారమేలాగున సమయమునకు మన ప్రయత్నము లేకనే గంట కొట్టుచున్నదో అలాగున ఒకసమయమును తప్పక ధ్యానమున కేర్పాటు చేసుకొనిన, మనస్సు మొదలగు యింద్రియములన్నియు మన విశేష ప్రయత్నము లేకనే ధ్యానోన్ముఖములై పరమశాంతిలోనికి, ఆత్మసన్నిధిలోనికి, నిశ్చల స్థితిలోనికి తీసుకొని వెళ్ళుచుండును. ఇదే నియమిత సమయముచే గలిగెడు ప్రయోజనము. మీలో నెవరైనను నియమితాహారము, నియమిత నిద్ర, నియమిత పరిశ్రమము గలిగి యున్నచో గడియార సహాయము లేకనే నిద్రనుండి జాగరణయు, ఆకలియు, విసర్జనము అప్రయత్నముగనే కలుగుచుండును. అయితే యెల్లప్పుడును అనివార్య కారణముచే నిర్వహించకపోయినను భోజనమునకు ముందుగా తప్పక కొంత వరకైనా అట్టి జపధ్యాన పారాయణాదులు చేసియే భుజింపవలయుననెడి యొక వ్రతమును బూనిన మాత్రమే యీ సంసారములో మీకు తరుణోపాయము లభించును. అట్లుగానిచో సేతు స్నానమునకు వెళ్ళి సముద్రములో గల కల్లోలములణగిన తరువాత స్నాన మొనర్చవలయునని తలంచు వానియొక్క గతియే సంభవించును. సముద్ర ముండువరకు అలలుండును గదా. అలాగున సంసారమునందుండు వరకు ఒక కార్యముపై మరియొక కార్యము, ఒక సంకల్పముపై మరియొక సంకల్పము వచ్చుచునే యుండును.

పతివ్రతయైన స్త్రీ తన భర్త యింటికడ నుండ భర్తకు భోజనము పెట్టక ముందుగ భుజించు నారి యెట్టిదియో, గురు శుశ్రూషా నిరతుడగు అంతేవాసి భిక్షాన్నము తెచ్చిగాని లేక పచన మొనర్చిగాని గురుదేవునకు పెట్టక ముందుగ భుజించువాడెట్టి గుణము గలవాడో, దేవతారాధన పరుడగు అర్చకుడు నైవేద్యము సమకూర్చి భగవతారాధన చేయక భుజించువాడెట్టి లక్షణము కలవాడో అలాగున మానవున కేర్పడిన దైవ కార్యములను జేయక భుజించువాడును అట్టివాడే యగునని మీలో మీరే నిశ్చయించుకొనవలయును

పైన చెప్పిన ముగ్గురును నెట్టి పాపగుణము గలవారో అలాగున దైవ కార్యముల నొనర్చక భోజనము చేయరాదని దృఢముగా నొక వ్రతమును మీరను

క్షించిన మాత్రమే యీ సంసారమునుండి తరించగలరు. రాత్రియందు కారు చీకటిలో ఒక ఒక ప్రకాశమైన దీపమునుండి మీరింతకెంతకు దూరముగ వెళ్ళెదరో అంతకంతకు అంధకారము లోనికి (ఏమియు కనిపించని స్థితిలోనికి) బోవునట్లు స్వప్రకాశమై, జ్ఞానమయమై, ఆనంద ఘనమైయుండు ఆత్మలోనుండి మనో బుద్ధులలోనికిని, జ్ఞానేంద్రియములలోనికి, కర్మేంద్రియములలోనికి, దేహములోని కిని, దృశ్యములోనికిని యెంతకెంతకు జారిపోవుదురో అంతకంతకు గాఢాంధకారా జ్ఞానములోనికి దిగిపోవుచున్నారని తలంచవలయును.

పై చెప్పినవారు దీపము చెంతకు రాగా రాగా నేలాగున చీకటి నశించి వస్తువులు గనబడునో, తమోరహిత స్థితి కలుగుచుండునో, ఆలాగున మీ మనస్సును దృశ్యము నుండి, దేహామునుండి, వాగాది కర్మేంద్రియాలనుండి చక్షురాది జ్ఞానేంద్రియములనుండి, బుద్ధ్యాద్యంతరింద్రియముల నుండి క్రమముగా ఆత్మలోనికి లయ పఱచులాగున చేసికొనిన అమృతత్వమును, మోక్షమును, దైవత్వమును యీ జన్మ లోనే బొందగలరు. అది శివము, అమృతము, అద్వైతము.

ఈ స్థితి కలుగునప్పుడే మానవుని దేహమనెడి దేవాలయమునందు దేవతా ప్రతిష్ఠ చేసినట్లు జన్మ సార్థకత నొంద గలుగును. లేనిచో ప్రతిష్ఠలేని పాడు దేవాలయము వంటిదేయగును.

—యదార్థ భారతి, మార్చి 1979 సంచిక.

మహర్షి పలుకులు

* సాధువులు సంసారులలో చేరినచో సంసారులను సాధుగుణములు గలవానిగా చేయవలసినదే గాని సాధువులు సంసారులుగా మారకూడదను తత్త్వమును సదా జ్ఞప్తిలోనుంచి ప్రవర్తించవలయును.

* ప్రపంచములో గల దేనికిని లొంగకుము. అట్లు లొంగనివానికి యీ లోకము లొంగిపోవును. అట్లుగాక యే విషయమునకైనను లొంగినచో లోకమున చిన్న స్థితిక మందు వానికి కూడ లొంగి యుండవలసి వచ్చును.

* సోదరా! నీవు గృహమును విడిచి దూరముగ పోయిన చాలదు. తపస్సనెడు జ్ఞానాగ్నిలో అంతః కరణ వాసనలను దహింపజేసి అవిద్యనుండి దూరముగ పోయిన మాత్రమే (అవిద్య తొలగిన మాత్రమే) జన్మరాహిత్యము కలుగునని మరువకుము.



* సోదరులారా! సోదరీమణులారా! మీరు దేహమును మాత్రము ఆశ్రమము లేక మఠములలోనుంచి మనస్సును సంసారములో గృహములో నుంచేలాగున యత్నించవలదు. హృదయమును మఠములోను దేహమును గృహములోను నుంచే లాగున జూడుడు- అట్లైన మాత్రమే శాంతి నొందగలరు. లేనిచో అశాంతియే గలుగును.

— శ్రీ మహర్షి సద్గురు శ్రీ మలయాళ స్వాములవారు

శ్రీ విశాఖ యువజన పరిషత్ వారు శ్రీ మాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యుల వారి 'రామాయణ ప్రవచనము' 18 రోజులపాటు తే 8-3-88 నుండి శ్రీరామ నవమి వఱకు శిశుమందిర్ లో యేర్పాటు చేశారు. మొదటి దినమున కంచికామకోటి పీఠాధిపతులు శ్రీ శ్రీ శ్రీ జయేంద్ర సరస్వతులవారు విశాఖ రావడం అవకాశంగా తీసుకొని విశ్వహిందూ పరిషత్ వారు సమావేశం యేర్పాటు చేయటం విశాఖపుర వాసుల అదృష్టం.

మృదు మధురంగా సరళంగా తెలుగులో శ్రీ శ్రీ శ్రీ కంచి కామకోటి పీఠాధిపతులు ఆ సమావేశానికొచ్చిన వారి నుద్దేశించి యిచ్చిన మహత్తరమైన సందేశం సాధ్యమయినంత వఱకు యధాతథంగా విపులీకరించటం జరిగింది.

—సంకలనకర్త.

ధర్మో రక్షతి రక్షితః

ధర్మాన్ని మనం రక్షిస్తే ధర్మం మనలను రక్షిస్తుందని మనం భావం చెప్పుకుంటాము. కాని అది సరికాదు. ధర్మానికి గ్లాని లేదు. ధర్మాన్ని యెవరైనా రక్షించడానికి అది పాడయిపోలేదు. ధర్మానికి పాడవటం, తగ్గటం, యెక్కువవటం, అభివృద్ధి, నాశనం ఉండదు. అది సంపూర్ణమైన స్థితిలో నిరాకారంగా జీవించే వుంటుంది. ఆచరణలోనే ధర్మం వుంది. ధర్మాన్ని మనం ఆచరించక ధర్మం తగ్గిపోయింది, దేశం పాడయిపోయింది, మనుషులు పాడయిపోతున్నారని వాపోతుంటాము. అందులో మన భాగం కూడ ఉందని మర్చిపోతుంటాము. మనకు భగవద్గీత, భాగవతం, భారతం, రామాయణం వున్నాయి. రామాయణము తప్ప తక్కినవన్నీ ప్రవచనములు.

శ్రీకృష్ణుడు భగవద్గీతలో ధర్మం నశించినప్పుడు దుర్మార్గులను శిక్షించి,

సన్మార్గులను రక్షిస్తానని అన్నారు. అంటే ధర్మం ఆచరించని వారిని శిక్షించి, ఆచరించేవారిని రక్షిస్తానని చెప్పినట్లు అర్థం చేసుకోవాలి.

రామాయణము మానవజీవిత విధానం యెలాగున వుండాలో ఆచరణలో చూపించింది. రామ + అయనము. అయనము అంటే జీవితానికి దారి చూపించే మార్గము అయనము రామాయణములోనే వుందిగాని, భాగవతంలోగాని, భారతంలో గాని లేదు. రామాయణము అంటే ధర్మాన్ని ఆచరించి చూపే స్వరూపము.

ఎన్నోసార్లు రామాయణము విన్నాం, వింటాం కాని చాలు అనిపించదు. వింటున్నకొద్దీ మనకు అందులో మన జీవిత విధానం యే విధంగా ఉండాలో తెలుస్తుంది.

ప్రపంచములో యెన్ని భాషలున్నాయో అన్ని భాషలవారికి రామాయణము తెలుసును రామాయణము విదేశాల్లో ప్రతిభాషలోనికి అనువదించబడి విద్యార్థుల స్థాయినుంచీ వారి పాఠ్యపుస్తకాలద్వారా బోధించబడుతున్నది. దానికి కారణం మాతృభక్తి, పితృభక్తి, స్నేహధర్మం, శరణాగతులను రక్షించే విధం, సతీపతులు యెలావుండేది, సోదరప్రేమ యే విధంగా వుండాలి అందులో చూపించడమే। రామాయణము వక్కటే మనిషిని తీర్చిదిద్దడానికి మార్గము. అందుకే నాకు రామాయణమంటే యెక్కువ యిష్టం, ప్రాణం.

రామాయణములో మనకు ముగ్గురు సహోదరులు కన్పిస్తారు. వారు 1) రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు 2) వాలి సుగ్రీవులు 3) రావణ కుంభకర్ణ విభీషణులు.

మొదటి సహోదరులలో రామలక్ష్మణులు సోదర ప్రేమకు ఆదర్శంగా కన్పిస్తారు వారిరువురూ సవతి పుత్రులయినా లోకానికంతటికీ ఆదర్శంగా సోదరుల జీవన విధానాన్ని సూచిస్తున్నారు.

రెండవ సహోదరులలో 'వాలి'రజోగుణము చేత అహంకారియై తన స్వంత తమ్ముడయిన సుగ్రీవుడిని బహిష్కరించినప్పుడు సుగ్రీవుడు శ్రీరాముని అండదండలతో అన్న 'వాలి' వినాశనానికి కారణమయ్యాడు.

మూడవ సహోదరులలో రావణుడు అమిత పరాక్రమవంతుడు. విశేషించి శివభక్తి పరాయణుడు. పన్నెండు లోకాలలోనూ మెచ్చదగినవాడయుండి ఒక చిన్న



బలహీనత వల్ల తనకూ తన జాతికీ వినాశనం కొనితెచ్చుకున్నాడు. కుంభకర్ణుడు అన్నకన్నా కొద్దిగా మంచివాడు. కాని సోమరితనంతో తిని త్రాగి నిద్రపోయేవాడు. అప్పుడప్పుడు అన్నకు హితవు చెప్పినా అతనినే అనుసరించేవాడు. అందుకే అతనూ నాశనమయ్యాడు. ఇక విభీషణుడు చిన్నవాడయినా రావణునికి చాలాసార్లు హితవు చెప్పి లాభం లేక యిక అన్నను అనుసరిస్తే తాను కూడ నాశనమవుతానని గ్రహించి శ్రీరాముని శరణుజొచ్చి లంక పూర్తిగా నాశనం కాకుండా కాపాడగలిగాడు.

మొత్తం ముగ్గురు సహోదరులలో మొదటి సోదరులు ధర్మార్థ కామమోక్షములకు ప్రతీకగా సుఖంగా వున్నారు. రెండవ సోదరులలో వాలి పోయాడు. మూడవ సోదరులలో విభీషణుడు మాత్రం సుఖంగా వున్నాడు దీనిని బట్టి మనకు తెలుస్తుందేమిటంటే ధర్మపథాన్ని ఆచరించనివాడు పోయాడు. ఆచరించిన వాడు సుఖంగా వున్నాడు.

నేటి సమాజంలో యువకులు పూర్తిగా తప్పుత్రోవలో నడుస్తున్నారు. కుంభకర్ణుని పంథాలో నడుస్తున్నారు. తినడం, త్రాగడం, స్కూటర్ల మీద షికార్లు కొట్టడం, బాధ్యతారహితంగా ప్రవర్తించడము చేస్తున్నారు. ఈ రోజుల్లో ప్రతీ తలిదండ్రులూ మా పిల్లలు మా మాట వినడంలేదు. అని మొత్తుకోవడం మనం చూస్తూనే వున్నాం. అసలు పిల్లలు ఆ విధంగా తయారుకావడానికి తల్లిదండ్రులే కారణం।

స్వాతంత్ర్యపోరాటంతో సర్వశక్తులూ ధారపోసి 40 సంవత్సరాల పాటు మన సంస్కృతి, మన తత్త్వం పూర్తిగా వాళ్ళు మర్చిపోయి,పిల్లలకు అవగాహన నేర్పక, యీనాటి పిల్లలకు మనమంటే యేమిటో తెలియని పరిస్థితి కలిగింది.నలభై సంవత్సరాల Generation gap వల్ల మనం చాలా పోగొట్టుకున్నాము।

భోగభూమిపైనున్న విదేశీయులు మన కర్మభూమిమీద ఆసక్తి కలిగి మన సంస్కృతిని అనుసరించడానికి కృషి చేస్తున్న యీ తరుణంలో, కర్మభూమిపైనున్న మనం భోగభూమిపై నున్నవారిని అనుకరించడానికి తాపత్రయ పడుతున్నాం।

ఒక చిన్న ఉదాహరణ చెప్పుకుందాం. మన ఇంటికి వచ్చిన అతిథులు వెళ్ళిపోతుంటే 'మళ్ళీరండి' అని చెప్పేసంస్కృతి మనది. అటువంటిది 'టాటా' అనే

మాటలతోపాటు 'మళ్ళీ' రావద్దు అనే విధంగా చేతులతో సైగ చేసే స్థితికి దిగజారేము.

జాప్యరుషాపము, లాండ్రీని, సినిమాహాలును, యింట్లోకి తెచ్చేసుకున్నామని మురిసిపోతుంటాము. కాని మనఇంట్లోనున్న దేవుణ్ని తరిమేస్తున్నామన్న విషయం తెలుసుకోలేకపోతున్నాము. ఉదయం లేచిన దగ్గఱ నుంచి రాత్రి నిద్రపోయే వఱకూ క్షణం తీరిక లేకుండా పోతుందని సాకులు చెప్తుంటాం.

మనస్సును నిలకడ చేసుకొని యీ భక్తిమార్గము అనుసరించాలి. తలిదండ్రులు చిన్నప్పటినుండీ తమ పిల్లలలో ధర్మచింతన ఉండేటట్టు చేయకపోతే భవిష్యత్తులు శూన్యమవుతాయి. ప్రతీ విషయంలోను నియమంతో చేస్తేనే ఫలితం వస్తుంది. అది లేకపోతే యేమీ మిగలదు.

ప్రతీ వక్కరూ ధార్మికమైన జీవితం అంటే ధర్మాచరణముతో కూడిన జీవితం గడపాలని మా ఆకాంక్ష। అపుడు మన కర్మభూమి మళ్ళీ జగద్విఖ్యాతి చెందుతుంది.

ధార్మికమైన జీవితం గడపడానికి మాకు సమయం లేదు అని చెప్పేవారికి కొన్ని సూచనలు. ప్రత్యేకముగా సమయం కేటాయించ నక్కరలేకుండా మనం నిత్యం చేసే కార్యక్రమాలలోనే మనం దైవాన్ని స్మరించవచ్చును. ఉదయం నిద్రలేస్తూనే పృథ్విని స్పృశిస్తూ నమస్కరించాలి. స్నానం చేసేటప్పుడు జలాన్ని అంటే గంగను నమస్కరించాలి. స్నానానంతరం సూర్యనమస్కారం చేయాలి. అనంతరం మన సాంప్రదాయం ప్రకారం తిలకంగాని, కుంకుమగాని, విభూతిగాని, తిరునామంగాని, సింధూరంకాని నొసటిమీద ధరించాలి. విధి వ్రాతలు నొసటిమీద వుంటాయి గనుక నొసటిమీద ధారణ చేయాలి. తరువాత మన యింటిలో యీశాన్య మూలలో దేవుని ఫొటోలవద్ద తైలదీపం వెలిగించి భక్తితో గణేశుని మొదలుకొని ఆంజనేయస్వామి వఱకూ స్తోత్రాలు పారాయణ చేయాలి. ఏదయినా భుజించేటప్పుడు దానిని భగవంతునికి నివేదన చేసి భోజనము చేయాలి. ఆఫీసుకి వెళ్ళేటప్పుడుగాని కార్యార్థియై వెళ్ళేటప్పుడుగాని భగవంతుని స్మరించుకుని వెళ్ళాలి. సాయంత్రం యింటికి రాగానే పాదరక్షలు పక మూలన పెట్టి కాళ్ళు, చేతులు, ముఖం కడుగుకొని మరల తైలదీపం వెలిగించి భగవంతునికి నమస్కరించాలి.



ఈ విధమయిన కార్యక్రమాలలో పాల్గొంటే మనస్సుకు శాంతి। ఆలయాలలోను యింట్లోను తైలదీపం వెలిగితే జీవితాలకు కాంతి।

మనం యివన్నీచేసి కొంతశక్తిని సంపాదించినప్పుడు మహాత్ముల సందేశాలను విని ఆచరించడానికి తగిన అర్హత కలుగుతుంది. సత్సంగాలు, సంకీర్తనలు, ప్రవచనములు మొదలగు కార్యక్రమాల్లో విరివిగా విధిగా పాల్గొని ధర్మాచరణ చేస్తూ మెలగవలసిందిగా సందేశమిస్తూ రామాయణము చెప్పటంలో దిట్ట అయిన శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్యులవారి ప్రవచనం పది నిముషాలసేపు మేమూ వింటాం అని ఉపన్యాసం ముగించారు.

రేపల్లెలో పూతన :

శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులవారి ప్రవచనముల సందర్భముగా ముముక్షువులు, పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ లక్ష్మణయతీంద్రులవారు రెండు మూడు పర్యాయములు రావటం సంభవించినది. తే 12-3-88 దిన వారు వచ్చినప్పుడు శ్రీమాన్ శ్రీభాష్యం వారు మాట్లాడమని కోరగా, "మా పీఠాధిపతి అయిన అప్పలాచార్యస్వామి వారుండగా మాట్లాడడానికి గుండా। చెరువా। కాని వారే మాట్లాడమన్న తర్వాత మరి తప్పదు' అంటూ శ్రీశ్రీశ్రీ లక్ష్మణ యతీంద్రులవారు తమ ఉపన్యాసము కొనసాగించారు——

శ్రీరామైక శరణ్యుల బంధుత్వంతో పుట్టిన శరీరం నాది। నెమలిపింఛమును, వేణువును ధరించిన శ్రీసీతారామచంద్రులవారి పాద రేణువును నేను.

ధారావాహికంగా సాగుతున్న శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులవారి ప్రవచనములతో నేను మధ్యన వచ్చి కలిగించుకోవడం సమంజసము కాదు కాని వారే మాట్లాడమన్నారు కనుక నాకు కలిగిన ఒక అనుభూతిని మీకు తెలియజేస్తాను.

భగవంతుని అనుగ్రహము పొంది ఆయన స్పర్శతో కుబ్జ మామూలు మనిషయినది. అలాంటిది పూతన కూడ స్త్రీయే కదా। మరి ఆవిడ కృష్ణుడిని చంపడానికి రేపల్లె వచ్చింది. మరి పాలివ్వడానికి కృష్ణుడిని పట్టుకుంది కదా। భగవంతుని స్పర్శ ఆవిడలో యేమీ మార్పు తేలేదా। అనే ఆలోచన వచ్చినప్పుడు నాకు కలిగిన 'దర్శనాన్ని' మీకు అందిస్తున్నాను.

కంసుడు పూతనతో, 'నన్ను చంపే వాడెవడో పుట్టాడుట. అందుచేత నువ్వు రేపల్లె వెళ్ళి చిన్న పిల్లలందరినీ చంపు' అంటాడు. దానికి పూతన చిరాకు పడుతుంది. ఇంత చిన్నపని నాకు అప్పచెప్పుతాడా! ఇతనికి మతిగాని చెడిందా? ఇతని వద్ద కొలువు చేయడం కంటే దేని కోసనో పట్టుకుంటే నాకు గౌరవంగా వుండేదేమో. ఇంత చిన్న విషయాలకు యింత విపరీతంగా ఆందోళన చెందుతున్నాడని శత్రువులకు తెలిస్తే చులకనగా చూడరా? అని పరిపరి విధాలా విసుక్కుందిగాని రాజాజ్ఞ ఆచరించక తప్పదు గనుక కృష్ణుడిని అంత మొందించడానికి మానవస్త్రీగా మారి స్తనములకు విషం పూసుకొని రేపల్లెలో అడుగు పెట్టింది.

అంతవరకు ఆమె రాక్షస ప్రవృత్తితోనే ఉన్నాది కాని రేపల్లెలో అడుగు పెట్టి అక్కడి వాతావరణంలోనికి రాగానే ఆమె హృదయంలో చిత్రమైన ప్రకంపన ఆవరించింది. పూతనకు ఆశ్చర్యం కలిగింది ఏమిటి? తనలో ఒక్కసారిగా యింతమార్పు వచ్చినదేమి? మనుషుల వేషం వేసి వచ్చినందుకు యిలా వుందా? రోషం రాదేమి? కనుల ముందు చూస్తుంటే యేదో తన్మయత్వము కన్పిస్తుంది. అక్కడి మనుషులు యెవరూ నడవడము లేదు. నాట్యం చేస్తున్నంత ఉల్లాసంగా కదులుతున్నారు. మాట్లాడుతున్నట్టు లేరు గానం చేస్తున్నట్టున్నారు. ఆవులు పాలను ధారలో యిస్తున్నాయి. ఆవుల కొరకు పాములు పడగ యెత్తినట్టున్నాయి. రాళ్ళు రప్పలు కూడ ఆనందమే రూపొందిందా అన్నట్టున్నాయి. అంతా ఒక విధమైన చైతన్యంతో ఉన్నట్టున్నాది పూతనకు నేను నేనుగా కాళ్ళు బయట పెట్టగలనా? అని సందేహం కలిగింది ఆమెకు తెలియకుండానే ఆమె పాదాలు కదులుతున్నాయి. నదులన్నీ సముద్రంలో చేరుతున్నట్లుగా అక్కడి వారందరూ ఒక యింట్లోకి వెళ్తున్నారు కాని యెవ్వరూ తిరిగి రావటం లేదు. లోపల యెంత స్థలమున్నదో అనిపించింది. పూతన ఆశ్చర్యంగా యేమిటిది! తనకు తెలియకుండానే ఆ యింటి దగ్గరకు వచ్చేసానే! అనుకుంది. పూతన ఆ విధంగా సంభ్రమంగాలోనికి వస్తుంటే సాక్షాత్తూ లక్ష్మీదేవి కృష్ణుణ్ని చూడడానికి వచ్చిందని అందరూ అనుకున్నారుట. పూతనకు దూరం నుండి ఆ యింటి లోపల భాగం అంతా నల్లగా కనిపించింది. కాని లోపలకు వెళ్ళిన తర్వాత చూడగా ప్రతీదీ నీలంగానే కన్పడుతున్నాది. ఇంటిలో ఉయ్యాల కన్పించింది ఆ ఉయ్యాల చూస్తే విశ్వమంతా అక్కడే ఉన్నట్లు అనిపించింది. చల్లని కాంతులు, పరిమళాలవల్ల ప్రపంచమంతా కరిగిపోయింది. నేను నేనేనా? నాకేమైంది? మళ్ళీ నేను నేనగుట సంభవమా? అని ప్రశ్నించుకుంది. తన్మ



యత్వంతో స్పృహ తప్పింది. అంతలోనే స్పృహ వచ్చింది. కాని తను మొదటి పూతన కాదు. ఇదేమీ భౌతిక వికారము కాదు అనిర్వచనీయము అద్వితీయమునై అంతరంగంలో తెర తొలగించినట్లయింది.

బోసి నవ్వులతో ఉయ్యాలలూగుచున్నాడు కృష్ణుడు ఆ నవ్వే సమ్మోహనాస్త్రము! పాలివ్వాలని అనిపించింది ఎత్తుకుంది అంతే! జగత్తంతా తన్మయత్వంతో ఆనంద సముద్రములో మునిగి తేలుతున్నట్టుంది. అంతటి అనుభూతిని యెవరు అనుభవించారు? పాలివ్వాలన్న కోరిక అంతకంతకూ బలం కాసాగింది. విషం పెట్టుకొని వచ్చిన విషయం జ్ఞాపక మొచ్చింది. కాని ఆ విషం కృష్ణుని యేమీ చేయలేదని తెలుసుకునే స్థాయికి ఆమె ఎదిగింది. ఒక్కసారి ఆ పెదవులు వక్షస్తనములకు తగిలాయి. ఆహా! ప్రకృతే స్తంభించింది కాలగమనం ఆగిపోయింది. కృష్ణుడు పూతన పాలనే కాక ప్రాణాలను కూడ తనలో ఐక్యం చేసుకున్నాడు. పూతన జన్మ తరించింది—ఆ విధంగా నాకు దర్శనము కలిగిందని శ్రీశ్రీశ్రీ లక్ష్మణ యతీంద్రులవారు భావోద్వేగంతో శ్రోతలను రేపల్లెకు తీసుకువెళ్ళారు.

* * *

తే 25-3-88దీ సాయంత్రం శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులవారు ప్రవచనం చేస్తుండగా కంచి కామకోటి స్వాములవారు శ్రీశ్రీశ్రీ జనార్ధనానందేంద్ర సరస్వతి స్వాములవారు వచ్చి భక్తుల నాశీర్వదించి యిచ్చిన సందేశము:

* మధురం మధురాక్షరం అని వాల్మీకి రామనామాన్ని కోకిలలా పలికారు.

* నామం ప్రధానం. అంతరమైన సమాధిగాని, బాహ్యమైన సమాధిగాని నామరూపాన్ని విశ్లేషించాలి.

* శ్రీరాముని నామాన్ని, రూపాన్ని స్వీకరిస్తే ముక్తి వస్తుంది, ఆయన నామంలో ఎంత ప్రశస్తి ఉందో ఆయన రూపంలో అంత ప్రశస్తి ఉంది. ఈ రెండింటినీ స్వీకరించేవారు ఉత్తములౌతారు.

* ఆంజనేయుడు ఆయన భక్తులలో ఉత్తమోత్తముడు. ఆయన కేవలం రామనామాన్ని ఉచ్చరించడానికే చిరంజీవిగా కల్పాంతము వరకు ఉంటానన్నాడు.

* రామనామం వంటి మధురాతి మధురమైన నామం యేదీ సులభం భగవన్నామ కీర్తనం.

* ద్విత్వవర్గ సంయుక్తవర్ణం రామనామము, శివనామము. ఈ రెండిటినీ పలకడం చాల సులభము.

* భగవదవతారములు యెన్నో వుంటే రామావతారము, కృష్ణావతారములు విశిష్టమైనవి. ఈ రెండిటిలో రామావతారము ఉత్కృష్టమైనది.

* నిశీధిలో వచ్చిన అవతారం రామావతారం! మరియు కృష్ణావతారం! అలానే లింగోద్భవకాలం కూడ నిశీధి సమయమే.

* * *

శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యుల వారు తే 8-3-88ది నుండి శ్రీరామ నవమి వరకు మొత్తం 18 రోజులు 'శ్రీరామాయణము' ప్రవచనము చేశారు. విశాఖ యువజన పరిషత్ వారు శివమందిరములో యేర్పాటు చేయబడిన యీ ప్రవచనములకు ఆధ్యాత్మిక చింతన కలిగిన భక్తులు వయసుతో నిమిత్తం లేకుండా నిర్ణీత సమయానికి వేల సంఖ్యలో వచ్చేవారు.

కొంతమందీ వక్తలు మాట్లాడుతుంటే వినబుద్ధివేస్తుందిట. మరికొంతమంది వక్తలు మాట్లాడుతుంటే మళ్ళీ మళ్ళీ వినాలనిపిస్తుందిట. కొద్దిమంది మాటలాడుతుంటే సాక్షాత్తూ సరస్వతీదేవి వక్త చేత మాట్లాడిస్తున్నదా! అనిపిస్తుందిట. కాని శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులవారు మాట్లాడుతుంటే సరస్వతీదేవి ఆయన నాలుకమీద నిలబడి నాట్యం చేస్తున్నట్టుంటుంది, అని కీ శే. తెన్నేటి విశ్వనాథం గారు అనేవారుట మా మిత్రులు శ్రీ కె. వెంకటరావుగారు చెప్పారు. అప్పలాచార్యులవారు మాటలాడుతుంటే శ్రోతలకు వారు చిన్నపిల్లలయినా, వృద్ధులయినా వక్తతో సాన్నిహిత్యాన్ని కలిగినట్టే వుంటుంది. అంటే ఎంతోమంది వింటున్నా ప్రతీవొక్కరికీ తమతో చెప్తున్నట్టుగానే అన్పిస్తుంది. ఇది అపూర్వం! ఎంతటి విషయమైనా శ్రోతలకు అర్థమయేటట్టు చెప్తారు. వాల్మీకి రామాయణంలో ప్రతి శ్లోకం పల్లించి దాని భావం కాలానుగుణ్యముగా, ఆచరణయుక్తంగా, హృదయ గమ్యంగా చెప్తారు. ధారావాహికంగా, ఆశువుగా, ఉత్కంఠతో అప్పలాచార్యులవారు చెప్పిన అమూల్యమైన విషయాలలో సంకలనకర్త వీలయినంతవరకు చాల విషయాలను యిందు పొందుపఱచడము జరిగింది. ముందుగా కాలానుగుణముగా వారు చెప్పిన సూక్తులు తెలియజేసి తరువాత శ్రీరామాయణము, అందలి పాత్రల విషయమై వారు విపులీకరించినవి తెలియజేస్తాను.

—సంకలన కర్త.



మాణిక్యమాల:

* దేవాలయమునకు వెళ్ళినపుడు పళ్ళుకాయలు పళ్ళెంలో పట్టుకొనిగాని, సంచిలో పెట్టుకొనిగాని తీసుకువెళ్ళాలి. అలా తీసుకువెళ్ళితే దేముడిదని అర్థం! చేతులతో పట్టుకొనివెళ్ళితే మనదని లెక్క! మనచేత్తో యివ్వకూడదు. పళ్ళెంలో వుంచి తీసుకువెళ్తే ఆయన తీసుకుంటాడు- ఆత్మ సమర్పణము చేయాలి. ఆత్మ ఆయనది. అది తెలుసుకుని అర్పించాలి.

* దేమునివద్దకు వెళ్ళినప్పుడు చంకలో యేమీ ఉండకూడదు. ఉంటే పాపం! దేమునికి మన హృదయం కనబడేటట్టుగా బట్టలు తీసివుంచాలి.

* మనకు కళ్ళు కనపడడము లేదని మనం కళ్ళద్దాలు పెట్టుకుంటున్నాము. కాని మనకు కావలసింది యీ కళ్ళద్దాలు కావు. సుదర్శనం కావాలి. అంటే ఆధ్యాత్మిక అవలోకనం కావాలి. ప్రతీవారిలోనూ భగవంతుని చూడగలిగే నేత్రములు కావాలి.

* మనకన్నా తక్కువ వారిని ఆక్షేపించకూడదు. అది హౌళ్యము!

*కొడుకు తనకేమీ చేయకపోయినా, కొడుకు సౌఖ్యంతో తన దుఃఖములను మఱచి సుఖపడేవాడు తండ్రి!

* భర్త యెక్కడికైనా వెళ్ళేటప్పుడు భార్య గుమ్మందాటి వచ్చి సాగనంపకూడదు.

* వందమంది కొడుకులున్నా ఒక్క భార్య సుఖం మేలు! అందరూ యేవో కొన్ని యిస్తారు కాని భార్య పూర్తిగా సమర్పించుకుంటుంది.

* భార్యభర్తల అనుబంధం అనిర్వచనీయమైనది భర్త- చక్రము, భార్య- రథము, చక్రము లేనిదే రథం కదలదు. రథం యెంతత్వరగా వచ్చింది అంటాము రోడ్డుదెబ్బలు తినేది చక్రం అయినా రథాన్ని పొగుడుతాము.

అలానే భార్య వీణ: భర్త- తీగ. అందరూ వీణ కచేరిని పొగుడుతారు. పాడయితే తీగెలు పలకలేదు అని విసిగిస్తారు. భర్త (తీగ) గోళ్ళ దెబ్బలుతిని భార్యకు (వీణకు) కీర్తి తెస్తాడు. ఈ విధముగా భార్యాభర్తలను విడదీయలేము.

* స్త్రీ ముందు తను ఎవరి కోడలో చెప్పాలి తర్వాత పుట్టిల్లు విషయం చెప్పి తర్వాత ఫలానా వారి భార్యను అని చెప్పాలి.

* ఇంటి యజమానిని గృహస్థ అంటాము. అంటే అద్దెకున్నవాడు అని అర్థము. ఇంటి గలావిడను గృహిణి అంటాము. అంటే యిల్లు ఆవిడ స్వంతమని అర్థము. ఆ విధంగా భార్య వస్తేనే జీవితానికి నిండుదనము.

* వృద్ధుల పెద్దరికాలు మూడు రకములు. అవి 1. శీలము వలన వృద్ధులు. 2. జ్ఞానము వలన వృద్ధులు. 3 వయస్సు వలన వృద్ధులు.

* ఏదయినా కార్యాన్ని పెద్దవాళ్ళు చిన్నవాళ్ళచేత చేయిస్తే పెద్దవాళ్ళకు చేతకాక చిన్నవాళ్ళచేత చేయించారు అనకూడదు. చిన్నవాళ్ళకు పెద్దవాళ్ళు అవకాశము యిచ్చేరు అనుకోవాలి.

* ఏదయినా ఒక కార్యమును తలపెట్టినప్పుడు ం ంతకు ముందు పెద్దలు నడిచిన మార్గంలోనే వెళ్ళాలి కాని క్రొత్త త్రోవ త్రొక్క కూడదు.

* మనకు తెలిసినా మనం ముహూర్తాలు పెట్టుకోకూడదు. దానిలో ప్రజ్ఞ కలవారిచేత ముహూర్తము పెట్టిస్తే వారి వాక్కువల్ల అది ముహూర్తం అవుతుంది. మంత్రాలు కూడ అంతే; పుస్తకాలలో వున్నవని పఠించేయకూడదు. గురుముఖంగా వచ్చినప్పుడే అవి సిద్ధిస్తాయి.

* బాహ్యమైన అంధకారము కాకుండా అంతరమైన అంధకారాన్ని తప్పించేవాడు గురువు.

* భగవంతుని సేవించడం కంటే భగవంతుని సేవించే ఆచార్యుని సేవించడము, తద్వారా భగవంతుని సేవించడము సరి అయిన పద్ధతి. గురుముఖంగా చేయాలి భగవత్కార్యం;

* ప్రతీవాడూ గురువుకాడు. మహత్తరమయిన శ్రోత్రియుడు, బ్రహ్మ నిష్ఠ కలవాడు, గురువు.

* శిష్యుల స్వభావాలను బట్టి, వారివారి ప్రకృతి ననుసరించి గురువు మంత్రములు ఉపదేశించాలని శాస్త్రం చెప్పుతున్నది.

* పూర్వాశ్రమములో శిష్యులు (విద్యార్థులు) గురువు వద్దకు వెళ్తే కామం (కోరిక) తగ్గిపోయేది.

* మిత్రుని చేసుకోవటం సుఖం; కాని దాన్ని కాపాడుకోవడం కష్టం;

* మంచివాడు తలపెట్టిన కార్యములకు విఘ్నం రావటం మంచిది. దైవ



బలం మనలో వుంటే విఘ్నం వచ్చినప్పుడు బాధపడకూడదు. మనమనుకున్న దానికంటె మంచి మనకు జరగబోతోంది అనుకోవాలి.

* విలువ మారని దానిపేరు సత్యం;
విలువ మారుతున్న దానిపేరు ధర్మం;

1. సత్ + 2. తి + 3. యమ్. సత్ — ఎప్పుడూ మారనిది; తి — ఎప్పుడూ మారునది; యమ్ — యీ రెండిటినీ బంధించేది.

లోపల వున్న సత్యం మారదు. పైన వున్న ధర్మాలు మారుతాయి. సత్యమందే ధర్మము ప్రతిష్ఠితమైనది. ధర్మమనేది సత్యమనే దానిమీద తిరుగును.

* మనం ఆడినమాట ఏకాంతంగా అన్నా, చేసినా 14 గురు సాక్షులుంటారు; అవి పంచమహా భూతాలు, సూర్యచంద్రులు మొదలగు నవగ్రహాలు.

* బాహ్యమైన విషయాల నుండి అంతరమైన విషయముల వైపు మనస్సు యెంతవరకు నిమగ్నమవుతుందో పరీక్షించడానికి దేవాలయము పైని విగ్రహలుంటాయి. చాలమందికి పైన వున్న విగ్రహాలే ఆకర్షిస్తాయి. లోపల వున్న మూలవిరాట్టు యొక్క మహత్తును దాయడానికి పైన అలాగ మాయను సృష్టిస్తారు.

* ధర్మార్థ కామాలు మూడు కలిసే వుంటి ఒకే ఫలాన్నిస్తాయి.

* కష్టాలు 2 రకములు. అవి 1.సంకల్పము వలన మారనిది. 2. మానసికముగ భావించేది.

* త్యాగము 3 రకములు. అవి 1 ఫలత్యాగము. 2. సంగత్యాగము. 3.కర్తృత్వ త్యాగము.

* తాపం 3 రకములు. అవి 1 ఆధిభౌతిక తాపం. 2. ఆధ్యాత్మిక తాపం. 3. దైవికమయిన తాపం. శరీరానికి రోగం వచ్చినా మనసుకు అస్వస్థత కలిగినా దానిని ఆధ్యాత్మిక తాపం అంటారు శత్రువులవల్లా జంతువులవల్లా కలిగే తాపాన్ని ఆధిభౌతిక తాపం అంటారు.

అతివృష్టి, అనావృష్టి వంటివి వచ్చి మనం నివారణ చేయలేని పరిస్థితులు రావడం అధిదైవికమయిన తాపం అంటారు

* గొప్పవాళ్ళకు వాళ్ళ అసమర్థతను ఎవరైనా ఎత్తి చూపినప్పుడు వాళ్ళ మనస్సు మారకూడదు.

* దర్పమంటే తనకంటె తక్కువవారి వద్ద తన గొప్పతనం ప్రదర్శించడము.

* ఏదయినా త్రాగేటప్పుడు పెద్ద దానిలో (పాత్రగాని గ్లాసుగాని) త్రాగవలసింది ఉంచుకొని చిన్న దానిలో వేసుకుని త్రాగాలి. చిన్న దానిలోనిది మిగల్చకూడదు, పారేయకూడదు. ఇంకొకరికి యివ్వకూడదు. ఎంత త్రాగగలమో అంతే వేసుకోవాలి

* భగవంతునికి ఏ పదార్థం పెట్టినా నెయ్యి కొద్దిగా వేసి నైవేద్యం పెట్టాలి.

* మనిషి అంటే అన్ని అవయవాలు సరిగ్గా వున్నవాడే కాడు. సంఘజీవి అయుండి పరుడికోసం ఆలోచించే వాడు అయుండాలి. నరుడు అంటే భగవంతునిగా అర్థం చేసుకోవాలి.

* నవగ్రహాలను దాటి సత్యలోకమును దాటి విరజ అనే నదిని దాటేవరకు సూక్ష్మశరీరము ఆత్మతో వుంటుంది. ఆ తర్వాత బ్రహ్మతో ఆత్మ చేరుతుంది అదే మోక్షమని ఉపనిషత్తులలో చెప్పబడింది.

* శ్రవణము చేస్తేనేకాని లోపల వున్న పంచేంద్రియముల వలన కలిగిన వాసన పోదు.

* భగవంతునికి కైంకర్యం చేశాను అనకూడదు. ఆయన చేయించుకున్నాడు అనాలి.అలాగే స్వామి ఏడుకొండలు యెక్కించాడు అనాలికాని యెక్కాను అనకూడదు.

* మనలోవున్న రజస్తమస్సులను మనల జయించి సత్వగుణాలను పెంపొందించుకొని మనం పరిపూర్ణమైన జీవితాన్ని అనుభవించాలి.

* శరీరమంటే నేను అన్నది అహంకారము. ఆత్మకు జాతి, కులం, మతం, రంగులు లేవు.

* భగవంతుడు మనకు జ్ఞానం ఇచ్చాడు. దానిని ఉపయోగించి శాస్త్రములు చదివి స్వామిని తెలుసుకుని ప్రవర్తించాలి.

శక్తి గల భగవంతుడు తన ద్వారా సృష్టించబడిన మానవుడు పరి పరి విధముల ప్రవర్తిస్తుంటే తాను చూస్తూ వూరుకుంటాడు ఆయనను గుర్తించి ఆయన కోసం తపనపడే హృదయాలలో దూరి వారిని తరింపజేస్తాడు.



* ఏనాడు మనం ఈ శరీరం ధరించామో అప్పటినుండి సూక్ష్మ శరీరం మనలను అనుసరిస్తూ వుంటుంది

* నీ లోపల నిబిడీకృతమయిన భగవత్‌తత్త్వాన్ని తెలుసుకోవడానికి ఏది ఉపకరిస్తుందో అది విద్య।

* తనకొఱకు తాను చేస్తున్నానన్న భావన వదలి వాడి(భగవంతుని) కోసం చేస్తున్నాననుకుంటే అది కర్మయోగం.

* మనలో తమస్సును తగ్గించి సత్త్వగుణాలు పెంపొందించుకోవాలి.

* భగవంతుని నీవు యే విధంగా సేవిస్తే ఆయన ఆ విధంగా నిన్ను దీవిస్తాడు.

* దేముని వద్ద యిటునుండి యిస్తే జలం, అటునుండి వస్తే తీర్థం। ఇటునుండి యిస్తే పుష్పం, అటునుండివస్తే నిర్మాల్యం। ఇటు నుండి యిస్తే ఫలం, అటు నుండి వస్తే ప్రసాదం।

* రాత్రి-అంటే చీకటి ఆవరించుకొని ఉన్న వస్తువులను కనబడకుండా చేసేది. వస్తువులుంటాయి కాని చీకటి ఆవరించుకొని వుండటం వలన ఆ వస్తువులు మనకు కనిపించవు ఇక్కడ రాత్రిని అజ్ఞానంతో అన్వయించుకోవాలి, మానవ జీవితంలో వున్న అజ్ఞానాన్ని తొలగించుకోడానికి షడ్రాత్రుల యజ్ఞం చేసి మానవుడు అజ్ఞానాన్ని తొలగించుకోవాలి.

నేను, నాది, నా వాడు మొదలగు భావాలూ, యింద్రియ లోలత్వం, అవిద్య, అహంకారం మొదలగునవి ఒక్కొక్క రాత్రిగా అన్వయించుకొని, వాటిని యజ్ఞంలో ఒక్కొక్కటీ జయించి పరిపూర్ణమైన మానవునిగా మనం మారాలని విశ్వామిత్రుని షడ్రాత్రయజ్ఞం సూచిస్తున్నది.

* ఓం = అ + ఉ + మ్ అందులో 'మ్'ని గుర్తుంచుకోమని గురువులు చెప్తారు

'అ'అంటే నారాయణునికి, 'ఉ'అనగా 'ఏ' నన్ను నేను అర్పించుకుంటాను. 'మ్'అను జ్ఞానము కలవాడు. ప్రణవార్థము నెరింగినవాడు.

'నమః'లో 'మః' అంటే నాకు రక్షకుడిని, 'న' అంటే నేను కాను.

'ఓం నమః' అనగా నాకు నేను రక్షకుడను కాను నారాయణునికే నన్ను నేను అర్పించుకుంటున్నాను అని అర్థం.

• మానవ జీవితంలో ప్రధానంగా నేర్చుకోవలసింది క్షమ. సిద్ధి పొందిన తర్వాత క్షమ లేకపోతే బ్రహ్మజ్ఞానం దొరకదు.

• వ్రతములు ఆచరించువారు నియమభంగం చేయకూడదు. నియమభంగం జరిగినప్పుడు మళ్ళీ మొదటినుండి చేయడమో లేక ప్రాయశ్చిత్తం చేసుకోవడమో జరగాలి. నియమములో వున్నప్పుడు పగలు నిద్రపోకూడదు. తలవైపు కాళ్ళు కాళ్ళవైపు తల పెట్టుకొని పడుకోకూడదు. తల విరబోసుకోకూడదు.

• సాధన పొందినవారు, సిద్ధి, నియమం అయిన తర్వాత జీవితమంతా నియమాన్ని పాలించాలి. దాని మానేయకూడదు మహాత్మ్యం,పుణ్యాత్మ్యం చరిత్రలను చదివినా సత్సంగంలో పాల్గొంటూ సంకీర్తనలతో జీవితాన్ని గడిపేయాలి.

• పని మానేసి కూర్చుంటే సిద్ధిరాదు. సంకల్పముతో పాటు సాధన కూడ చేస్తేనే సిద్ధిని పొందుతాము. అందులో కూడ బ్రహ్మభావన చేయకపోతే సిద్ధించదు.

• స్థితి గతి, నివృత్తి, ప్రవృత్తి స్వామి వలననే కలుగుతుంది. దృశ్యతే, శ్రూయతే సర్వం స్వామి వలననే జరుగుతుంది.

• తన శరీరముతో ఆచరించవలసిన కర్మను భగవంతునికి అర్పిస్తే సిద్ధి పొందే అవకాశం వుంది. ఇదే మానవుడు తన జీవితంలో గుర్తుంచుకోవలసిన రహస్యం.

• సిద్ధి పొందిన తర్వాత ద్వంద్వాతీతుడవ్వాలి అంటే తనను తాను మర్చిపోవాలి

• ఈ లోకములో సర్వ పదార్థములకు అధిపతి వాడే. 'నాది' అనగలిగే వాడు కూడ అతనే.

• త్యాగము చేసి పాలించు. త్యాగము చేసి అనుభవించు. అంతరముగా అది నాది నన్న దానిని వదలడమే త్యాగం. నువ్వు చేసే పనిలో నాది అన్నది వదలడమే త్యాగం.

• తగిన చోట దయ చూపితే మనం పతనమవుతాము.

• సాత్వికాహంకారముల వల్ల పుట్టినవి యింద్రియములు. ఇంద్రియములను కట్టడి చేసేది మనస్సు.



• సాక్షరా: అంటే చదువుకున్నవారు (అక్షరములు వచ్చినవారు అని అర్థం) అది తిరగేస్తే 'రాక్షసా' అవుతుంది, అర్థం కూడ మారిపోతుంది.

• ఉమా సంహితలో బాలకాండలో సీతాకళ్యాణం చదివితే పెళ్ళి కాని అమ్మాయిలకు పెళ్ళి అవుతుంది అని ఉన్నది

• తనకు కష్టం కల్గినా తాను బాధపడక తన వలన యింకొకరు కంటతడి పెట్టకుండా ఉండగలిగిన వాడు మానవుడు

• కామమనే శత్రువు నీలో వున్న జ్ఞానమును ఆవరించి దానిని కప్పివేసినట్టుగా చేస్తుంది.

• జీవికి 7 అవస్థలు అవి గర్భంలో పడటము,పుట్టడం, బాల్యము, యౌవన వార్ధక్యము, చనిపోవడము, స్వర్గంలోనో నరకంలోనో ఉండడం మళ్ళీ గర్భంలో పడటము

• వెన్నెముక, తల ఒకే line గా కూర్చొని రెండు కళ్ళ మధ్యకు తెచ్చి కళ్ళుమూసుకోవాలి. ఊపిరి బిగపట్టి స్థిరంగా కూర్చొని సాధన చేయాలి. జ్ఞానం పైదాకా ప్రసరిస్తుంది. జ్ఞాననాడి కేంద్రం క్రిందనుండి పైకైన దారి మనం చూపిస్తే పైదాకా ప్రసరించి జ్ఞానము వస్తుంది.

• శరీరములో వున్న ఆత్మను పైకిలాగి పరమాత్మతో కలిపినట్లు చేయాలి అని ఉపనిషత్తులు చెప్పినవి.

• కన్నుతో మనస్సు కలిస్తే,మనస్సుతో ఆత్మ కలిస్తే,ఆత్మ కన్నుతో కలిస్తే అప్పుడు దృశ్యమవుతుంది.

• జీవుడు మనసుకందనివాడు. రూపము లేనివాడు పేరు లేనివాడు. కాని శరీరమునకు మనం పేరు పెట్టుకొని పిల్చుకుంటాము.

• హారతి అంటే అజ్ఞానమును హరించేది అని అర్థం.

• లోకంలో అన్నిటికన్నా పరమాత్మను కోరు.

• లోపల వున్న సత్వగుణం మనలను పెంచి దానితో గుణమును అణగ ద్రొక్కితే మన జీవితము సుఖమయమవుతుంది.

• కర్మ చేసిన మనం మర్చిపోయినా కర్మఫలము వదలదు. కర్మలు 3 రకములు అవి 1. సంచితము — వెనుక చేసిన కర్మలఫలిత కలిసినవి. 2.ఆగామి—

తరువాత జన్మలలో అనుభవించడానికి ఉంచుకున్నది. ప్రారబ్ధం— చేసిన దానికి యిప్పుడే అనుభవించుచున్నది.

* సంసారములో ఉండేటప్పుడు చికాకు కలిగితే దానిని నిర్వేదం అంటారు. అప్పుడు గురువు వద్దకు వెళ్ళాలి కాని ఆశ్రమములకు, దేవాలయములకు వెళ్ళనక్కరలేదు.

* ఒక మంచి పనిని మొదలు పెడితే చుట్టూ వున్న వాళ్ళు మనను పొగుడుతుంటే, సత్కారాలు, సన్మానాలను చేస్తుంటే అవి మనవని భావించి పొంగిపోతే అది మనలను మామూలు మనిషిని చేస్తుంది, అవి అన్ని స్వామివల్లనే వస్తున్నాయని స్వామిసేవలో వున్నందువల్లనే వస్తున్నాయని భావించి యింకా తీవ్రంగా ఆ కార్యక్రమాన్ని కొనసాగించాలి. సమత్వమును లోపల కలిగి కార్యంచేస్తే అవతల వడ్డుకి చేరుతాము.

* కర్మలు ఆచరించాలి కాని అవి మనకు అంటకూడదు. ఆచరించే కర్మ ఆచరించ వలసిన విధం తెలుసుకుని ఆచరించాలి. సంగము లేకుండా ఆచరించాలి.

తెలివైనవాడు పనసపండును వలిచి నట్లుగా కర్మను ఆచరించాలని వివేకానందులవారు చెప్పారు. కత్తికి నూనె వ్రాసి కోస్తే కత్తికి యేమీ అంటకుండా తొనలు వస్తాయి.

* ధృతిః; దృష్టిః మతిః; దార్ఢ్యం. ధృతిః అనగా ధైర్యం; దృష్టిః అనగా కార్యసిద్ధి మీద దృష్టి; మతిః అనగా జ్ఞానం; దార్ఢ్యం అనగా అనుకున్నపని చేయగలిగే సామర్థ్యము. ఈ నాలుగూ వున్నవాడే కర్మను ఆచరించగలడు. అప్పుడే తనలో వున్న ఆత్మవస్తువును దర్శించగలడు.

* శరీరముండాలి, సాధన చేయాలి. శరీరమున్నస్పృహలేకుండా శరీరముతో సాధన చేయాలి.

* భగవంతుడు మనను అనుసరించకపోతే నామరూపాత్మకమయిన యీ జీవుడే లేడు.

* భగవత్ప్రాప్తికి నీకు వ్యతిరేకంగా వున్నవాటిని వదిలేసి నీకు అనుకూలంగా వుండేవాటిని అనుసరించు



* మానవ జీవన గమనము ధర్మాచరణము తోనే సాగాలి. అందుకు ఉదాహరణగా కాళిదాసు నాటకంలోని ఒక పాత్రను మనం గుర్తు తెచ్చుకోవాలి.

ఆ పాత్రధారి యువకుడయినా, అవసరము లేకపోయినా అస్తమానం ఒక కఱ్ఱను ఊతగా ఉంచుకునేవాడు. ఆ కఱ్ఱను పట్టుకోవటం కూడ ఎంతో అవసరమున్నవాడిలాగ, ముదుసలివాడు పట్టుకునేటట్టుగా ఎంతో జాగ్రత్తగా పట్టుకునేవాడు. అదేమని ఎవరయినా అడిగితే 'మా పెద్దలు చెప్పారు కాబట్టి నేను తప్పనిసరిగా పట్టుకుంటున్నాను' అంటూ ఎంతో పవిత్రంగా పట్టుకునేవాడు అవసానదశలో ఊతగా పనికొచ్చే కఱ్ఱని నిత్యం వాడటం వలన ఆత్మరక్షణకు కూడ వాడ గలిగేవాడు.

ఈ రోజులలో మనం దైవాన్ని తలవడానికి తీరిక వుండటంలేదని ఆత్మవంచన చేసుకుంటుంటాము. కష్టాలు కలిగినప్పుడు మాత్రం దైవాన్ని తలుస్తాము. లేకపోతే యింకా ఆ వయస్సు రాలేదని అనుకుంటుంటాము.

దైవచింతన విషయంలో నియమం పాటించని మనం తక్కిన విషయా మాత్రం నియమాలు తప్పనిసరిగా పాటిస్తాము. అలా కాక ధర్మాచరణముతో కూడిన దైవచింతన కూడ మన నిత్యజీవితంలో భాగంగా మలచుకొని ప్రవర్తించిన ఆధార్మికత్వం మనకు ఎంతో మేలును చేస్తుంది మన జీవితము సక్రమంగా నడవడానికి, సమాజంలో మార్పులు రావడానికి సహకరిస్తుంది. గురువు ద్వారా ఉపదేశం పొంది నేను అన్నది మర్చిపోయి కర్మలు చేస్తే క్రిందటి జన్మలోనివి, పై జన్మలోనివి తామరాకుమీద నీటిబొట్టులాగ మనం అనుభవించవలసినవి పోతాయి.

## రామాయణము అందలి విశిష్టత

రామాయణములో సీతారాములు విడిగా వుండేది మూడు కాండలలోనే, అవి బాలకాండ-సుందరకాండ- ఉత్తరకాండ.

ఈ మూడు కాండలలోను ముగ్గురు ఋషులుంటారు వారు విశ్వామిత్రుడు- ఆంజనేయస్వామి- వాల్మీకి

బాలకాండలో బాలుడు రాముడుకాడు. 12 సం॥ల ప్రాయంలో రాక్షస సంహారము చేసిన రాముడు బాలుడుకాడు. ఇందులో విశ్వామిత్రుడు బాలుడు. భగవంతుడయిన రామునివద్ద విశ్వామిత్రుడు బాలుడయి తన అహంకారము, కోరికలు

మొదలగు తన అజ్ఞానములు పోగొట్టుకొనుటకు తను చేసే సత్రయాగ యజ్ఞ పరిరక్షణార్థం రాముని శరణుకోరి అజ్ఞానమనే చీకటిని తొలగించుకొని పరిపూర్ణుడైనాడు.

సుందరకాండలో సుందరుడు ఆంజనేయస్వామి. ఆంజనేయస్వామిని ఋషిగా చెప్పటం జరిగింది.

ఉత్తరకాండలో వాల్మీకి ఉత్తరుడు. సాధారణంగా నాటకంలో నాయకుడు అన్ని సీనులలోను కన్పిస్తాడు. ఆ విధంగా పైమూడు కాండలలోను పైముగ్గురు కన్పించుట వలన వారి పేర్ల మీదుగా ఆ కాండలు నామకరణము జరిగిందని భావించవచ్చును.

* మానవ జీవితంలో సిద్ధికి, సాధనకు ఉపకరించేది బాలకాండ.

* బాహ్యంగా విశ్వామిత్రుడు గురువు, రాముడు శిష్యుడు; అంతరముగా విశ్వామిత్రుడు ఉపాసకుడు, రాముడు దేముడు.

* రామచంద్రుని రక్షణ కోరిన విశ్వామిత్రుడు రాముడిని రక్షిస్తాడని దశరథునికి నచ్చచెప్పడానికి వశిష్ఠుడు చెప్పాడు.

* శ్రీరాముడు తాటకను చంపగానే విశ్వామిత్రుడు రామునకు దివ్యాస్త్రములు యిచ్చాడు. అప్పుడు రాముడు అస్త్రములతో, 'నా మనస్సులో వుండండి, భవిష్యత్తులో మీ అవసరము వచ్చినప్పుడు నేను మిమ్మల్ని స్మరిస్తాను. అప్పుడు ఉపయోగ పడండి' అని కోరాడు. దీనిని బట్టి గురువయిన విశ్వామిత్రుడు విద్యార్థి అర్హతను పరీక్షించిన తరువాతే రామునకు అస్త్రముల నొసగి గురువు చూపించవలసిన విజ్ఞతను ప్రదర్శించాడు అని విశదమవుతున్నది. అదే విధముగా రాముడు కూడ దివ్యాస్త్రములు తన వశమయినను, గర్వపడక అవసరమయినప్పుడు మాత్రమే వాడతానని వినయముగా అస్త్రములతో చెప్పి తన స్వశక్తి మీద తన నమ్మకాన్ని, తన వ్యక్తిత్వాన్ని ప్రదర్శించినట్లు మనకు అర్థమవుతున్నది.

* శ్రీరాముడు ముందు తాటకను వధించాడు. అనంతరం విశ్వామిత్రుడు చేస్తున్న సత్రయాగయజ్ఞ పరిరక్షణార్థం మారీచ, సుబాహులను వధించాడు. గురువయిన విశ్వామిత్రుడు తనకు చేతకాక తనను తెచ్చుకున్నాడు, మనం సాధించాము అని అనుకోకుండా, "స్వామీ! నీ దాసులం! నీ యిష్టమొచ్చినట్లు ఆజ్ఞాపించు మేం యేం చేయాలో" అన్నాడు. ఆ వినయ సంపదను చూసి విశ్వామిత్రుడు సంతోషించాడు



శ్రీరాముడు తాటకను వధించడము ద్వారా కామం జయించాడు. మారీచ, సుబాహులను వధించడము ద్వారా అ విద్యను జయించాడు. ఇన్ని సాధించి యింకా గురువుకు దాసోహం అనటం ద్వారా అహంకారము జయించాడు.

* బలి చక్రవర్తి దాన ధర్మాలు చేస్తున్నా తన లోపల యేదో చేయిస్తుందని తలంచక అహంకారముతో 'నేను' చేస్తున్నాను అనుకున్నాడు. భూలోకం, ఊర్ధ్వలోకం అంతా 'నాది' అన్న అహంకారముతో వున్నాడు.

శ్రీమన్నారాయణుడు దేవతల కోరికపై వామనుడై, వటుడై యజ్ఞములో నున్న బలిముందు నిలచి మూడడుగులు దానమడిగేడు. మొదటి అడుగుకి బలి 'నాది' అనుకున్న భూమిని దానమిచ్చాడు వామనుడు ఒక అడుగుతో భూమిని వశపరచుకున్నాడు ఇక రెండవ అడుగు బలి 'నాది' అనుకున్న ఊర్ధ్వలోకాన్ని దానమిచ్చాడు. వామనుడు రెండవ అడుగుతో దాన్ని కూడ వశపరచుకొని 'మూడవ అడుగు యెక్కడ?' అని ప్రశ్నించాడు బలికి 'నాది' అనుకున్నది యేమీ మిగల లేదు ఇంక మిగిలింది 'నేను' మాత్రమే! అప్పుడు శిరస్సు వంచి తనను, తను అర్పించుకున్నాడు. ఆ 'నేను' ని కూడ వామనుడు అణిచివేశాడు బలి అహంకారము తొలగింది

* రాముడు రాతిగానున్న అహల్యను నాతిగా చేసినట్లు మనం బాగా విన్నాం కాని వాల్మీకి అహల్యలను రాతిగా చేయలేదు ఆ విధంగా చేయటం వలన ఆమెను శిక్షించినట్లు అవదు. ఆమెను ఆశ్రమంలోనే వుంచి అదృశ్యరూపంలో వుంచి తన నిజస్వరూపము తిరిగి రావాలని ఆమె అనునిత్యం పరితపించేటట్లుగా శిక్ష విధించాడు. రాముడు ఆశ్రమంలోనికి వెళ్ళగానే ఆమెకు నిజస్వరూపం వచ్చింది. తన వల్ల ఆమె తన స్వరూపం తెచ్చుకోగలిగింది అని తెలిసినా రాముడు అహల్య పాదాలు పట్టుకొని ఆశీర్వాదము కోరాడు

* శ్రీ మహావిష్ణువు పరాక్రమంతో రావణున్ని జయించాడు, యాచనతో బలిని జయించాడు.

* భార్య వస్తేనే జీవితం మొదలవుతుంది. పెళ్ళయితేనే మానవుడవుతాడు. ఆ విధంగా సీతమ్మను కళ్యాణమాడిన తరువాత రామచంద్రుడు రాముడయ్యాడు. రామ శబ్దం అక్కడినుండి శక్తివంతమయింది.

* ఆ రోజుల్లో లోకంలో 'ఛీ' అనిపించుకునే వారు యిద్దరే. రాముణ్ణి చూడనివాడు; రాముడి చేత చూడబడని వాడు; వారే పాపులు.

* శ్రీరాముడు అతి సుకుమారంగా, ఒక సంగీతంలాగ మాట్లాదేవాడు. ఎవరైనా తీవ్రంగా మాట్లాడినా సమాధానం చెప్పకుండా వూరుకునే వాడు. మాట చెప్పాలంటే అతనే చెప్పాలనిపించేవాడు. ముందు మందహాసంతోటి మాట్లాదేవాడు

* రాముడు యెవరికైనా ఆపదకలిగితే వాళ్ళకన్నా యెక్కువ యేడ్చేవాడు. ఎవరికైనా ఆనందము కలిగితే కన్నతండ్రిలాగ ఆనందపడేవాడు.

* తనను చూసిన వార కళ్ళల్లో కళ్ళు కలిపి చూసేవాడు. అందరికీ రాముడు తననే చూసినట్లు అనిపించేది.

* దశరధునికి రాముడు పెద్ద భార్య కుమారుడు, పెద్ద కుమారుడు, గుణము లలో అధికుడు అవడం వల్ల ప్రేమ యెక్కువ. ప్రేమయొక్క పరాకాష్టకు వెళ్ళినవాడు అయినా ధర్మాన్ని వదలలేదు. ఒకసారి విశ్వామిత్రుని యాగరక్షణ కోసం రాముణ్ణి పంపించేశాడు. ఇంకొకసారి కైకేయి కిచ్చిన వరాలకోసం రాముణ్ణి వదులుకున్నాడు.

* కౌసల్య దశరధునకు
భార్యలా—రమించింది.
సఖిలా—ఆనందము కలుగజేసింది.
తల్లిలా—లాలించింది.
దాసిలా—పరిచర్యలు చేసింది.
సోదరిలా—నూతన వధూవరులకు మంగళ హారతి పట్టేది.

దశరధుడు కౌసల్యతో సహా మొత్తం 300 పెళ్ళిళ్ళు చేసుకున్నాడు. ప్రతీ సారీ నూతన దంపతులకు ఆడపడుచులా హారతి పట్టేది.

* కైకేయి అంత గట్టిగా నిలబడడము వలన దైవకార్యం నెరవేరింది. దేవతలు ఆమెలో ఆవహించి ఆమెచేత ఆ విధంగా పట్టుదలగా నిలబడినట్లు చేయబట్టి లోక కళ్యాణం జరిగింది. లేకపోతే కేవలం శ్రీరామ పట్టాభిషేకం జరుగును.

* తనంటే ఎంతో ప్రేమ చూపించే కైకేయి రాత్రికిరాత్రి నన్ను అరణ్యమునకు వెళ్ళమన్నదంటే దైవము వలన తప్పించి యింకొకటి కాదని లక్ష్మణునితో రాముడు అన్నాడు.



* దశరధుని మంత్రి సుమంత్రుడు కైకేయిని చూసి నీకీ గుణం మీ అమ్మ నుంచి వచ్చిందని అంటూ అక్కడున్న వారందరికీ ఆ కధను యిలా చెప్పారు.

కైకేయి తండ్రికి వరప్రభావము వలన పశుపక్ష్యాదులు, క్రిమికీటకాదుల భాషలు తెలుసును. ఒకరోజు భార్య దగ్గర వుండగా రెండు చీమలు మాట్లాడుకుంటుంటే విని నవ్వుకున్నాడు. 'ఎందుకు నవ్వుతున్నారు, చీమలు యేమని మాట్లాడాయో చెప్పమని భార్య అడుగుతుంది. చెప్తే తలపగిలి పోతుందని చెప్పాడు. అయినా సరే చెప్పమని మంకుపట్టు పట్టింది. అప్పుడు మునులను రప్పించి విషయమంతా చెప్పి సలహా అడిగితే రాజ్యానికి రాజు ముఖ్యం కనుక చెప్పవద్దు. అని వారు చెప్తే రాజు చెప్పలేదు. ఆయన ప్రాణం పోయినా ఫరవాలేదు చెప్పమని కోరిన తల్లికి పుట్టిన దానివి కనుక నువు యిటువంటి కోరికలు కోరావని సుమంత్రుడు చెప్పాడు.

* పితృవాక్య పరిపాలన అంటే తండ్రి యిచ్చిన వరాన్ని పాలించాడు అని అర్ధం. తండ్రి తనతో చెప్పింది కాక యింకొకరికి యిచ్చిన మాటను జరిపించడము పితృవాక్య పరిపాలన అంటే. పిండప్రదానము చేయనివారు, పితృవాక్యములు నెరవేర్చనివారు కొడుకులు కారు. అక్కడ వున్న వారంతా రాముడు అడవికి వెళ్ళనక్కరలేదు అని బలవంతం చేసినా తండ్రి యిచ్చిన మాటను నిలబెట్టడంకోసం రాముడు అడవికి వెళ్ళాడు.

* రాముడు అడవికి వెళ్తూ తల్లి ఆశీర్వచనమునకు వచ్చినప్పుడు రాముడిని వెళ్ళమని కౌసల్య చదివిన 4 మంగళ శ్లోకాలు పిల్లలు యెక్కడికైనా వెళ్ళినప్పుడు తల్లులు చదవాలి

* వనవాసం చెయ్యడానికి నువ్వు నాచేత కనబడ్డావని సుమిత్ర లక్ష్మణునితో అంటుంది.

* తండ్రి జ్ఞాపకము వస్తే రాముడిని తండ్రిగా యెరుంగుము. నేను జ్ఞాపకము వస్తే సీతమ్మను తల్లిగా యెరుంగుము. అయోధ్య జ్ఞాపకము వస్తే అడవిగా తెలుసుకో అని సుమిత్ర లక్ష్మణునితో చెప్పెను.

* దశరధుడు —వ్యయః పిత అనగా ఖర్చుకి పుట్టిన తండ్రి — రాముడు — అవ్యయః పిత అనగా నాశనము గాని తండ్రి అని సుమిత్ర లక్ష్మణునితో చెప్పెను

* తల్లులు మూడు రకములుగా వుంటారు:-

కౌసల్య — తన బిడ్డలు ఎక్కడ వున్నా సుఖంగా వుండాలని భావించేది.

కైకేయి — తన బిడ్డల సుఖం, పరులబిడ్డల కష్టం కోరుకునేది.

సుమిత్ర — తన బిడ్డలు అందరికీ ఉపయోగపడాలి అని కోరుకునేది (తన యిద్దరి పిల్లలను యింకొకరికి ధారాదత్తం చేసింది సుమిత్ర.)

* అయోధ్యలో వున్నా, అడవిలో వున్నా సీతారాముల అన్యోన్యత విడదీయ లేనిది. జీవతత్త్వము, భగవతత్త్వమును విడిచి వుండదు.

* రామనామములో పురుషతత్త్వం, స్త్రీ తత్త్వం రెండూ విభక్తము కాని రెండు తత్త్వములు. అందుచేత 'శ్రీరామ' అని అనవక్కరలేదు. రామ అంటే చాలును.

* వేదములలో చెప్పబడిన ధర్మము, జ్ఞానము రెండూ కలిసి విడదీయ రానివై వేద స్వరూపముగా రామాయణము ఉద్భవించింది.

* రాముని పాదములు అతి సుకుమారములు. అందుచేత రామునకు ముళ్ళు గుచ్చుకోకుండా తను ముందు నడుస్తానని సీతమ్మ అన్నది.

* రాముడు లక్ష్మణుని అయోధ్యకు తిరిగి వెళ్ళిపొమ్మంటే లక్ష్మణుడు యేడుస్తూ, "రామా! ఈ పడుకున్న సీతమ్మని వెళ్ళిపొమ్మని యెందుకు అనలేదు! తెలివేసి వున్న నన్ను పొమ్మంటున్నావు నువు లేకపోతే సీతమ్మ యేవిధంగా వుండలేదో, నేను కూడా అలానే వుండలేను నీటిలో చేప బయటకు వచ్చి ఎలా వుండలేదో అలా నిన్ను వదలి వెళ్ళలేను" అన్నాడు.

* మీరిక్కడ వుండటం వలననే రాక్షసులు మీమీదకు దండెత్తడానికి వస్తూ మమ్మల్ని హింసిస్తుంటే మేము దండకారణ్యము వదలి వచ్చేస్తున్నాము అని మునులు శ్రీరామచంద్రునితో చెప్తారు.

* లోపల సూర్యుడు వుండి బయటకు చంద్రుడు వున్నవారి, బ్రహ్మతేజస్సుతో ఉన్నవారి వద్దకు వెల్దామంటే భయం, వళ్ళా ఆయన నవ్వుతూ ఉంటారు. రాముడు మునులకు ఆ విధంగా కనిపించాడు

* గర్భములోనున్న పిండమును తల్లి తనకు తెలియకుండానే యెలా రక్షిస్తుందో ఆ విధంగా మమ్మల్ని రాక్షసుల బారినుండి రక్షించమని మునులు రాముని కోరాడు



* రాముడు రాక్షసుల బారినుండి మునులను రక్షిస్తానని అన్నప్పుడు సీతమ్మ రాములవారికి ధర్మోపదేశం చేసింది. ధర్మాన్ని ఆచరించడానికి శరీరమును మనస్సును, ఆత్మను స్వాధీనం చేసుకోవాలి. శరీరమును కృశింపకొని, మనస్సును దిక్కు పరచుకొని, ఆత్మను భగవంతునిపై లగ్నము చేసి కర్మలు చేయాలి. కర్మలు చేయాలి కాని ఆఫలం తను అంటకూడదు.

ధర్మాచరణము చేస్తామని వచ్చినవారు విల్లు, అమ్ములు యెందుకు తెచ్చారు? తామసమైన రాజసమైన గుణాలున్న ఆ వస్తువుల సంపర్కము మనకు వుండ కూడదని అంటూ యీ క్రింది కథను చెప్పింది.

ఒక ముని తపస్సు చేస్తుంటే యింద్రుడు తన పదవికి భంగం కలుగుతుం దనే భయంతో దేవకాంతలను పంపితే ముని కామానికి లొంగలేదు అప్పుడు యింద్రుడే స్వయముగా ఒక మనిషిగా మునివద్దకు పరుగెత్తుకుని వచ్చి యెవరో తరుముతున్న నెపంతో తనవద్దనున్న కత్తిని మునికి యిచ్చి, తన దగ్గరే వుంచమని చెప్పి, తను యెప్పుడు వచ్చి అప్పుడు తిరిగి యిచ్చేయమని కోరి పారిపోయాడు. పాపం ఆ మునికి ఆ మనిషి యెప్పుడు వస్తే అప్పుడు ఆ కత్తి యిచ్చేద్దామని తపస్సు మీదకన్నా ఆ మనిషి రాకమీద ధ్యాసపోయి, ఆకత్తి చేతిలోనే వుంచుకుంటూ మొదట్లో ఆ కత్తితో దారికి అడ్డుగా వున్న మొక్కలను, తుప్పలను కొట్టడం ప్రారంభించి అలా క్రమంగా క్రమంగా జంతు సంహారానికి ఉపయోగించి పతన మయ్యాడు.

ఇటువంటి తామస, రాజస గుణాలు కల వస్తువులున్నప్పుడు వాటితో సాధించ లని అనిపిస్తుంది. వైరములేనిదే క్రూరముగా ప్రవర్తించడము జరుగుతుంది. గం కోరికలు (కామం) కలుగుతాయి అసత్యమాడాలనిపిస్తుంది. పరస్త్రీని పొందా మీరు, రాక్షసులతో మీకు వైరంలేకపోయినా వాళ్ళను చంపుతానన్నారు. ఇది తప్పుకదా! అని సీతమ్మ అడిగింది.

రామచంద్రుడు మందహాసముతో. "ధర్మమును అధర్మము హింసిస్తున్నందున నేను క్షత్రియుడను కనుక, నేను అధర్మమును అణచాలి. ధర్మాన్ని కాపాడాలి కనుక నేను విల్లు, అమ్ములు ధరించి వున్నాను నువు చెప్పింది నిజమే! కాని క్షత్రియ ధర్మంవల్ల నేను మాట యిచ్చాను కనుక చేయాలి. రాక్షసులను తొలగించి మునులను కాపాడకపోతే దేశమునకు వినాశనము కలుగుతుంది.

ధర్మాన్ని ఆచరించలేకపోయినప్పుడు, ఆడినమాటను తప్పినప్పుడు నేను నిన్ను, నాదేహాన్ని లక్ష్మణుడిని కూడ వదిలేస్తాను" అని అన్నాడు.

* అ + ఉ + మ్ అన్న అక్షరముల కలయికే 'ఓం' 'అ' అంటే రక్షించుట అని అర్థము. 'అ' అనేది అన్ని అక్షరములకు మూలము. 'అ' కారము సర్వ వాఙ్మయములకు బీజము. 'ఉ' అంటే 'ఏ' అని అర్థము. 'మ్' అనగా జ్ఞానస్వరూపుడు అని అర్థము. 'ఓం' అంటే భగవంతునికే చెంది, వాడితో విడదీయలేనివాడు.

'ఓం' అన్న అక్షరాన్ని యెన్నిసార్లు జపిస్తే అంత త్వరగా దృశ్యమవుతుంది.

రాముడు, సీత, లక్ష్మణులను 'అ' కార, 'ఉ' కార, 'మ్' కారములుగా భావించి ప్రణవము చేయాలి.

* వైష్ణవమనే ధనస్సు– సాక్షాత్తూ శ్రీ మహావిష్ణువు రాక్షసులతో యుద్ధము చేసేది అగస్త్యులవారు రామునికి యిచ్చారు.

* 'రామ' అంటే ఆనందము కలవాడు, ఆనందమును తానిచ్చేవాడు, ఆనందమే తానుగా కనపడేవాడు.

* రాముడు తనలో శక్తులు గురువుగారి ద్వారా వస్తున్నాయనిచెప్పి, శక్తులు అందరికీ గురువుద్వారానే వస్తాయని తెలియచెప్పారు.

* 'విరాధ' అన్నది 'ఆరాధ' కు వ్యతిరేకం ఆరాధ– అంటే స్వామికి ప్రీతి కలిగించడము. విరాధ– అంటే స్వామికి అప్రియమైనది. స్వామికి అప్రియుడైన విరాధుడుని స్వామి సంహరించారు.

* అయోధ్యలో మంథర కైకేయిద్వారా నిప్పు పెలిగించి రాముడిని అడవికి తరిమితే, శూర్పణఖ రావణుడి ద్వారా సీతను లంకలో పడేసింది.

*రామాలయానికి వెళ్తే శూర్పణఖ రాముడిని గూర్చి ఖరునితో చెప్పిన శ్లోకాలు చదవాలి.

* రాముడు—తాటకను సంహరించి కామమును,
—ఖరుడిని సంహరించి అహంకారమును,
—దూషణుడిని సంహరించి మోహమును,
—త్రిశిరుడిని సంహరించి దర్పమును,
—రావణాసురిడిని సంహరించి అవివేకమును
నిండిన మనస్సును

అణిచాడు,



* రాముడంటే సమస్త జగత్తును సంహారం చేసి తిరిగి సృష్టించినవాడు.

* రావణుడు, దండకారణ్యంలో ఆశ్రమము కట్టుకొని తపస్సు చేసుకుంటున్న మారీచుని వద్దకు వెళ్ళి సీతను తెద్దాం రమ్మని పిలిస్తే మారీచుడు తాను సుబాహుడితో కలసి విశ్వామిత్రుని యజ్ఞం భంగం చేసేటప్పుడు రామునితో కలపడి సుబాహుడు చనిపోగ తాను మాత్రం పారిపోయి వచ్చానని, మళ్ళీ కొన్నాళ్ళకు 'లేడి' రూపంలో మరో యిద్దరి రాక్షసులతో వెళ్ళి కుమ్మేద్దామని ప్రయత్నిస్తే రాముడు ఒక్కసారి 3 బాణాలు వదలగా తక్కిన యిద్దరూ చనిపోగా తను మాత్రం తప్పించుకు రాగలిగానని, అందుచేత అటువంటి ప్రయత్నం చేయవద్దని నచ్చచెప్పగా రావణుడు తిరిగి వెళ్ళిపోయాడు. కాని శూర్పణఖ రెచ్చగొట్టడంతో మళ్ళీ మారీచుని వద్దకు వచ్చి బలవంతం చేశాడు.

* సీతా రామ లక్ష్మణులు అత్రిమహర్షి ఆశ్రమానికి వెళ్ళి అత్రి మహర్షిని, అనసూయదేవిని ఆశీర్వాదము కోరారు. అత్రిమహర్షి స్త్రీల పాతివ్రత్యం గురించి చెప్పి వదును, చపలత కలిగినది స్త్రీ—అటువంటిది"సీత నీవెంట వచ్చిందంటే నీ అదృష్టం"అని రామునితో అత్రిమహర్షి అన్నారు. భర్త అందంగా లేకపోయినా, గుణం లేకపోయినా భర్తను ప్రేమగా చూడాలని అనసూయ సీతమ్మతో చెప్పి దివ్యాంగరాగములూ, ఎప్పుడూ నలగని పట్టుచీర సీతమ్మకు యిస్తుంది. ఆ చీరతోనే సీతమ్మ లంకలో ఉన్నది.

* శరీరమునకు 'శర' మని పేరు. 'శృ' అనగా శిథిలమయేదని అర్థము. పెరిగినంతవరకు దేహము. పెరిగిన తర్వాత తరిగేటప్పుడు శరీరము అంటారు.

* రాజ్యంలోని వృత్తి వ్యాపారులు, వ్యవసాయదారులు తమ రాబడిలో నుండి రాజుకు యే విధంగా పన్నులు కడతారో, అదే విధంగా ఋషులు చేసే పుణ్యంలో 6వ భాగం పాలకులకు వస్తుంది అని ఋషులు రామునితో చెప్పారు.

* ఆహ్లాదకరమైన వాతావరణములో, ఆశ్రమములో సీతారాములు యిద్దరూ యేదో ఆడుతూ పందెం వేసుకున్నారు. పందెంలో సీతాదేవి ఓడిపోయి పెళ్ళినాడు రాముడు పెట్టిన 'రామ' ముద్రికను రాముడికి యిచ్చింది. అదే సమయంలో మాయ లేడి రావటం సీతమ్మ దృష్టి దానిపైబడి ప్రలోభానికి లొంగి సాక్షాత్తూ పరమాత్మ సాన్నిహిత్యాన్ని దూరం చేసుకున్న ఆత్మ స్వరూపాన్ని, దానివలన కలిగిన అనర్థాన్ని లోకానికి తెలియజేసింది.

* సీతమ్మ మాయలేడిని చూసి ముచ్చటపడితే లక్ష్మణుడు సీతమ్మతో, 'అది నిజమైన లేడి కాదు. మాయలేడి అయివుంటుంది. నిజంగా లేడి అయితే బంగారు ఛాయలో ఉండదు. లేడి యెప్పుడూ ఒంటరిగా రాదు. మందగా వస్తాయి. వచ్చినా మనుషుల వాసన పసిగట్టి పారిపోతున్నాయి ఇది పోవటం లేదు, కాబట్టి యిది మాయలేడి' అని అన్నాడు.

* శబరి మాతంగ మహర్షి శిష్యురాలు. రాముని దర్శనానికై మాతంగ మహర్షి ఆదేశంతో 13 సంవత్సరముల ఒక్క మాసము నిరీక్షించింది. గురువు చెప్పిన మాట యెప్పటికైనా ఫలించి తీరుతుందని విశ్వశించి నిరీక్షించింది. బాగా ముసలి అయిపోయింది. రామచంద్రుడు శబరికి నమస్కరించాడు. లోపలికి వెళ్ళి కుశలమడిగాడు. నీ దృష్టి మాత్రం చేత నా పాపములన్నీ హరింపబడ్డాయి" అంటూ తన గురువు మాతంగ మహర్షి గురించి చెప్పింది. వారు వేదికమీద వేసిన పుష్పములు యింకా తాజాగా ఉండటము చూపించింది. తృప్తితీరా రామునికి ఆతిధ్యమిచ్చి తన యోగబలము వలన కలిగిన సంకల్పము చేత అగ్నిహోత్రుని సృష్టించి, 'స్వామీ! ఎవరి పాద పరిచర్య చేశానో అక్కడికే వెళ్ళిపోతాను.' అని రాముని వద్ద శలవు తీసుకొని తనకోసం వచ్చిన విమానంలో వెళ్ళిపోయింది. రాముడు లక్ష్మణునికి దివ్య శరీరంతో విమానంలో వెళ్ళిపోతున్న శబరిని చూపించాడు.

* ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, వ్యాకరణము బాగా మాట్లాడుతున్నాడు ఇతను యెవరికి దూతగా ఉంటాడో, అతను కార్యసిద్ధి చేసుకోగలడని ఆంజనేయుని ఉద్దేశించి రాముడు లక్ష్మణునితో అంటాడు.

* భగవానుని దివ్యజ్ఞానమును భక్తులకు తెలియజెప్పే గురువు, భగవంతునికి దూత, అయినే ఆంజనేయస్వామి!

* పెద్దపులి తన కోరలు తగలకుండా తన పిల్లలను ఎంత సున్నితంగా పట్టుకుంటుందో అంతచక్కగా ఆంజనేయస్వామి మాట్లాడుతున్నాడు.

* లక్ష్మణుడు ఆంజనేయునికి తన గురించి చెప్తూ ఆయన నన్ను తమ్ముడంటాడు. కాని నేను ఆయన గుణాలకు దాసుడిని అంటాడు.

* మారువేషంలో విప్రునిగా రామలక్ష్మణుల వద్దకు వెళ్ళిన ఆంజనేయుడు



రాముణ్ణి చూడగానే తాను మారువేషంలోవున్న విషయం మర్చిపోయి తన గురించి అంతా నిజం చెప్తాడు.

* అయోధ్యకాండలో మొదటిశ్లోకం శత్రుఘ్నుడుది, కిష్కింధ కాండలో సీతమ్మ నగలు చూస్తూ లక్ష్మణుడి శ్లోకం — మహత్తరమైనవి. ఇవి వారి శీలములకు పరాకాష్ట!

* సుగ్రీవుడిలాంటి స్నేహితుడుగాని, భరతుడులాంటి తమ్ముడుగాని, నాలాంటి కొడుకుగాని లేడని రాముడన్నాడు తండ్రిప్రేమను పొందగల్గిన కొడుకు అదృష్టవంతుడు కొడుకు అరణ్యం వెళ్ళిన 3 రోజులలోగా చనిపోయిన తండ్రి ప్రేమను చూరగొన్న కొడుకు అదృష్టవంతుడు.

* అయోధ్యకాండ—ధర్మప్రధానమైన కాండ.

అరణ్యకాండ — మోక్షప్రధానమైన కాండ.

కిష్కిందకాండ—వాత్సల్యపూరితమైన కాండ.

*సాధువులకు నివాసవృక్షము వంటివాడు రాముడని తార వాలితో చెప్పింది

* 'సీత' అంటే నాగటి చాలు నుండి వచ్చింది అని అర్థం.

* దీపతో ప్రభవ ఉన్నట్లుగా, పుష్పం ఉంటే వాసన ఉన్నట్లుగా, రాముడంటే శరణాగత వత్సలుడని సీతమ్మ రావణునికి చెప్పింది.

* రాముడు, రక్షించు అన్నవాళ్ళను రక్షిస్తే-సీతమ్మ తనను హింసించిన వాళ్ళను రక్షించింది.

* రామాయణములో పాత్రలన్నిటిలోనూ ఉత్తమమయినవి శత్రుఘ్నుడు తరువాత శబరి కన్పిస్తారు.

* భగవంతుడు మనకోసం రాతిలో నిలిచినప్పుడు ఎవరికి కళ్ళంట నీళ్ళు రావు. విశ్వమే తానైన స్వామి మన యెదుట వుంటే కళ్ళంట నీళ్ళు యెందుకు రావు!

* రామ రామ రామ అని ఒక్కసారి కాక మూడుసార్లు అనుకున్నందుకు ఉపదేశం చేసిన గురువుకి శిష్యుడు శపిస్తే ఆ శిష్యుడు గుహుడిగా పుట్టాడు.

* సాధన పొందినవాడు సిద్ధి, నియమం అయిన తరువాత జీవితమంతా

అలానే సాగించాలి. మహాత్ముల చరిత్రలు పారాయణ చేస్తూ జీవితం గడపాలి. సిద్ధిపొందిన తర్వాత ద్వంద్వాతీతుడవ్వాలి, అంటే తనను తను మర్చిపోవాలి.

* తనను చంపడం గురించి వాలి రాముడిని అడిగాడు. మన యిద్దరికీ వైరం లేదు. ధనం కోసంగాని, స్త్రీ కోసంగాని, స్థలంకోసంగాని, నా మాంసంకోసంగాని, నా గోళ్ళకోసంగాని నన్ను చంపలేదు. మరి తనను చెట్టు చాటునుండి బాణంతో కొట్టడం తప్పుకదా! అని అడిగాడు.

"చపలమైన యింద్రియములు కలిగినవారు అందరూ తనవలెనే ఉంటారని తనకు అనుకూలంగా ధర్మం చెప్పుకుంటాడు.

ఈ భూమి మా యిక్ష్వాకులది. భరతునితో నువు నరుల ధర్మప్రతిష్ఠాపన అటువేపుండి చేయి, నేను యిటుప్రక్క ధర్మసంస్థాపన చేస్తాను అని చెప్పాను అధర్మమును నిగ్రహించడము తప్ప యింకొకటికాదు. నా భార్యకోసం నేను సుగ్రీవునితో స్నేహం చేయలేదు. అధర్మమాచరించిన వాడిని శిక్షించకపోతే,- అందులో రాజువైవుండి అధర్మముతో ప్రవర్తించావు. మరదలిని కోడలుగా చూసుకోవాలి. వానర శాస్త్రంలో భర్త చనిపోయినవాని భార్యను పెళ్ళాడవచ్చు. నువు నీ తమ్ముడు బ్రతికుండగనే రుమతో జీవించావు.

ఇంక దొంగ చాటుగా యెందుకు చంపవలసి వచ్చిందంటే నువు మృగము కనుక ప్రత్యక్షంగాను, ప్రచ్ఛన్నంగాను చంపుతాము. నువు లోకమునకు భయంకరుడివి గనుక నిన్ను క్రూర జంతువుగా క్షత్రియ ధర్మంతో చంపాను." అని రాముడు వాలికి జవాబిచ్చాడు.

వాలి తన తప్పు నొప్పుకుని రాముని క్షమించమని కోరి అంగదుని సుగ్రీవునితో సమానంగా చూడమని కోరాడు.

* తార యేడ్చుకొని వస్తే సుగ్రీవుడు, 'నా అన్న నన్ను బయటకు పంపాడు. గాని నేను నా అన్నను చంపించాను. కనుక అంగదునికి పట్టాభిషేకం చేసి రాజును చేయమ'ని రామునితో అన్నాడు

* తార రాముని దూషిద్దామని వచ్చి స్వామి దివ్యతేజస్సు చూసి మారిపోయి రాముని స్తోత్రం చేయటం మొదలు పెట్టింది. (1) అప్రమేయుడవు-అనగా మానములకు లొంగని తత్త్వం కలవాడు. మానము అంటే ఉన్నది వున్నట్లు చెప్పుకున్నవాడు (2) దురాశయము లేని వాడవు అనగా శిథిలమయినట్లు కనిపించని వాడివి



అనగా మూడుకాలములందును ఉండేవాడివి. (3) అవసానము లేనివాడవు అనగా
శృంగుణాలు లేనివాడవు అంటూ స్తోత్రము చేసింది.

* తన కిచ్చిన మాటను నిలబెట్టుకోకుండా మిత్ర ధర్మమును విస్మరించిన సుగ్రీవుని ఉద్దేశించి, 'ఎవడైతే కామంచేత ధర్మార్థములను మర్చిపోయి ప్రవర్తిస్తాడో వాడు పతనమవుతాడు. సుగ్రీవా! మీ అన్నగారు వెళ్ళినదారి యింకా మూసబడలేదు' అని సుగ్రీవునితో చెప్పమని లక్ష్మణుని పంపుతాడు రాముడు. అంటే చంపుతానని పరోక్షంగా చెప్పగానే లక్ష్మణుడు ఉగ్రుడయిపోగానే, మళ్ళీ శాంతించి సుగ్రీవునకు గుర్తుచేయుమని చెప్పాడు

* నీకు కోపం యెలాగున వచ్చిందో, సుగ్రీవునకు కామం అలా వచ్చింది. నువు కోపానికి యెలా వశమయి పోతున్నావో, ఆయన అలా కామానికి వశమయినాడు. అదితప్పా! అని తార లక్ష్మణుడిని ప్రశ్నించి శాంతపరచింది.

* సుగ్రీవుడు తప్పుచేసిన వాడయుండి, సామర్థ్యము కలిగి వుండి తప్పు ఒప్పుకున్నవాడయ్యాడు.

* సుగ్రీవుడు సీతను వెదకడానికి వెల్తున్నవారికి వాళ్ళు వెళ్ళే త్రోవలో వచ్చేవాటిని వివరంగా చెప్తుంటే, రాముడు అంత వివరంగా యెలా తెలుసునని అడిగితే, 'నా అన్న దయ వలన నాకు అన్నీ తెలిసాయి తను నన్ను తరుముతుంటే నేను అన్ని ప్రదేశాలూ తిరిగి తిరిగి, యీ చిత్రకూటానికి వచ్చి యిక్కడ స్థిరపడ్డాను' అని చెప్పాడు

* సంపాతి పక్షి సముద్రము వద్దున గుట్టపై వుంది. మీరెవ్వరని వానరులను ప్రశ్నించి తన గురించి యిలా చెప్పింది. జటాయువు, సంపాతి తమ్ముడు, ఇద్దరూ సూర్యునివద్దకు బయలుదేరి దగ్గరకు వెళ్ళుతూ ఆ తీక్షణకు తట్టుకోలేక జటాయువు పడిపోతుంటే సంపాతి తన రెక్కలతో జటాయువును కాపాడింది అందుచేత సంపాతి రెక్కలు పోయి యిక్కడ పడిపోయింది. అంటూ ఆ వైనం చెప్పి సీతను రావణుడు తీసుకొని వెళ్ళటం తను చూసిందని, ప్రస్తుతం లంకలో సీత తనకు కన్పిస్తుందని చెప్పి, సముద్రాన్ని ఎవరైనా దాటగలిగితే వాళ్ళను సీత కన్పిస్తుందని చెప్పి తనకు సముద్రంలో స్నానం చేయిస్తే రెక్కలొస్తాయి కాని తను కదలలేదు కావున స్నానం చేయించమని కోరింది. వానరులు ఆ విధంగా చేయించగానే సంపాతికి రెక్కలొచ్చాయి.

* హనుమంతుడు, లంకకు వెళ్తాను, 'అక్కడ సీత లేకపోతే స్వర్గానికివెళ్తా, అక్కడా లేకపోతే మొత్తం లంకను రావణునితో సహా పెకిలించి రాముని వద్దకు తీసుకువస్తాను.అయనే చూసుకుంటాడు.' అని తక్కిన వానర వీరులతో అంటాడు.

* సుందరకాండ మొత్తం 68 సర్గలు రోజుకి 7 సర్గలు చొప్పున మొత్తం 68 రోజులు చదివితే 7 సార్లు సుందరకాండ పారాయణము చేసినట్లవుతుంది. దానిని సప్తసర్గ పారాయణము అంటారు, పూర్తిగా 68 రోజులు పూర్తయిన తర్వా తనే పట్టాభిషేక సర్గ చదవవలెను. సుందరకాండము పరమ రహస్యమైన మంత్రం దానిని పారాయణ చేయుట సర్వారిష్ట నివారణము. సర్వాభీష్టప్రదము.

* సుందరకాండలో నవరసాలూ కన్పిస్తాయి.

* సుందరకాండలో రాముడు, అంజనేయస్వామి, సీతమ్మ ముగ్గురు ప్రధానంగా కన్పిస్తారు ముగ్గురూ సుందరులు.

* ఆనందము బయటకు కన్పించదు. సౌందర్యము బయటకు కన్పిస్తుంది. ఆనందము సౌందర్యము కలిసి వుంటాయి.

* ఆనందమును కదల్చేది సౌందర్యము. సీతారాములలో నున్న శోకమును తగ్గించిన స్వామి సుందరుడు. వారిలో నున్న ఆనందమును బయటకు తెచ్చిన స్వామి సుందరుడు. ఒకరిజాడ యింకొకరికి చెప్పి వారిలోనున్న శోకాన్ని పోగొట్టి వారికి ఆనందము కలిగించిన స్వామి 'సుందరుడు'.

* రాముని సౌందర్యము తెలిసినవారు సీత, అంజనేయులే. వీరిద్దరే రాముని పరిపూర్ణముగా తెలిసినవారు. 'లోకంలో యే ప్రాణియైనా రాముని చూస్తే వాళ్ళ హృదయం కొల్లగొట్టబడుతుంది. అంతటి రమణీయుడు రాముడ'ని హనుమంతుడు సీతమ్మతో చెప్తాడు. అప్పుడు సీతమ్మ హనుమంతుని రాముని దూతగా నమ్ముతుంది.

* అంజనేయుడు రాముని దూతయని, ఒకవేళ రావణుడుగాని, యే రాక్షసుడుగాని మారువేషంలో వస్తే రాముని పొగడరు కాబట్టి అంజనేయుడు నిజంగా రాముని దూతయని సీతమ్మ నమ్మింది.

* అత్మ, పరమాత్మ, ఆచార్యులు_ సీత, రాముడు, అంజనేయుడు. ఉత్తరమున నున్న రాముడు దక్షిణముననున్న సీతను అంజనేయుని ద్వారా చేరాడు. ఆత్మ ఆచార్యునిద్వారా పరమాత్మను చేరుతుంది.



* హనుమ మంత్రస్వరూపుడు. హనుమ మంత్ర ప్రమదైన ఆచార్యుడు.

* అంజనేయుడు మూడు రకములుగా ప్రవర్తించేడు. 1) దూత 2) భగవంతుని పొందడానికి అహర్నిశలు ప్రయత్నించడము 3) సిద్ధిని పొందిన దారయి తరులకు సాయపడటం.

* నీలుడు, సుగ్రీవుడు, అంగదుడు, తను లంకకు సముద్రం దాటి రాగలరని అంజనేయుడు లంకకు వెళ్ళిన తర్వాత లంకను చూసి అనుకున్నాడు.

అంగదుడు—భగవన్నామం.

నీలుడు — అగ్నిహోత్రంలో హోమం.

హనుమ—మంత్రోపదేశం.

సుగ్రీవుడు—వేదపారాయణ.

పై నలుగురే సాగరం దాటి లంకలోనికి వెళ్ళి సీతమ్మను చూడగలరు.

పై నాల్గు సాధన చేస్తేనే ఆత్మను గుర్తించి పరమాత్మతో కలపడానికి వీలవుతుంది.

* రాముడు నిన్నే తలుస్తున్నాడు. శోకిస్తున్నాడు అని అంజనేయుడు చెప్పితే అమృతంలో విషం కలిపి అందించే వంటుంది సీతమ్మ. స్వామి నిన్నే తలుస్తున్నాడన్నది అమృతం, కాని శోకిస్తున్నాడన్నది విషం.

* రామునికి తనకు గల సాన్నిహిత్యాన్ని తెలుపుతూ సీతమ్మ యీ క్రింది సంఘటనను రామునికి జ్ఞాపకం తెచ్చుకోమని అంజనేయునికి వివరించింది.

రాక్షస సంహారం జరగాలి. రామునికి కోపమే రాదు. మరి యేం చేస్తే రామునకు కోపం వస్తుందో తెలిసికొనుటకు యింద్రుడి కొడుకు కాకిగా వచ్చి సీతారాముల అన్యోన్యతను గమనిస్తూ రాముడు చూస్తుండగా సీతమ్మ వక్షస్థలం మీద కొడతాడు. వెంటనే రామునకు కోపం వచ్చి బ్రహ్మాస్త్రం గడ్డిపోచమీద ప్రయోగించి వదిలాడు. ఇంద్రుని కొడుకును తండ్రి, తల్లి, మునులు, దేవతలు యెవ్వరూ రక్షించలేకపోయారు. అప్పుడు కాకి మళ్ళీ స్వామి వద్దకు వచ్చి శరణు కోరుతూ కాళ్ళవద్ద పడింది. ఆ పడటం పాదాలు స్వామివైపు వుండేటట్లు పడింది. అప్పుడు సీతమ్మ కాకి తల స్వామి పాదం వైపు ఉండేటట్లుగా మార్చింది.

మరి బ్రహ్మాస్త్రం వదిలేనే యెలాగ? అని స్వామి అంటే నా కన్ను తీసేయి స్వామి అని యింద్రుడి కొడుకు కోరాడు—దీనినే చావుతప్పి కన్ను లొట్టయిందంటారు. కాకిమీద బ్రహ్మాస్త్రం అని అంటారు.

* లోకోపకారమునకు వినియోగించవలసిన శక్తులను లోకాపకారమునకు వినియోగించి రావణుడు తనే పతనమయ్యాడని మండోదరి యేడ్చింది. ఇంద్రియాలను జయించి భగవంతునికి దగ్గర అవాలి కాని లోకాన్ని జయించాలనుకొని యింద్రియాల ప్రభావంచేత నాశనమయ్యాడు.

విశ్వామిత్రుడు

వేదాలు అతనిలో భాసించాయి. ఆయనే గాయత్రీ మంత్రద్రష్ట। ఆయనే శ్రీరామచంద్రునికి ద్రష్ట। ఆయన జీవితం మోహంతో పుట్టి త్యాగంతో అరయింది.

శతానందుల వారు విశ్వామిత్రుని గురించి చెప్పిన విధం:-

రాజైన విశ్వామిత్రుడు వేటకు పరివారముతో వెళ్ళి అలిసిపోయి తిరిగివస్తూ వశిష్ఠమహాముని ఆశ్రమానికి ఆతిథ్యానికి వెళ్తే, వశిష్ఠుల వారు అప్పటికప్పుడే విశ్వామిత్రునికేకాక ఆయనతోనున్న పరివారమందరికీ కూడా తృప్తిగా పంచభక్ష్య పరమాన్నాలతో ఆతిథ్యమిచ్చారు.

విశ్వామిత్రుడు ఆశ్చర్యపోయి వాకబు చేయగా 'కామధేనువు' అనే గోవు మహిమ వలన యింతమందికీ తగిన వ్యవధిలేకుండా ఆతిథ్యమివ్వ గలిగినట్లు తెలిసింది. అటువంటి గోవు రాజ్యాధిపతి అయిన తనవద్దనుంటే అది యింకా ప్రజోపయోగంగా వుంటుంది కాని అరణ్యంలో ఒక మునివద్ద ఉంటే ఉపయోగం వుండదని అనుకొని, వశిష్ఠుని ఆ గోవును తనకిమ్మని ప్రతిగా వేలాది గోవులు యిస్తానని అడిగాడు. వశిష్ఠుడు యివ్వనన్నాడు. విశ్వామిత్రుడు పరి పరి విధాల ఆశ చూపించినా వశిష్ఠుడు యివ్వననేసరికి కోపం వచ్చి తన భటులతో కామధేనువును బలవంతాన కోటకు తీసుకురమ్మన్నాడు. భటులు బలవంతంగా లాక్కుపోతుంటే కామధేనువు కన్నీరుతో వశిష్ఠుని, 'నన్ను నమ్మి నీవద్ద ప్రశాంతంగా వున్న నన్ను యెందుకిలా రాజువెంట పంపుతున్నావు, నీకిది ధర్మమా,' అని అడిగింది. అందుకు వశిష్ఠుడు, 'అమ్మా। నేను నిన్ను పంపించేయటంలేదు. నా అంగీకారము లేకుండా



రాజు తనకున్న బలగర్వంతో నిన్ను తీసుకువెళ్ళిపోతున్నాడు. అతను రాజు. నేను అతని రాజ్యంలో మునిని. అతనిని ఆపే శక్తి నాలోలేదు. ఆ శక్తి నీలోవుంటే అతన్నెదిరించి నాకు మనస్తాపాన్ని తగ్గించు। నిన్ను వదులుకోవటం నాకూ యిష్టం లేదు.' అని తన మనస్సులో మాట బయటపెట్టాడు ఆ విధంగా వశిష్ఠుడు అనగానే శత్రువుల నెదిరించడానికి తనకు అనుజ్ఞ వచ్చినదని కామధేనువు గ్రహించి తన ఒక్కొక్క రోమం నుండి ఒక్కొక్క యోధుడిని సృష్టించగా ఆ యోధులు స్వైర విహారం చేసి విశ్వామిత్రుని బలగాన్ని నేలకూల్చగా విశ్వామిత్రుడు సిగ్గుపడిపోయి దివ్యాస్త్రాలు సంపాదించాలని నిశ్చయించుకొని తపస్సు చేశాడు.

అది మొదలుగా అతను వెయ్యి సంవత్సరాల కొకటి తపస్సు చొప్పున 16 సార్లు తపస్సు చేశాడు.

మొదటిసారి తపస్సు చేస్తే పరమశివుడు ప్రత్యక్షమయితే అస్త్రాం నడిగేడు. ఆ అడగడమే కామధేనువును అడిగితే స్వామి యిచ్చునేమో। కాని అస్త్రాలడిగాడు. అంటే స్వామి శక్తికన్నా అస్త్రాలు గొప్పవనుకున్నాడు. ఆ అస్త్రాలను ఒకటొకటిగా వశిష్ఠునిమీద ప్రయోగించితే అతనికి యేమీ జరుగలేదు. అప్పుడు విశ్వామిత్రుడు బ్రహ్మాస్త్రాన్ని వేశాడు అందుకు ప్రతిగా వశిష్ఠుడు బ్రహ్మతేజాన్ని వదిలితే లోకమంతా తల్లడిల్లిపోయింది. కాని ఎటువంటి అనర్థం జరుగకుండా బ్రహ్మాస్త్రం నివారింపబడింది.

అప్పుడు విశ్వామిత్రుడు క్షాత్రంతో కాకుండా మనసుతో జయించాలనుకున్నాడు. అతీంద్రియమైన శక్తి లోపల వుండేటట్టుగా బ్రహ్మ శక్తిని సంపాదించాలనుకున్నాడు. తపస్సు చేశాడు ఈసారి బ్రహ్మావచ్చి రాజర్షివైనావంటే సిగ్గుపడి మళ్ళీ తపస్సు ప్రారంభించాడు.

త్రిశంకునికి బొందితో స్వర్గానికి వెళ్ళాలనిపించింది. గురువుగారయిన వశిష్ఠులవారి నడిగితే ఆయన తనవల్ల కాదన్నాడు. వశిష్ఠుల కుమారులనడిగితే గురువులచే తిరస్కరించబడి తిరిగి యింకొకరిని అడిగి నువు హీన చరిత్రుడ వయ్యావు. అలాగే తయారవుదువు గాక అని శపించగా అలాగే మారిపోయినా, త్రిశంకుడు తన కోరికను వదులుకోలేక పట్టుదలగా ప్రయత్నిస్తూ, విశ్వామిత్రునికి వశిష్ఠునకు గల వైరం తెలుసుకొని వశిష్ఠుడు కాదన్న పనిని విశ్వామిత్రుడు పంతం కొద్దీ చేస్తాడని తలంచి అతని కోసం వెతుక్కుంటూపోయి తపస్సు చేసుకుంటున్న

విశ్వామిత్రుని వద్దకు వచ్చి అంతా చెప్పి తనను అనుగ్రహించి స్వర్గానికి బొందితో పంపమన్నాడు.

విశ్వామిత్రుడు తనకు వేదాలు రావుకాబట్టి, యజ్ఞం చేయడానికి అర్హత లేదు కాబట్టి, యజ్ఞం చేస్తేనే కాని దేవతలు రారు కాబట్టి, యజ్ఞం చేయడానికి అర్హతలు కల ఋత్విక్కులందరికీ ఆహ్వానం పంపాడు. అర్హత లేనివాడు చేసే యజ్ఞానికి 'మేము రాము' అని వశిష్ఠుని కొడుకులు తిరస్కరించారు. ఆ సంగతి విని విశ్వామిత్రుడు వాళ్ళకు శాపాలిచ్చి తన తపశ్శక్తిని కొంత పోగొట్టుకున్నాడు యజ్ఞంలో దేవతలను పిలిస్తే దేవతలు రాలేదు. అప్పుడు కోపంతో రెచ్చిపోయి తన తపశ్శక్తితో త్రిశంకుడిని స్వర్గానికి పంపాడు. ఆ విధంగా వస్తున్న త్రిశంకుడిని దేవతలు క్రిందకు త్రోసేశారు. క్రిందకు పడిపోతున్న త్రిశంకుడు తనను రక్షించమని విశ్వామిత్రుని వేడుకోగా విశ్వామిత్రుడు తన తపశ్శక్తితో త్రిశంకుడిని మధ్యలోనే ఆపి అతని కోసం అక్కడ స్వర్గానికి ప్రతిసృష్టి చేశాడు. ఆ విధంగా త్రిశంకు కోరిక నెరవేరింది కాని విశ్వామిత్రుని తపశ్శక్తియావత్తూ హరించుకు పోయింది

ఈ సారి తపస్సు చేస్తుండగా మేనక వచ్చింది. తపస్సు మర్చిపోయాడు. అంటే కామాన్ని జయించలేక పోయాడు. కొంత కాలం తర్వాత జ్ఞాపకం వచ్చి ఉత్తరానికి వచ్చి తపస్సు చేశాడు. బ్రహ్మ వచ్చి ఋషివైనావన్నాడు. మళ్ళీ తపస్సు చేస్తే మహర్షి వైనావన్నాడు మళ్ళీ తపస్సు చేస్తే యింద్రుడు తన పదవికి యెసరు వస్తుందే మోనని రంభను పంపాడు విశ్వామిత్రుడు కోపంతో రంభను శపించి క్రోధంతో కామాన్ని జయించాలనుకొని తపస్సు ఫలితం వదులుకున్నాడు.

తూర్పుకి వచ్చి మళ్ళీ తపస్సు చేశాడు, అతి తక్కువ ఆహారం తీసుకునే వాడు అలా తీసుకునే సమయంలో యింద్రుడు వచ్చి అహారం అడిగితే అతనికి ఆహారం యిచ్చేసి నిరాహారంగా మళ్ళీ తపస్సు చేస్తే బ్రహ్మవచ్చి బ్రహ్మర్షి వైనావన్నాడు. వశిష్ఠుడు ఒప్పుకోవాలని విశ్వామిత్రుడు పట్టుబట్టితే వశిష్ఠుడు ఒప్పుకున్నాడు అంతటితో తన పంతం నెగ్గినట్లు తృప్తి చెందాడు.

ఈ తపస్సుల పరంపరలలో అతను కామ క్రోధ మదమాత్సర్యాలు యీర్ష్యా ద్వేషాలను జయించ గలిగాడు కాని యింకా తన్నుతాను రక్షించుకోవాలనుకొని అందుకై యజ్ఞం తల పెట్టాడు. యజ్ఞాన్ని మారీచసుబాహులు ఆటంక పరుస్తుంటే దశరధుడిని యజ్ఞ పరిరక్షణకు రామచంద్రుని పంపించమని కోరి భగవంతుని



సాన్నిధ్యంలో గడిపి, భగవంతుడే కార్యం చేయించేవాడు, రక్షకుడు అన్న జ్ఞానం కలిగి సిద్ధిపొంది సీతారాములను లోక కళ్యాణం కోసం కలపాలను కున్నాడు. సీతా రాములను కలిపి తపోలోకానికి వెళ్ళిపోయాడు.

మోహంతో మొదలుపెట్టి త్యాగంతో అంతరయింది విశ్వామిత్రుని జీవితం. అస్త్రాలనడిగి అవి వశిష్ఠుని మీద పని చేయకపోవడంతో 'అహం' పోగొట్టు కున్నాడు. త్రిశంకుని కథతో తన 'మదం' పోగొట్టుకున్నాడు. తర్వాత కామానికి లొంగి గమ్యం మర్చిపోయాడు. తర్వాత కామాన్ని జయించడానికి క్రోధాన్ని, ఆశ్రయించాడు తర్వాత యింద్రుని పరీక్షలో క్రోధాన్నికూడ జయించడానికి క్షమ కరుణ, దయ, పరోపకారాలను ఆశ్రయించాడు సాధనలో యెన్నో ఆటంకాలు వచ్చినా వాటినన్నింటినీ ఒక్కటొక్కటిగా అధిగమించాడు అప్పుడు జ్ఞానం కలిగింది సిద్ధిపొందేడు. కామధేనువు కావాలన్న కోరికతో బయలుదేరిన పట్టుదల మోక్షానికి త్రోవ చూపింది.

## పరమ గురువులు-వారిని చేరుమార్గము

శిష్యుడనగా ప్రకృతిలో నిగూఢమగు రహస్యములను, మానవునిలో అంతర్గతముగ నున్న అధ్యాత్మిక శక్తులను అభ్యాసపూర్వకముగ నేర్చు కొనుటకై యొక గురువున కర్పణము చేసుకున్న విద్యార్థి. వానిని స్వీకరించిన అధ్యాపకుని భారతదేశములో గురువందురు. నిజమైన గురువు యెప్పుడును గుప్తవిద్యా ప్రవీణుడై యుండును. బాహ్యవిషయము గురించి గుప్తవిషయముల గురించి అతి గాఢమగు జ్ఞానము కలిగి పరిపూర్ణ జితేంద్రియుడై ప్రకృతి శక్తులను నిగ్రహింపగల సిద్ధులనే గాక తనలో పూర్వము అంతర్గతముగ నుండి యిప్పుడు స్ఫుటముగ నున్న శక్తుల సాయముచే ప్రకృతి మర్మములను తెలిసికొనగల శక్తిని గూడ సంపాదించిన పురుషుడే నిజమగు గురువు.

## శిష్యునకు కావలసిన యోగ్యతలు

1. పరిపూర్ణ ఆరోగ్యము.
2. సంపూర్ణ శౌచము, చిత్త సంశుద్ధి.
3. స్వార్థ రహితమయిన ఉద్దేశము; సార్వత్రిక మగు దాతృత్వము; సర్వ ప్రాణులు యెడల కారుణ్యము

4 సత్యసంధత; ప్రకృతియందలి యేశక్తి ప్రభావమునకు లోబడనట్టి కర్మనియతియందు అచంచలమగు నమ్మకము కలిగియుండి,యీ కర్మనియతి యొక్క గతికి యేరీతిగను ఆటంకము కలుగజేయక దానిని ప్రార్ధనలచేగాని, ఉపశాంతి కలుగజేయు వ్రతములు మొదలగు బాహ్యకర్మలచే గాని మరలింపజేయకుండుట;

5. ఎట్టిప్రమాదకరమగు అవస్థలోనైనను, ప్రాణ భయము కలిగినప్పుడైన జంకెరుగని ధైర్యము;

6. తాను ఆవిష్కరించిన అవలోకితేశ్వరుని, అనగా పరమాత్మ యొక్క ఉపాధినని అంతర్బుద్ధిచే గ్రహించుట.

7. దృశ్యము, నశ్వరమునైన యీప్రపంచ మందలి ప్రతి వస్తువునకు అదృశ్యలోకములలో గల సంబంధమును న్యాయముగా నిర్ణయించుచు వాని యెడల శాంతమగు ఉదాశీనతను కలిగి యుండుట.

## సాధనములు

అధ్యాపన కొఱకు యేర్పఱచుకొనే స్థలము మనస్సును ఏ విధముగను చలింప జేయుటకవకాశములేని స్థలమై యుండవలెను. ఆకర్షక శక్తులను ప్రభవింప జేయు వస్తువులతో నిండియుండవలెను. ఇతర వస్తువులతోపాటు అక్కడ పవిత్ర మగు పంచరంగులు వర్తులముగ సమకూర్చబడి యుండవలెను. దుష్టశక్తులేమియు గాలిలో లేకుండా స్థలము పరిశుద్ధముగా నుండవలెను. ధ్యానము, అన్ని విషయము లలోను మితము, నైతిక బాధ్యతలను నెరవేర్చుట, మృదుభావములు, సత్కార్మలు, ప్రియమగు మాటలు, సర్వభూతహితత్వము, సంపూర్ణస్వార్థరాహిత్యము-ఇవి జ్ఞానో పార్జనమునకును, పరాజ్ఞానమును బొందగల యోగ్యతను సంపాదించుటకును శ్రేష్ఠత మ మగు సాధనములు.

## అంతరంగమును చక్కగ చేసుకొనుటకు సాధనములు

1. నిన్ను,వ్యక్తిగతమగు నీ సొంత కోరికలను మరచిపొమ్ము; నీ బలము, నీ యోచన, నీ యుత్సాహము పూర్తిగా వినియోగించి యితరులకు సేవ చేయవలె నని జ్ఞాపకముంచుకొనుము

2. నిన్ను ప్రత్యక్షముగ అడిగినప్పుడు తప్ప యే విషయమై కూడ నీ అభిప్రాయమును ప్రకటించకుము.



3. మాట్లాడుటకు ముందు నీవు పలుకునది యెవ్వరినెట్లు బాధించునో బాగుగా యోచన చేయుము.

4. ఒక సోదరుని లోపమును బయటపెట్టుట గాని, విమర్శించుట గాని యెన్నడును చేయకుము.

5. నీవు నేర్చుకొనవలసినవి చాల గలదనియు,కనుక నీవు వొరబడియుండ వచ్చుననియు జ్ఞాపకముంచుకొనుము. ఎల్లప్పుడు తగు వినయముతో మాట్లాడుము

6. ఎవ్వరైనా నిన్ను పిలిచినప్పుడు, నీవు చదువుతున్నదానినో, చేయు చున్నదానినో పూర్తి చేయు టకు నాగక, ఆ క్షణమందే లేచి వెళ్ళుము. ఏదయినా ముఖ్యమగు కార్యమును నెరవేర్చుచున్నచో అది యేదో మృదువుగా తెలియ జేయుము

(సంక్షిప్త సంకలనము)

—యోగి 'లెడ్ బీటరు రచించిన 'Masters and the Path' గ్రంథమునకు తెలుగు అనువాదము 'పరమ గురువులు-వారిని చేరు మార్గము'లోని విషయములు.

అంగ్లములో ప్రచురణ 1925

తెలుగులో ప్రచురణ 1958

ప్రతులకు : చింతామణి ముద్రాక్షరశాల, రాజమంద్రి

## మహీ పీఠము

దివ్యజ్ఞాన సమాజము స్థాపించబడిన తరువాత ఆ సమాజం పెద్దలు తమ గ్రంథములలో అనేక అపూర్వ విషయములు పరమ గురువులచే బోధింపబడినవి. పాఠకులకు తెలియచేశారు. ఏ మతస్థుడైనను ఆ గ్రంథములను చదివిన యెడల తమకు అదివఱకు అర్థము కాని మత విషయములు చక్కగా అర్థమై, తమ తమ మతములయందెక్కువ శ్రద్ధ కలిగినవారవుతున్నారు. ఆ విధంగా పరమ గురువులచే ప్రవచించబడిన అపూర్వ విషయములను శ్రీ అద్దంకి సీతారామశాస్త్రిగారు రచించిన 'ఆత్మవిచారము', 'మహీ పీఠము'లలో 'మహీ పీఠము' రెండవ కూర్పు 1956లో జరిగినది. అందలి ముఖ్యాంశములు సూక్ష్మంగా పాఠకులకు అందజేయడం జరిగింది-

—సంకలన కర్త.

* విశ్వామిత్ర మహర్షి దశరథమహారాజును చూచుటకుగా అయోధ్యానగరమునకు వచ్చెను. దశరథ చక్రవర్తి తపస్సంపన్నుడై జాజ్వల్యమాన తేజస్సుతో ప్రకాశించుచుండు విశ్వామిత్ర మహర్షికి ఉచితాసనము యిచ్చి సత్కరించి విద్యుక్త రీత్యా అర్చనము చేసి సంతోషించినవాడై అంజలీబద్ధుడై విశ్వామిత్రునితో 'మునీంద్రా! అద్యంతములు లేనిదియు, నాశరహితమయినదియు అగు బ్రహ్మానందము ఇప్పుడు తమ దర్శనము వలన నాకు కలిగినది తమకు ముఖ్యమైన కోరిక ఏది? నేను తమకు ఏమి సత్కారము చేయగలను?.... తాము మిక్కిలి పూజ్యులు గనుక తమ కోరికను నెరవేర్చెదను' అని మనవి చేసుకొనెను.

అందుకు విశ్వామిత్రమహర్షి యిట్లు పలికెను "ఇట్టి ఉదార గుణములును, వాక్కులును శ్రేష్టమైన వంశమునందు పుట్టిన నీకే తగును మరియు వశిష్ఠ మహాముని యొక్క శిక్షణ యందుండు నీవు వేరు విధముగా పలుక గలవా? పురుష శ్రేష్ఠా! వినుము. ఒక కార్యమును ఉద్దేశించి ఆ కార్యము సిద్ధి చెందునట్లు కావలెనని ఆశగొని యున్నాను. నాయొక్క నియమమునకు భయంకరులైన రాక్షసులు విఘాతకర్తలుగా నేర్పడియున్నారు. వారల చేత పీడితుడనై శరణుకోరి వచ్చిన నన్ను రక్షింపుము. నీకు శ్రీరాముడు అని యొక కుమారుడు కలడు అతడు వ్యాఘ్రము యొక్క పరాక్రమము వంటి పరాక్రమము కలవాడు. వీర్యము నందు ఇంద్రునితో సమానుడు. నీ కుమారుడు రాక్షసులను నశింపజేయు శక్తి గలవాడు. అట్టి కుమారుని నాకు నీవు ఇయ్యవలయును, నేను అతనిని రక్షించగా విఘ్నకారులగు రాక్షసులను అతను దివ్యమైన తన బలముచే నశింప జేయగలడు. కమలపత్రాక్షుడగు శ్రీరాముడు మహానుభావుడు అని నేను తెలిసికొనియున్నాను. మహాతేజోవంతుడైన వశిష్ఠ మహర్షియు ఇతర దీర్ఘదర్శులును శ్రీరాముని యొక్క ప్రభావమును తెలిసికొని యుండు వారలే!"

వశిష్ఠ మహర్షి దశరథునకు ధైర్యము చెప్పి విశ్వామిత్ర మహాముని వెంబడి శ్రీరామచంద్రుని పంపుటకు ఇష్టపడునట్లు చేసెను. అప్పుడు దశరథ మహారాజు శ్రీరాముడు ఏదో మనోవ్యథతో ఉన్నట్టు తెలిసి సభకు పిలిపించిన శ్రీరాముడు తన గాఢ వ్యాకులమునకు కారణములను యీ విధముగా తెలిపెను.

"నేను తీర్థయాత్ర ముగించి యిల్లు చేరితిని. సంసారము ఎట్టి సుఖము నిచ్చును? జనము చచ్చుచు పుట్టుచు నుండును గదా. ఐశ్వర్యము నిచ్చునని తలువ



బడు అశాశ్వతములైన పదార్థములు ఆపదలకు కారణములగుచున్నవి. కనుక నాకు రాజ్యముతోనేమి, భోగముతోనేమి, నేను అనబడు వాడు ఎవ్వరు? జగత్తు సత్యమా? మిథ్యయా? ఇట్లు విమర్శించు నాకు ఎల్ల విషయములందును నిరుత్సాహము కలిగినది. ఈ సంసార దుఃఖము ఎట్లు ఉపశమించును? అను చింతచే శ్రమపడుచున్నాను. ఈ సంసారమునందు గొప్పగా నెంచబడు ఐశ్వర్యము కూడ సుఖము నీయదు. పండితులును, శూరులును, తమకు ఒకరు చేసిన మేలును మరువని వారును, సమర్థులును, మృదువగు స్వభావము గలవారును, ఐశ్వర్యము ప్రాప్తించగా కఠినులగుచున్నారు. లోక నిందకు పాలుగాని సంపన్నుడు, ఆత్మస్తుతి చేసుకొనని శూరుడును, సమదృష్టిగల ప్రభువును ఈ ముగ్గురును దొరకరు. అహంకారము వలననే ఆపదలు కలుగును అహంకారము వలననే మనోవ్యాధులు కలుగును అహంకారము వలననే కోరికలు కలుగును మునీంద్రా! నేను కనుగొన్నంతలో లోక ఆపదలు క్షణములోనే వచ్చును. సంపదలు కూడ క్షణ మాత్రములోనే వచ్చును. ఇందువల్ల నా మనస్సు నొచ్చియున్నది."

శ్రీరామచంద్రుని వాక్యమును విని ఈ బాలునికి ఇంతటి వైరాగ్యయుక్తమైన పరితాపము ఉన్నది కదా! అని అందరూ ఆశ్చర్యపడిరి

అప్పుడు విశ్వామిత్ర మునీశ్వరుడు శ్రీరామచంద్రునితో నిట్లనియె. "జ్ఞానవంతులలో శ్రేష్ఠుడవగు శ్రీరామచంద్రా! నీవు తెలిసికొనవలసిన అంశములు లేవు. నీవు సూక్ష్మబుద్ధివి, సకలమును ఎరుంగుదువు. అయినను పూర్వము నాకును జ్ఞాన వైరాగ్య సంపన్నుడైన వశిష్ఠమునికిని బ్రహ్మదేవుడు ఏ జ్ఞానోపదేశము చేసితిరో ఆ జ్ఞానమునే వశిష్ఠ మహాముని నీకు ఉపదేశము చేయుగాక" అని పలికెను. అప్పుడు వశిష్ఠులవారు యీ విధముగా పలికిరి.

సృష్టి కార్యమును వహించిన బ్రహ్మదేవుడు తాను సృష్టించిన సృష్టి సమూహము నంతయు పరీక్షించెను. ఇంతలో కృతయుగము ముగిసెను. క్రొత్త సృష్టి బాల్యమును దాటి కౌమార దశకు వచ్చెను. అనగా అహంభావము అధికమగుచు వచ్చెను. వారలకు అనుభవజ్ఞుల సహాయము కావలెనని బ్రహ్మలోకమునందు ఉండి నన్ను సృష్టించి సకల జ్ఞానమును నాలో నిమిడిచి భరతఖండమునందు ప్రబలుచుండిన అజ్ఞానమును నశింపచేయుటకు నన్ను పంపెను. నన్ను పంపినట్లుగానే యితర ఋషులగు నారదులు మొదలగు మునులకు కూడ యీ

లోకమునకు పంపెను మానసపుత్రులైన సనత్కుమారుల వారిని అగ్రగణ్యులుగా పంపెను ఇట్లు పంపబడిన ఋషుల సంఘమునకు 'మహీ పీఠము' అని పేరు

* సృష్టి అంతయు అండరూపముగా నున్నది దీనికి 'బ్రహ్మాండము' అని పేరు. శివ విష్ణు బ్రహ్మలు అను త్రిమూర్తులకు నివాసభూతమైన సూర్యనారాయణ మూర్తి తన చుట్టును కొందరు (కొన్ని) గ్రహములను చేర్చుకొని ఆయా గ్రహములకును తనకునుగల శక్తిని ఉపయోగించి వాటి వాటిని వాటి స్థలములయందు ఉంచి యుండును. ఇట్టి బ్రహ్మాండములు అనేక కోట్లు ఉన్నవి అని మహానారాయణోపనిషత్తునందు చెప్పబడియున్నది. అనేక కోట్ల బ్రహ్మాండములు ఉండునపైతే అనేక కోట్ల సూర్యులు కూడ నుండవలెను. సూర్యుడు బ్రహ్మాండమునకు అధిపతి. సూర్యుడు లేనిదే బ్రహ్మాండము లేదు

పశ్చిమదేశపు ఖగోళ శాస్త్రజ్ఞులు ఒక్కొక్క బ్రహ్మాండమునకు ఒక్కొక్క సూర్యుడు ఉన్నాడనియు. ఆకాశమునందు మనకు కనబడు నక్షత్రములు అన్నియు సూర్యులు అనియు, ఆయా సూర్యులను అనుసరించి వారి బ్రహ్మాండములకు చేరిన గ్రహములు కూడ ఉన్నవనియూ, అవి మనకు దృష్టి గోచరములు కావనియు చెప్పియున్నారు........ ఒక్కొక్క బ్రహ్మాండమునకును ఈశ్వరుడు సూర్యమండలమునందు త్రిమూర్తి స్వరూపముతో నుండును. ఒక్కొక్క బ్రహ్మాండమునకు సూర్యుడు ఆధారము.

* ఈ బ్రహ్మాండమునకు సూర్యుడు రాజుగా త్రిమూర్తులకు వాసస్థలమై యున్నాడు. అతని చుట్టును 1) శశిమండలము, 2) బుధమండలము, 3) శుక్రమండలము, 4) అంగారక మండలము, 5) బృహస్పతి మండలము 6) శని మండలము, 7) భూ మండలము అని ఏడు మండలములు ఉన్నవి. సూర్యునతో చేరి ఎనిమిది గ్రహములు కలవు.

ఈ మండలములకెల్ల అవల సప్తర్షి మండలమును, ధృవమండలమును ఉన్నవి. త్రిలోకి అనగా భూలోక, భువర్లోక, స్వర్గలోకములు ఇది వరకును వ్యాపించియున్నవి. ధృవ మండలమునకు వెలుపల మహర్లోకము ఉన్నది అందు పైన జనలోకము ఉన్నది. సనకసనందనాది బ్రహ్మ మానసపుత్రులు జనలోకమునందున్నారు. అందుకు పైన తపోలోకము ఉన్నది. అందుకు పైన సత్యలోకము ఉన్నది.



భూలోక భువర్లోక స్వర్గలోకములు కృతకములు అనబడును. జనలోక తపోలోక సత్యలోకములు అకృతకములు. కృతకములకును అకృతకములకును మధ్యన మహర్లోకము ఉన్నది. కృతకములకును అకృతకములకును మధ్యన లోకాలోక పర్వతము ఉన్నది.

* పూర్వకల్పము యొక్క అంతమునందు జరిగిన ప్రళయమునందు మునిగిపోయిన వేదములను, పురాణములను, స్మృతులను మహీపీఠము వారు మరల సంపాదించిరి.

* 1) ఋగ్వేదము, 2) యజుర్వేదము, 3) సామవేదము, 4) అధర్వణవేదము అని వేదములు నాలుగు. ప్రణవనాదము అను ఒక అపూర్వ గ్రంథమునందు ఈ ప్రకారము చెప్పియున్నది. ఇక ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము. అధర్వణవేదము అను నాలుగు వేదములకు అధిపతులు వీరు వీరు అని తెలిసికొనవలయును. ఋగ్యజుస్సామములకు సమాహారమైన అధర్వణ వేదమునకు అధిపతి మహావిష్ణువు. జ్ఞాననిష్ఠను బోధించు ఋగ్వేదమునకు అధిపతి విష్ణువు. క్రియానిష్ఠను బోధించు యజుర్వేదమునకు అధిపతి బ్రహ్మ. ఇచ్ఛానిష్ఠను ఉపదేశించు సామవేదమునకు అధిపతి శివుడు.

* జ్ఞానశక్తి క్రియాశక్తి ఇచ్ఛాశక్తి అని శక్తులు మూడు. జ్ఞానశక్తి విష్ణువు. క్రియాశక్తి బ్రహ్మ. ఇచ్ఛాశక్తి శివుడు. ఈ మూటి యొక్క అనగా జ్ఞాన ఇచ్ఛా క్రియా శక్తుల సమాహారము మహావిష్ణువు మహావిష్ణువే మహేశ్వరుడని శివపురాణములు చెప్పును.

* మంత్రము జ్ఞాన ప్రవచనము, బ్రాహ్మణము క్రియా ప్రవచనపరము, ఉపనిషత్తులు ఇచ్ఛా ప్రవచన పరములు. ఈ మూటి యొక్క సమాహారము ఉపవేదమైన తంత్రము. (తంత్రములందు సాధారణముగా శక్తిపూజ వివరించబడియున్నది.) కనుక ఋగ్యజుస్సామాథర్వణములను నాలుగు వేదముల యందును 1) మంత్రములు 2) బ్రాహ్మణములు 3) ఉపనిషత్తులు 4) తంత్రములు కలవు.

* వేదాక్షరములకు దేవతలు కలరు.

1) అనిల దేవతయొక్క అక్షరములు :.

అ ఆ ఏ క చ ట శ వ య ష—10 అక్షరములు.

2) అనల దేవత (అగ్ని) యొక్క అక్షరములు :-
ఇ ఈ ఖ ఛ ఠ థ ఫ ర స ణ — 10 అక్షరములు.
3) మహీ దేవతయొక్క అక్షరములు :-
ఉ ఊ ఓ గ జ డ ద బ ల హ — 10 అక్షరములు.
4) ఇందుః దేవతయొక్క అక్షరములు :-
ఋ ౠ ఔ ఘ ఝ ఢ ధ భ వ శ — 10 అక్షరములు.

5) అర్కః దేవతయొక్క అక్షరములు :-
ఌ ఙ ణ ఞ న మ ౢ క ౢ ప ౢ శ — 10 అక్షరములు.

అక్షరములకు జాతులు కలవు.
1. బ్రాహ్మణజాతి :- అచ్చులు—క చ ట త ప ఖ ఛ ఠ థ ఫ
2. క్షత్రియజాతి :- వర్గ తృతీయాక్షరములగు — గ జ డ ద బ; వర్గ చతుర్థాక్షరములగు ఘ ఝ ఢ ధ భ.
3. వైశ్యజాతి :- ఙ ఞ ణ న మ య ర ల వ
4 శూద్రజాతి :- శ ష స హ ళ ౢ క ౢ ప ౢ

* పురాణములు పదునెనిమిది. అవి :-
1) బ్రాహ్మము; 2) పాద్మము; 3) వైష్ణవము; 4) శైవము; 5) భాగవతము; 6) భవిష్యము; 7) నారదీయము; 8) మార్కండేయము; 9) ఆగ్నేయము; 10) బ్రహ్మవైవర్తము; 11) లైంగము; 12) వారాహము; 13) స్కాందము; 14) వామనము; 15) కౌర్మము; 16) మాత్స్యము; 17) గారుడము; 18) బ్రహ్మాండము.

ఇవికాక 18 ఉపపురాణములు కలవు. అవి :-
1) సనత్కుమారము; 4) నారసింహము; 3) స్కాందము; 4) శివధర్మము; 5) దౌర్వాసము; 6) నారదీయము; 7) కాపిలము; 8) మానవము; ʃ) ఔశనసము; 10) బ్రహ్మాండము; 11) వారుణము; 12) కాళీము; 13) మహేశ్వరము; 14) శౌమ్యము; 15) సౌరము; 16) పారాశరము; 17) మారీచము; 18) భార్గవము

* నిమిషము, కాష్ఠ, కళ, ముహూర్తము, పగలు, రాత్రి కలసిన — దినము నెలలు, సంవత్సరములు. ఇవన్నియు మనకు తెలిసినవే



సంవత్సరములు 1728000 కృతయుగము
1296000 త్రేతాయుగము
864000 ద్వాపరయుగము
4:2000 కలియుగము

కృత, త్రేత, ద్వాపర, కలియుగములు కలిసి ఒక చతుర్యుగము అనబడును.

| | |
|---|---|
| | ఒక వియుగము |
| 1000 చతుర్యుగములు | ఒక మహాయుగము |
| 10.0 వియుగములు | ఒక కల్పము |
| 1000 మహాయుగములు | ఒక మహాకల్పము |
| ఏడు కల్పములు | ఒక చక్రము |
| పదునాలుగు మహాకల్పములు | ఒక నిష్ఠ |
| పదునాలుగు చక్రములు | ఒక మనువు |
| పదునాలుగు నిష్ఠలు | మన్వంతరము |
| ఇద్దరు మనువుల కాలము | ఒక మహా మన్వంతరము |
| ఏడు మన్వంతరములు | ఒక నిక్ష |
| ఇతరత్ర ఏడు మహా మన్వంతరములు | ఒక చార్ద్య |
| ఏడు నిక్షలు | ఒక దైవము |
| ఏడు చార్ద్యలు | ఒక వినిహితము |
| ఏడు దైవములు | |

* సూర్యుడును ఏడు గ్రహములును చేరి ఒక బ్రహ్మాండము.

ఏడు బ్రహ్మాండములు జగత్తు
సహస్ర జగత్తులు కలిసి ఒక విశ్వము.

ఒకకోటి ఏబది లక్షల విశ్వములు ఒక మహావిశ్వము. రెండు శంఖల సంఖ్యగల మహావిశ్వములు ఒకలోకము. ఒక మహాశంఖము సంఖ్యగల లోకములు ఒక మహాలోకము.

నూరు పద్మములు సంఖ్యగల మహాలోకములు ఒక సంసారము.

* ద్వాపర యుగాంతమునందు ధర్మము క్షీణించి అధర్మము బలపడి యున్నప్పుడు విష్ణుమూర్తి శ్రీకృష్ణమూర్తి అనుపేర అవతరించి కురుక్షేత్రమునందు జరిగిన యుద్ధములో యుద్ధరంగముయొక్క మధ్య శ్రీమద్భగవద్గీతను ఉపదేశించిరి.

తనశిష్యుఁడగు ఉద్ధవునకు కలిగిన సందేహములను తీర్చు వ్యాజముతో శ్రీ మద్భాగవతము పదునొకండవ స్కంధమునందు లోక గురువైన శ్రీ కృష్ణమూర్తి ఉపదేశములను చేసియున్నారు కదా. ఇట్టి జగద్గురువులవారు తాను భౌతిక శరీరము వదులుకొనవలసిన సమయము వచ్చినపుడు శ్రీకృష్ణమూర్తి యొక్క ప్రియ శిష్యుడైన ఉద్ధవుడు శ్రీకృష్ణ దర్శనార్థమై వారి కడకు వెళ్ళెను. ఆ సమయము నందే కృష్ణద్వైపాయన వేదవ్యాసులవారికి స్నేహితుండును, తపస్సు బాగుగా చేయుచుండువాడును అగు మైత్రేయ మహర్షి శ్రీకృష్ణమూర్తిని చూచుటకై ఏతెంచెను.

దేహత్యాగము చేయుటకై వీరాసనాసీనుండై యున్న శ్రీకృష్ణమూర్తిని ఉద్ధవుడు సమీపించి బ్రహ్మజ్ఞానమును నాకెరింగింపుము, అని వేడగా నాతనికి బ్రహ్మజ్ఞానమును శ్రీకృష్ణమూర్తి ఉపదేశించెను. నిత్యభక్తుడైన మైత్రేయ మునితో శ్రీకృష్ణమూర్తి సంభాషించి ఉద్ధవుని సమక్షమందే విదురునికి భాగవత నామకంబైన బ్రహ్మజ్ఞానమును ఉపదేశింపుము అని మైత్రేయ మునికి నాజ్ఞచేసె. జగద్గురువగు శ్రీకృష్ణమూర్తి తనకు బదులుగా మైత్రేయ మహామునిని నిర్దేశించి నట్లు ఇందువలన వ్యక్తమగుచున్నది.

* ఈశ్వరునుండియే బహువిధములుగా దేవతలు, సాధ్యులు, మనుష్యులు అందఱును ఉద్భవించిరి. భూలోకము మొదలు ఏడులోకములును ఒకదానితో నొకటి పెనవేయబడివున్నది అనియు, ఈ లోకములన్నియు "ఓం తంత్రోతం" అనియు, అందువలన లోకముల సూక్ష్మతగాని స్థూల్యముగాని ప్రకృతియొక్క పరిణామము వల్లనే నిర్ధారింపబడుచున్నదనియు, మనము భూలోకమునందు నిలిచి యుండు స్థలమునందే భూలోకము మొదలు సత్యలోకము వఱకును గల సకల లోకములయొక్క అనుభవమును అనుభవించవచ్చును అనియు, ఒకలోకము విడిచి మరియొక లోకమునకు పోవలెనంటే స్థలము విడిచి స్థలమునకు పోవలసిన అవశ్యము లేదనియు 'ఆత్మవిచారము' నందు జైగీషవ్య ఉపాఖ్యాన సందర్భమున చెప్పబడి యున్నది

* త్రిమూర్తులైన శంభువు, విష్ణువు, బ్రహ్మ అనువారు 'దేవతలు' అను తరగతికి మించినవారు .. దేవతలకు శరీరములున్నవి.... పైన చెప్పిన ఏడులోకముల యందును దేవతలు వసించుచుందురు. ఆయాలోకమునందు వసియించు దేవత



లకు ఆయాలోకముయొక్క ప్రకృతి తత్త్వములో శరీరములు ఏర్పడియుండును. ఆ ప్రకృతి తత్త్వము మన స్థూలశరీరముల ప్రకృతి తత్త్వముకంటె సూక్ష్మ స్థయందు ఉండును. కనుక మన స్థూల దృష్టికి కానరాదు.

* దేవతలకు వారి వారి ఉద్యోగములను అనుసరించి పేర్లుగలవు. అనగా మనుష్యులలో జాతులు ఉండునట్లు వారలలో కూడ జాతులు కలవు. ఆదిత్యులు, వసువులు, రుద్రులు, ప్రజాపతులు జనలోకము, తపోలోకము అను ఉత్తమలోకములయందుండువారు. వీరలకు పైన లోకపాలకులు గలరు. అశ్వినులు, మరుత్తులు గంధర్వయక్షసురసిద్ధ సంఘములు, భూతప్రేత పిశాచములు, కిన్నర, విద్యాధరులు, సిద్ధులు, చారణులు, ఉత్కలులు, పైకలలు, అప్సరసలు, ఉరగులు, మొదలగు జాతులు కలవు. వీరందరును దేవతలు దేవయోనులు అను రెండు జాతులకు చెందినవారు

దేవయోనులు అను జాతికి చేరిన దేవతలు ఎనిమిది విధములుగా నున్నారు. 1) యక్షులు; 2) రాక్షసులు; 3) గంధర్వులు; 4) కిన్నరులు; 5) అప్సరసలు; 6) పిశాచములు; 7) గుహ్యకులు; 8) విద్యాధరులు అని 8 విధములు.

దేవయోనులు అను దేవతలకు పై తరగతి వారు ఆదిత్యులు, రుద్రులు వసువులు, సిద్ధులు, ప్రజాపతులు మొదలగువారు. వీరలు సృష్టి స్థితిలయములు అను కార్యములను చేయుచుండు వ్యూహములు. ఈ దేవతల కంటె ఉన్నతమైన లోకపాలురు, లిపికులు మొదలగువారు ఉన్నారు.

* ముప్పది మూడుకోట్ల దేవతలు ఉన్నారని విందుము. ఈ సంఖ్య చాల తక్కువైవున్నది బృహదారణ్యకోపనిషత్తునందు యాజ్ఞవల్క్యుల వారికిని శాకల్యులకును దేవతలను గురించి వాదము జరిగినట్లు చెప్పియున్నది. అందులో ముప్పది ముగ్గురు దేవతలు ఉన్నారనియు, వారలు అష్టవసువులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, ఇంద్రుడు, ప్రజాపతి కలిసి ముప్పది ముగ్గురు అని చెప్పబడియున్నది.

* పురాణములయందు పంచభూతములగు 1) ఆకాశము; 2) వాయువు; 3) అగ్ని; 4) అప్పు; 5) పృథివి అను తత్త్వములకు వరుసను 1) ఇంద్రుడు; 2) వాయుదేవుడు; 3) అగ్ని; 4) వరుణుడు; 5) కుబేరుడు అధిపతులు అని చెప్పబడియున్నది.

* సత్యలోకవాసి భూలోకమునందు ఇతరులకు తెలియునట్లు భూలోకవాసులతో కలిసిమెలిసి పనిచేయవలసి వచ్చిన యెడల భూలోక ప్రకృతితో మన శరీరముల వలెనే శరీరమును నిర్మించుకొని ఆ కార్యము ముగిసిన పిదప ఆ శరీరమును తునకలుగ చేయును.

ఈ ప్రకారముగా ఏయేలోకవాసి దేవత సాధారణ ఉపయోగమునకు ఆయా లోక ప్రకృతితో కట్టబడిన శరీరమును ఉపయోగించినను ఇతర లోకములయందు ఆ లోకవాసులతో కలిసిమెలిసి పనిచేయవలసి వచ్చినప్పుడు ఆయాలోకపు ప్రకృతితో చేసిన శరీరము ఒకటిని ఆ సమయమునకు సిద్ధపరచుకొని కార్యము ముగియగానే ఆ శరీరమును త్యజించును.

* మానవ శరీరమును దేవతలు నిర్మించుచుండగా, పూర్వ ప్రళయమునందు శరీరములు పోగొట్టుకుని సత్యలోకమునకు పైలోకమునందు నివసించుచు మానవ దేహము యొక్క నిర్మాణమును ఎదురు చూచుచు జీవాత్మలు కాచియుందురు. సిద్ధమైన మానవ శరీరములయందు జీవాత్మలను ప్రవేశపెట్టునట్టి దేవతల సంఘము ఒకటి కలదు. శరీరముల యందు ప్రవేశించిన పిమ్మట జీవాత్మను అనుసరించి వాని ప్రారబ్ధ కర్మను జవదాటక నడిపించుటకుగా ఒక్కొక్క మనుష్యునికి ఒక్కొక్క దేవత ఉన్నాడని 'ఆత్మ విచారము' నందు చెప్పబడినది.

కర్మ యొక్క రికార్డు అంతయు చూచి పరిశీలించి ఒక్కొక్క జీవాత్మకును జన్మకాలము నందు ప్రారబ్ధ కర్మను పంచి యిచ్చు దేవతల సంఘము ఒకటి.

ఇవన్నియు ఇంద్రుని ఆధిపత్యము క్రింద నుండు దేవతల సంఘము. ఇవిగాక అనేక దేవ సంఘములు ఇంద్రుని క్రింద ఉన్నవి. ప్రవృత్తి మార్గమునందు మనుష్యులు చరించుచుండగా వారల వృద్ధికి కావలసిన సదుపాయములను సంపాదించి వారి యెదుటపెట్టు దేవతలు కొన్ని సంఘములు. ఇష్టాపూర్తము మొదలగు నిత్య నైమిత్తిక కర్మలను చేయువారు మరణము చెందినపుడు వారలను ధూమాది మార్గమునందో, అర్చిరాది మార్గమునందో తీసికొనివెళ్ళి వారి కర్మలయొక్క ఫలమును వారలకు అందింపజేయు 'అతి వాహకులు' అను దేవతల సంఘములు కొన్ని. స్వర్గలోకమునందు సుఖముల ననుభవించు వారి కాలమును గమనించి కాచియుండి ఆ కాలము ముగియగనే వారలను స్వర్గలోకమునుండి మనుష్య లోకమునకు కొనివచ్చువారు కొందరు



స్వర్గలోకము నందలి సుఖానుభవము ముగియగనే ఏ దేశమునందు ఏ తల్లి గర్భమునందు ప్రవేశింపవలయునో ఆ యేర్పాట్లు చేయు దేవతల సంఘములు వేరు.

మనువు యొక్క ఉద్దేశ ప్రకారము ఏ దేశము నందు వర్షములధికముగా కురిసి ప్రవాహములతో ఏయే దేశముల భాగములు సముద్రముల పాలు కావలెనో భూకంపములు మొదలగు వాటివలన ఏ దేశము నశించవలెనో ఆ పనిని జరుపు దేవతలు కొందరు, ఇట్టి విపత్తి సమయమునందు జనులు పశువులు మొదలగు వానియొక్క సంఘాత మరణము జరుగుచుండగా ఎవ్వని కర్మ ఎంత మాత్రము సంబంధ పడినదో ఆ ప్రకారము భూకంపములు ప్రవాహములు మొదలగునవి జరుగుచున్న స్థలములకు ఆ సంఘాత మరణములయందు చేరకూడదని కర్మయందు ఉద్దేశింపబడిన వారిని అచ్చటికి పోనీయక ప్రత్యవాయములను కలుగజేసి వారి ప్రయాణములను నిలుపు దేవతలు కొందరు

ఏ జనాంగమునకు ఏ మనుష్యకోటికి ఏ ఒక వ్యక్తివల్ల ఏ విధముగా మేలు కలుగనో ఆ వ్యక్తిని ఆ జనాంగమునకు చేర్చి ఆ విధముగా ఫలము అందజేయునట్లు జరిపించు దేవతల సంఘములు కొన్ని.

భగవత్సంకల్పము సృష్టి స్థితి లయముల విషయమై ఏ విధముగా నున్నదని తెలుసుకొని ఆ సంకల్పమును అణుమాత్రమైనను వదలకయు, మారకయు జరుపుటకు కావలసినన్ని యుక్తులను పన్ని ఆ సంకల్పమును పూర్తి చేయుట దేవతల కార్యము. ఇది సంగ్రహముగా చెప్పుట ఇదే భగవదిచ్ఛ!

* భగవత్సంకల్పము ఒక విధముగా నున్నను ఆ విధమును మార్చుట మనుష్యులకు కొంతమట్టుకు సాధ్యము. మనుష్యులు అనగా జీవాత్మలు. పరమాత్మ యొక్క అంశలు అయినందున పరమాత్మ యొక్క శక్తి జీవాత్మయందు కూడ ప్రతిఫలించి యున్నందున భగవత్సంకల్పము యిట్టిది అని తెలియకనే తమ శక్తితో మనుష్యులు క్షణమాత్రము యీ భగవత్సంకల్పమునకు విరోధముగా తమ యిష్టప్రకారము కార్యమును సాధించుకొన వచ్చును. అట్టి సమయమునందు భగవత్సంకల్పమును నడిపించుటకుగా నియమింపబడి యుండు దేవతలు మనుష్యుల కార్యములలో ప్రవేశించి వారు భగవత్సంకల్పమునందు కలుగజేసిన మార్పును సరిదిద్దురు.

* ఒక దేహము శిథిలమై మరణము చెందునపుడు దేవతయే శరీరము యొక్క పటుత్వమును పోగొట్టునది. ఒక శిశువు పుట్టినపుడు ఎందరు దేవతలు ఆ చిన్న శరీరమును గర్భకోశమునందు అణువెంబడి అణువుగా చేర్చి శరీరముగా చేసి యుందురో యోచింపవలయును. కండ్లు చెవులు ముక్కు మొదలగు ఇంద్రియ గోళములను ఆయా యింద్రియముల యొక్క అధిష్ఠాన దేవతలు కట్టుదురు.

అనాథలుగా నుండువారిని ధర్మాత్ముని సాన్నిధ్యానికి నడిపించి వారికి ద్రవ్యము, వస్త్రము, అన్నము వీటిని యిప్పించు దేవతలు ఎందరు ఉందురో యోచించవలయును.

* ధనకాంక్షను జయించినాను అనుకొని కొంతమట్టుకు సంతోషించుచుండు ఉపాసకునికి పర ధనము చేయాడు వ్యవహారములలో భాగము నిత్తురు. ఉపాసకుడు నిజముగా కొంతమట్టుకు ధన పిశాచమును గెలిచిన వాడే. అట్టివాడు కొన్ని దినములు, కొన్ని సంవత్సరములు పర ధనమును ఆశించకయే ఆర్జవముతో వ్యవహారములు జరుపవచ్చును. ధనముతో సహవాసము చేయుచుండగా లోకులు అద్దిర! వీడే ధనమును ఆశించక వ్యవహారమును జరుపువాడు అని విస్మయమందుచుందురు. ఉపాసకుడు తాను యితరుల కంటె నేను యోగ్యుడను, ధనము అనగా నాకేమియు రుచియే లేదు, ఆశ అను పిశాచమును అవమానము చేసినవాడను, ధనాశ యితరులను మోసపుచ్చినట్లు నన్ను మోసపుచ్చుట అసాధ్యము అని స్వప్రాశస్త్యమును తన మనస్సులో అంగీకరించుకొనుచుండును అపుడును పరీక్ష చేయు దేవతలు ప్రచ్ఛన్న వృత్తి యందే కాచియుండును ఉపాసకుడు తన కార్యముల యొక్క సమీచీనతను పొగడుకొనుచు పరధనమునుండి మొదట ధర్మకార్యములకు చందాలు యిచ్చి యిది పరధనము కదా స్వంతదారుని యొక్క అనుమతి లేక ఆ ధనమును నా యిష్టము వచ్చిన కార్యమునకు ఉపయోగించితిని ఇది ఒక విధమైన దొంగతనమే. అయినను నేను స్వప్రయోజనార్థము ధనమును ఉపయోగించలేదు కదా! అని ఒక విధమైన సమాధానము కలుగజేసికొని వ్యవహారము మామూలు ప్రకారము జరుపుచుండును. కొంతకాలమునకు మనస్సు గట్టిపడి యజమానుని ద్రవ్యమును తాను యిష్టమొచ్చినట్లు సెలవు చేయుట వాడుక పడిపోవును. ఇదంతయు పరీక్ష చేయు దేవత గమనించి ఉపాసకుని ఖాతాలో అప్పుల లెక్కను వ్రాయుచుండును. ఇందుకు పెద్ద ఉదాహరణము రామదాసుగారి చరిత్రము. తాను చేసిన కార్యము తప్పు గనుక రామదాసు తగిన దండన అనుభవించవలసి వచ్చెను.



* నివృత్తి మార్గమును చరించు వానిని ఎందుకు యింతగా పరీక్షించవలెను అని సందేహము కలుగును. నివృత్తి మార్గమున చరించువాడు క్రమక్రమముగా మెట్టు మెట్టుగా పైకెక్కి జీవన్ముక్తుడు కాగలవాడు. మరియు ముదరను ముదరను అధికారిక పురుషుడు కాగలవాడు. ముందు మన్వంతరములో మనువో ఇంద్రుడో ఇట్టి అధికారములను పొందుటకు అర్హుడు కాగలవాడు. కనుక నివృత్తి మార్గమునందు మొదటి మెట్టునుండి పరిశుద్ధ గుణములతో స్వచ్ఛమైన స్వభావముతో పెరిగితేనే బాగు.

* దేవతల కార్యమును క్రోడీకరించి చెప్పుట కొంత సౌకర్యము.

దేవతలు అమృతపానము చేసి దేవలోకమందు సోమరులుగా నుండువారు కారు.

అణువులను సృష్టించి, వానిని అపంచీకృత స్థితినుండి పంచీకృత స్థితికి తెచ్చు ఉద్యోగమును వహించిన బ్రహ్మదేవునికి సేవ చేయువారు.

పంచీకృత అణువులను కలిపి రూపములుగా చేయు కార్యక్రమమును వహించిన విష్ణువునకు సహాయముగా పనిచేయు సేవక సంఘము, విష్ణువు కట్టిన శరీరములలో జీవాత్మలను ప్రవేశపెట్టు అధికారమును వహించిన శివునికి తోడ్పడువారు.

మహేశ్వరుని సంకల్ప ప్రకారము లోకమును జవదాటక ఋజుమార్గమునందు నడుపువారు, మొదలగునవి.

* పురూరవుడు సొగసుగాడు
నహుషుడు గర్వి.
భరతుడు మహనీయుడు.
ఋషభుడు అద్భుత చరిత్ర గలవాడు
కార్తవీర్యార్జునుడు వీరుడు, శూరుడు.
విశ్వామిత్రుడు పట్టినపట్టు వదలనివాడు.
వశిష్టుడు బుద్ధిమంతుడు.
పరశురాముడు దండనీతి ప్రవీణుడు.
మాంధాత బహు బలశాలి.
శిబి భూతానుకంప గలవాడు.
దధీచి ఆత్మనివేదనము చేయువాడు.

దుర్యోధనుడు ఆగ్రహ ప్రకృతి
హరిశ్చంద్రుడు సత్యసంధుడు.
నృగుడు ఉదారి.
హిరణ్యాక్షుడు భీకరమూర్తి.
హిరణ్యకశిపుడు కాఠిన్య స్వభావము కలవాడు.
బలి ఔదార్యము కలవాడు.
శంబరుడు మాయావి.
రావణుడు ప్రాణులను పీడించువాడు.
శ్రీరామచంద్రుడు పరిపూర్ణుడు.
నలమహరాజు సొగసుగాడు.
యుధిష్ఠిరుడు ధర్మాత్మ

పైన వివరించిన అందరియందు గల అన్నిసుగుణములు ఒక్కనియందు యిమిడి వుండవలయును.

* దేహమునందు మూడున్నరకోట్లు నాడులు ఉన్నవి. వాని అన్నిటిలో పది నాడులు ముఖ్యమైనవి. అందులోను మూడు నాడులు శ్రేష్ఠములు. అవి మూడును పేరుపై మేరు దండము అని యోగశాస్త్రము నందు వాడబడు వెన్నెముకలో చంద్ర సూర్యాగ్నిరూపముతో ప్రవహించుచుండును. చంద్రరూపిణియై 'ఇడా' అను నాడి వెన్నెముకకు ఎడమ పార్శ్వము నందు చరించును. ఇది శక్తిరూపమైన నాడి. అనగ స్త్రీ రూపము గలది. వెన్నెముకకు కుడిప్రక్కన 'పింగళ'యను నాడి సూర్య రూపముతో ప్రవహించుచుండును. ఈ రెండిటికిని నడుమ 'సుషుమ్నా నాడి' అగ్ని రూపము విచిత్రము అను దారి యందు ఇచ్ఛా జ్ఞాన క్రియాత్మకముగా ప్రవహించును.

* శక్తి యనునది సాత్త్విక గుణాధిక స్థితి యందు మహాలక్ష్మి యను పేర విష్ణువు యొక్క స్త్రీ.

రాజస ప్రధానమై సరస్వతీ నామధేయముతో బ్రహ్మకు పత్ని.

తామస గుణ ప్రధానమైన మహాకాళి యను పేర శివునికి యిల్లాలు.

* మొదట ఒకానొక వస్తువు కలదు అను జ్ఞానము, పిమ్మట ఆ వస్తువును పొందవలెను అను అభిలాష పుట్టును అభిలాష ముదిరి అభినంది పుట్టును. అభినంది అనగా ఉద్దేశపూరిత ప్రయత్నము. పిమ్మట కార్యము, పిమ్మట ఫలము.



* మనస్సు అంతరింద్రియము అనబడును. మనస్సు యొక్క సహాయము లేనిదే ఇంద్రియములు ఏమి పని చేసినను ఆత్మను అంటదు.

దేహమును రథముగా పోల్చి రథమునకు అధికారి ఆత్మ అని పోల్చినపుడు రథమునకు సారథిగా బుద్ధిని చెప్పి సారథి చేత పగ్గములు మనస్సు అని చెప్పిరి ఇంద్రియములు గుఱ్ఱములుగా పోల్చబడినవి. ఈ అభిప్రాయము నందు ఇంద్రియములకును సారధికిని సంబంధము మనస్సు అని తెలియవచ్చుచున్నది. గనుక మనస్సును అంతరింద్రియము అందురు.

* వృక్షము యొక్క బీజము నందు చెట్టంతయు నిమిడియుండు రీతిగా బ్రహ్మము నందు సకలశక్తులును ఇమిడి యుండును. ఎపుడు ఏ శక్తిని ఉపయోగించవలయునని ఈశ్వరుడు కోరునో అపుడు ఆ శక్తిని ఉపయోగించును.

* శ్రీరామా! నీవు రాగము, ద్వేషము, సుఖము, దుఃఖము మొదలగు మలిన వాసనలను నివర్తింపజేయుట యందు విశేషముగా ప్రయత్నము చేసిన యెడల నీ మనస్సునందుండు తాపములన్నియు క్షణకాలములోనే నశించిపోవును, అని వశిష్ఠ మహాముని చెప్పెను.

* వివేక జ్ఞానము గల పురుషుడు వివేకమును ఉపయోగించి కార్యములు చేయుచున్నప్పటికిని ఇంద్రియములు చాల బలము కలవి. గనుక ప్రమాదమును కలుగజేసి మనస్సును తమ తమ త్రోవలకు లాగికొనిపోవును. ఇంద్రియములు విషయములయందు చరించుచుండగా మనస్సు ఇంద్రియముల వెంబడి విషయములలో ప్రవేశించును. ఈ విధముగా విషయములయందు చరించుస్వభావముగల మనస్సు ఇంద్రియముల వెంబడి పోవును సముద్రము నందు చరించు నావ వాయువుచే గొట్టబడినట్లు చెదిరి నశించును. కనుక యోగమును అభ్యసించుటకు ప్రయత్నము చేయువాడు తన యొక్క జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను అన్నిటిని నిరోధించి విషయముల వెంబడి పరుగెత్తనీక నిర్బంధ పెట్టి భగవంతుని యందు నిలకడ చెందునట్లు చేయవలెను.

* ప్రతీ వ్యక్తికిని అనగా ప్రతీ మనుష్యునకును ఆకర్షము అనియు వికర్షము అనియు రెండు శక్తులు గలవు. ఆకర్షము అనగా ఇతరులను తన తట్టుకు లాగుట. వికర్షము అనగా తన తట్టుగా నుండు వానిని దూరముగా తోలుట-తరుమ కొట్టుట.

ఇంతే కాదు- ఈ సృష్టియందు ప్రతీ వ్యక్తికిని 1) సమానులు; 2) అధికులు; 3) తగ్గిన వారును కలరు.

ఆకర్షము అను శక్తిని 1) సమానుల యెడల చూపితే అది స్నేహముగా నగును. దీనినే 'మైత్రి' అందురు. మిత్రుని యొక్క లక్షణములను ఒక గ్రంథము నందు ఈ విధముగా వర్ణించి యున్నది.

స్నేహితుడు విందులు పెట్టును, పెట్టినపుడు అనుభవించును. ఇచ్చును, పుచ్చుకొనును. తన రహస్యములను చెప్పును, స్నేహితుని రహస్యమును వినును. ఇట్టి ఆరు గుణములు గలది మైత్రి. ఈ కార్యములయందు ఆకర్షణశక్తి సమానుల యందు కనబడుచున్నది, ఆకర్షణశక్తి 2) అధికుల యెడ చూపబడినపుడు మర్యాదయు, భక్తియు నగును. మర్యాదయు, భక్తియు ముదరగా ఆత్మ నివేదనముగా మారును. తనకంటె నధికుని యొద్దనుండి తాను అనుగ్రహము పొందవలయునని కూడ కోరును.

ఆకర్షణ శక్తి 3) మనకంటె తగ్గిన వారియందు చూపబడినపుడు 'దయ' అనబడును. సాధారణముగా మనయందు ఒకనికి దయ ఉన్నది అని తెలుసుకొనుటకు మొదటి చిహ్నము చిరునవ్వు. మనకంటె అధికుని సమీపమునకు పోవునపుడు అధికుడు మనలను చిరునవ్వు ముఖముతో పిలిచితే అతని వల్ల మనకు మేలు కలుగును అను సూచన కనబడును.

* పరమేశ్వరుని చేత నియమింపబడిన అధికారిక పురుషులు జనులను తరింపజేయు పర్యంతమును తమ అధికార పదవిలోనే యుందురు. వారికి జన సామాన్యమువలె కర్మవేగముచే శరీర త్యాగము చేయుట, మరల శరీరధారణము చేయుట అను నిర్బంధములు లేవు. స్వతంత్రులై ఒక గృహమునుండి మరియొక గృహమును ప్రవేశించువారివలె యోగశక్తిని ఉపయోగించి ఇప్పుడు ఉన్న శరీరము చాలినంత ఉపయోగకారిగా కాని యెడల క్రొత్త శరీరమును నిర్మించుకొని ఆ శరీరము నందు నివసించి తాము ఒప్పుకున్న 'అజ్ఞాన శాంతి' అను ఉద్యోగమును చేయుచుందురు. తమ కార్యమునకు ఒక శరీరము చాలకపోతే పది యూళ్ళలో పది శరీరములు కల్పించుకొని అనగా నిర్మాణము చేసుకొని అట్టి అనేక శరీరములతో ఏక కాలమునందే పని చేయుదురు. ఇట్లు నిర్మించుకోబడిన శరీరమునకు 'నిర్మాణ కాయము' అనియు శరీరవాసులకు 'నిర్మాణ కాయులు' అనియు పేర్లు గలవు.



* బదరికాశ్రమము, నైమిశారణ్యము, ఇట్టి ఆశ్రమములయందు మహర్షులు గుంపులు గుంపులుగా ఉన్నారని పురాణములయందు వినుచున్నాము. ఈ ఆశ్రమములు హిమవత్పర్వతమునకు దక్షిణమున నుండునవి హిమవత్పర్వతమునకు ఉత్తరమునందు కలాపగ్రామము, శంబళము అను స్థలములు, ఋషులకు ప్రసిద్ధ నివాస స్థలములు అని శ్రీమద్భాగవతము మొదలగు పురాణములయందు చెప్పబడి యున్నది.

* మహీ పీఠమునకు అధ్యక్షులు శ్రీ సనత్కుమారులు. అందరు జీవన్ముక్తులను వారికి లోబడినవారే. సనత్కుమారులవారు శంబళ గ్రామమునందు ఆశ్రమము కల్పించుకొని యున్నారు. మనువు, బోధిసత్త్వులు, గౌతమ మహర్షి, దేవాపి మహర్షి, మోర్యారాజర్షి మొదలగు మహనీయులందరును శ్రీ సనత్కుమారుల వారి ఆజ్ఞకు (అభీష్టములకు) లోబడి నడచుకొనువారు.

* లోకమునందు ప్రబలియున్న అజ్ఞానమును క్షీణింపజేయుటకు మహీ పీఠము వారు ప్రయత్నము చేయుటకు సమయమును నిరీక్షించుచుందురు. అనేక విధముల అనేక స్థలములయందు అనేక సమాజములను వివిధములైన సంస్కార సంఘములను మనుష్యులు ఏర్పరచుకొనునట్లు ప్రేరేపించుట వారల కార్యము.

* మన స్థూల శరీరములయందు, పాదాంగుళ్యగ్రములు, హస్తాంగుళ్యగ్రములు. పెదవులు, నాసారంధ్రములు, నాలుక కొన, దేహమాద్యంతము గల రోమ కూపములు ఇట్టివి 'ఏతాని విద్యుత్ స్థానాని' విద్యుత్తుకు ఉనికి పట్టులు. విద్యుత్తు అనగా మెరుముల యందు కనబడు శక్తి. దీనినే యంత్రముల వల్ల నిర్బంధించి ఇప్పుడు ఎలక్ట్రిక్కు దీపములు మొదలగు శక్తులను లోకులు ఉపయోగించుచున్నారు. 'శ్రీ గురుదేవుల వారి దీవెనలు' అను విద్యుచ్ఛక్తి మన (శిష్యుని యొక్క దేహమునందు ప్రవేశించి వెలుపలకు వెళ్ళవలసివచ్చినపుడు మన(శిష్యుని) యొక్క శరీరములయందలి విద్యుత్ స్థానముల యందు ఏమాత్రమైనను మాలిన్యము ఉండకూడదు. కనుక శిష్యులు తమ శరీరముల యందలి విద్యుత్ స్థానములను అతి పరిశుద్ధముగా నుంచుకొనవలయును. అనగా చేతివేళ్ళ సందులయందును, గోళ్ళ యందును, కాలివేళ్ళ సందుల యందును, గోళ్ళయందును, దేహము అంతటను నిండియుండు రోమ కూపములయందును ఏమాత్రమైనను మురికి దాగియుండక స్నాన కాలమందు అతి జాగరూకతతో దేహమును శుద్ధి చేసుకొనవలయును.

* 'అయోధ్యా మధురా మాయా కాశీ కాంచీ అవంతికా' అను స్థలముల

యందునుండి విద్యుచ్ఛక్తి బయలు వెడలి భరత ఖండము సందంతటయు నిండి యుండును. ఈ శక్తిని యంత్రముతో నిర్ధారణ చేయుట సాధ్యముకాదు. అనేక దేవాలయముల యందు తగిన కాలముల యందు పూజలు జరిగి ఆ పూజలను చూచుటకుగా జనబాహుళ్యము అట్టి దేవ స్థలములకు వెళ్ళుదురు. అట్లు దేవ స్థలము లకు వెళ్ళు వారలు తమ భక్తిని అప్పట కుమ్మరించి అప్పటి దీవెనలను తెచ్చు కొందురు. అంగీకృత శిష్యులు అట్టి స్థలములను దర్శించి ఇతరులకన్న నధికమైనంత దీవెనలను తనలోనికి చొప్పించుకొని లోకులపై వర్షించవచ్చును. ఇది ఒక విధమైన సేవ.

* ప్రవృత్తి, నివృత్తి మార్గములు రెండు. ఇవి ఒక మెట్టు కర్మ మార్గము, జ్ఞాన మార్గము అనునది ఒక మెట్టు. ఇట్లు సందర్భమును అనుసరించి రెండు రెండుగా మార్గములు చెప్పబడియున్నవి. మరియొక జత మార్గములు ఉన్నవి. అవి ఏవి అనగా మోక్షమార్గము అనునది యొకటి. మోక్ష సన్యాసమార్గము అనునది ఒకటి.

కడపట చెప్పబడిన జతయందు సాధారణముగా జనబాహుళ్యము లోకము సంధు తమ తమ మతములయందు విధింపబడిన శ్రద్ధాభక్తి ధ్యానములను అనుష్ఠించుచు ప్రవృత్తి మార్గమునందు అనేక జన్మములను గడిపి ప్రవృత్తి మార్గమును దాటి నివృత్తి మార్గమును అవలంబించి మంద మధ్యమ వైరాగ్యములను అభ్యసించుచు మోక్షేచ్ఛ స్వల్పముగా పొంది కాల క్రమమున ముముక్షత్వమును వృద్ధి చేసు కొనును.

* ముముక్షత్వము నాలుగు తరగతులుగా నుండును. 1) ముముక్షత్వము అనునది యేదో యొక ద్రవ్యము అని మూఢులు తలచి అట్టి వస్తువు ప్రయాణికునికి మార్గమునందు ఒక రత్నము దొరికినట్లు ముముక్ష నాకు దొరక జాలగా అని కోరుకుండుట అతి మంద ముముక్ష్వము అనబడును.

2) ఇప్పుడేమి అవసరము భోగములనన్నింటిని అనుభవించి పిదప మోక్షమునకు ప్రయత్నము చేయవచ్చును అని యుండుటకు మంద ముముక్షత్వము అని పేరు.

3) తాపత్రయము చేత తీవ్ర శ్రమనొంది భార్యాదులగు సంసారమును వదులుకొనవలెనని కోరినను సంసారమును వదులుకొనుటకు నిశ్చయము చాలక ఒకపుడు సంసారమును వదలుకొనవలెనని ఇచ్ఛయించుచు, మరియొకపుడు వేరు



విధములుగ చింతించుచు నిశ్చయము లేక నడచుకొనుచుండుట మధ్యమ ముముక్షత్వము అనబడును.

4) తాపత్రయము యొక్క అనేక రూపములగు దుఃఖములచే నిత్యమును శ్రమపడుచు మనస్సు నొచ్చి, సంసారమందు అనర్ధమేకాని వేరుకాదు అని నిశ్చయించి, అన్నిటిని సంసారముతో సహా వదులుకొనుటకు నిశ్చయించుకొనుట తీవ్ర తరమైన ముముక్షత్వము అనబడును.

మంత్రములను గురించి వ్రాయునపుడు మంత్ర జపము, దానికి కావలసిన అంతర్యాగము, బహిర్యాగము, షోడాన్యసము, ప్రయోగము, ముద్ర, యంత్రము, ప్రయోజనము అను అనేక విషయములను గురించి వ్రాయవలసి యుండును. ఇప్పుడు సంగ్రహముగా కొంత చెప్పబడుచున్నది.

మంత్రము శబ్దాత్మకము. శబ్దము అనగా చప్పుడు, ధ్వని యని యర్ధము. ధ్వని స్వరరూపముగా నుండును. ధ్వనిని స్వరమున అక్షేపించి స్పందములు ఏర్ప డును. ధ్వని వలన కలుగు స్పందము ఉచ్చరించువారియొక్క ఉద్దేశమును సాత్త్విక గుణమును అనుసరించి వీర్య వంతములుగా నుండును. ఏకాక్షర మంత్రములు కొన్ని, బీజాక్షరములు కొన్ని అవియును ఏకాక్షరములే. యంత్రములతో కలిసి ఉచ్చరింపబడు మంత్రములును, ముద్రలతో కలిసి ప్రయోగింపబడు మంత్రములును బహుబలము కలవి. మనుష్యులను బీజాక్షరోచ్చారణ వలన కాపాడవచ్చును.

ఏకాక్షర మంత్రములలో సంయుక్తాక్షరములతో నేర్పడిన మంత్రములు కొన్ని. మంత్రములలో కొన్నిటికిని మరికొన్నిటికిని మిత్రారి భావములు కలవు. ఆ రహస్యములు అందరకూ తెలియవు. తెలియక ఉపయోగించినపుడు ఒకప్పుడు ఉపద్రవము కలుగును. లేక ప్రయోజనము కలుగదు. కొందరికిని కొన్ని మంత్రము లకును స్నేహము ఉండును. కొన్ని మంత్రములు కొందరికి శత్రుభావము కల విగా నుండును. మంత్రములు ఉపదేశించువారు పుచ్చుకొనువానికి మంత్రమునకును సిద్ధారి చక్రము అను చక్రమును వ్రాసి పరీక్షించి సిద్ధముగా నుండినపుడే ఉపదేశింప వలయును.

తెలిసిన వారి సహాయము కోరకయే స్వయముగా అచ్చు పుస్తకములనుండి చదివి మంత్ర గ్రహణము చేయువారు తమకు లాభము సంభవించితే సంతోషమే. దుఃఖము సంభవించినపుడు ఎవరిని దూషించవలయును? హాని జరిగితే అది తమ యొక్క తప్పే అని తెలిసికొన వలయును.

* మంత్రములు 'ఋషిఛంద్యఋషి దైవత ఛందాసి' అను విధానములు గలవి. అన్ని మంత్రములకును వినియోగము కలదు దీనినే ఉద్దేశము అందురు. ప్రణవము అను సంయుక్తాక్షర రూపమైనది. యొకటి ఏకాక్షర మంత్రము కలదు. ఈ మంత్రమును సృష్టికర్త సృష్ట్యాదయందు ఉపయోగించినట్లు శాస్త్రములయందు చెప్పబడియున్నది. లయకర్త లయ ప్రారంభము నందును ఉచ్చరించుననియు స్థితి కర్త స్థితి కాలమునందును ఉపయోగించును అని తెలియుచున్నది. ఒకటే ఏకాక్షర మంత్రమును ముగ్గురు మూడు పరస్పర విరోధములయిన కార్యములలో నుపయోగించినట్లైతే ఆ మంత్రము యొక్క ఉచ్చారణ యందుగాని ఉద్దేశమునందుగాని ప్రయోగమునందుగాని లేక యంత్రము నందుగాని భేదముండవలయును. కనుక మంత్రము ఒకటే యైనను పరిస్థితులు మారినపుడు ఫలము మారునని తెలిసికొనవలయును.

* మంత్రమును ఉపయోగించినను మనశ్శక్తిని మంత్రముతో జతపరచని యెడల శక్తి చాలనందున ప్రయోజనము తక్కువగా నుండును. మనశ్శక్తిని ప్రబలముగా నుపయోగించు శక్తిగల వానికి మంత్రములు అవశ్యములుగావు. మనశ్శక్తితో చేయజాలిన కార్యమునకు మంత్రము సహాయకారిగా నుండును. ప్రబలమైన మనశ్శక్తిని ఉదారముగా సెలవు చేయుటకు బదులుగా కొంత మనశ్శక్తి, కొంత మంత్రమును కలుపుకొనుట వల్ల మనశ్శక్తి అను ద్రవ్యమును మిగుల్చుకొనవచ్చును.

* శీలము పరిశుద్ధముగా లేనివాడు ప్రణమను ఉచ్చరించవలసిన రీతిగా నుచ్చరించని యెడల ఉచ్చరించు వానికి చెడుపు కలుగును. కనుక శీలము చాలా ముఖ్యము. వినువారలకు కూడ చెడుపు కలుగును.

* గాయత్రీ మంత్రము. "నగాయత్ర్యాః పరం మంత్రం" అని చెప్పబడి యున్నది. భరత ఖండమునందు అనేక వేల సంవత్సరములుగా గాయత్రీ మంత్రము ఉచ్చరించబడుచు వచ్చినది. అందువలన దేవతలకు ఆ మంత్రముచే తమను ఆహ్వానించుచున్నారు, అను సంగతి వాడుకబడియున్నది. దేశమునకు అంతయు గాయత్రీ పఠనము వల్ల శాంతికలుగును. ఈ మంత్రము ముఖ్యముగా 'నీలకంఠ సమూహ దేవతలను' గుమికూర్చి తెచ్చును.

ఈ మంత్రము సూర్యపరము నిజమే. జ్ఞాన దృష్టితో చూచువారికి ఈ మంత్రము పఠనము వలన కలుగు ప్రయోజనము కనబడునట.



సూర్యుని నుండి ఒక తేజస్సు శుక్ల వర్ణము గలిగిన హేమవర్ణము గల దై జపము చేయువారిని ఆవరించునట. శుక్ల వర్ణముతో హేమవర్ణము కలిపి ఆ రెంటితో ఇంద్రనీల వర్ణము కూడ కలిసి కనబడునట. (ఈ అర్థము ధ్యాన శ్లోకమందున్నది.)

గాయత్రీ తేజస్సు యొక్క కిరణములు సూర్యుని కిరణముల వలెనే లెక్కలేనన్నివిగా నుండునట. అందువల్ల లెక్కలేని జనులను ఆవరించగలదట.

* మనుష్యుల వలె మంత్రములు కూడ సూక్ష్మ, స సూక్ష్మ, సూక్ష్మాతి సూక్ష్మ, సూక్ష్మతర, త్రివృత్కరణ తరగతులకు చేరియుండును. ఇదే విధముగా ధారణా యోగము కూడ త్రివృత్కరణమునకు చేరియుండును. ఇందువల్లనే మంత్రములకును ధారణలకును సిద్ధారి తరగతులు ఏర్పడియుండును. సిద్ధారి తరగతులు అనగా పరస్పర స్నేహము, విరోధము. కొందరి స్వభావమునకు భ్రూమధ్య భాగమున ధారణ అనుకూలము. కొందరికి హృత్పుండరీక ధారణ మంచిది. ఈ రహస్యములను తెలిసిన గురువులవారే మనకు కావలయును.

గురువులయొక్క పాండిత్యమును జ్ఞానమును కూడ వైద్యులవలె భేదములు కలిగియుండును. కాబట్టి శిష్యుని తరింపజేయు ప్రతిగురువును ఇంతకుముందు శిష్యుడు ఏయే మంత్రములను ఉపదేశము పొందియుండునో, ఏయే ఉపాసనలు చేసి యుండునో ఆ వివరములను తెలిసికొని అట్టివానిని అంగీకరించుటయో, వర్జించుటయో చేయవలసి యుండును.

* * *

ఆంధ్రభూమి తెలుగు దినపత్రిక ఆదివారం సంచికలలో శ్రీ భాగవతుల వెంకట లక్ష్మీనారాయణగారు 'ధర్మశాస్త్రం' శీర్షికను నిర్వహించటం మన అదృష్టం. శాస్త్రబద్ధమైన అపూర్వమైన విషయాలను ఆయన లోకానికి అందజేస్తున్నారు. వీలయినంతవరకు అవన్నీ క్రోడీకరించటం జరిగింది—సంకలన కర్త.

## జప విధానములు

'జపతో నాస్తి పాతకమ్' అనగా జపము చేస్తే పాతకములు పోవును. అని చెప్పియుంటిరి గాన జపభేదములు, విధానములు తెలుపవలసినదిగా పాఠకులు కోరుతున్నందున అవకాశమున్నంత వరకు తెలుపుచుంటిమి.

జపము వాచకమనియు, ఉపాంశువనియు, మానసికమనియు మూడు విధములు. నోటితో బిగ్గరగా అందరికీ వినబడునట్లు చేయు జపము వాచికము.

మెల్లగా నుచ్చరించుచు పెదవులు కదిలించుచు చేయు జపము ఉపాంశువు.

మనస్సుతో మంత్రార్థమును భావన చేయుచు నిశ్శబ్దముగా చేయు జపము మానసికము.

పైదానిలో మానసిక జపము శుచిగానున్నను, లేకపోయినను, నడచుచు, నిలుచుండియు, నిద్రించు సమయమున కూడ అనగా సర్వకాల సర్వావస్థల యందును చేయవచ్చుననియు, దోషము లేదనియు తెలియుచున్నది.

వాచిక జపము కంటె ఉపాంశు జపము ఎక్కువ ఫలితములొసంగగ, మానసిక జపము అనేకరెట్లు ఫలమునిచ్చునని శాస్త్రవచనము.

వాచిక జపము వలన వాక్ శుద్ధి కలుగును. ఉపాంశు జపము వలన ఏకాగ్రత కలిగి ఇంద్రీయ వృత్తులుడిగి ఒక ప్రత్యేకత సాధనకు గోచరించును. మానసిక జపము వలన క్రమేపీ మనస్సు మంత్రమూర్తియందు లగ్నమై నిమీలిత నేత్ర స్థితిలో ఆనందానుభవమేర్పడును. ఇట్టి స్థితిలో శ్వాస అడుట తగ్గి సుషుమనాడి ఉత్తేజిత మవును. మానసిక జపము అనుభవమునకు వచ్చి అభ్యాసము దృఢపడిన కొలదీ జప సంఖ్య అవసరము లేకయే పోవును. మనస్సు మంత్రమూర్తియందు లగ్నమవుచున్న కొద్దీ అర్థాను సంధానము పోవుట ఒక్కొక్కచో జపమాగిపోయే స్థితికూడా వచ్చును. ఎంతసేపు జపమాగి పోయెనో తెలియని స్థితి కూడా కల్గును. అట్టి స్థితికి చేరుటయే జపసార్థకత.

జపము చేయుచుండగా నిద్ర వచ్చుట, నిద్రలో మంత్రమును, మంత్రార్థమును, చివరకు మంత్రమూర్తిని కూడా మరచుట, జపమాల జారిపోవుట — ఈ స్థితిని పొందితిమనే భ్రమను దాటియుట మొదలగు ఇబ్బందులు కూడ కలిగెడి అవకాశమున్నందున ఈ సున్నితమైన సందర్భమున సాధకులు జాగ్రత్త వహించవలెను.

జప సంఖ్య త్వర త్వరగా పూర్తి కావలెనని అతి తీవ్రముగా జపమాచరించిన జపస్థితికి బదులు నాడీమండలము మీద ఒత్తిడి యెక్కువై రక్తపోటు వ్యాధి జనించి శరీరారోగ్యం భంగపాటు చెందు ప్రమాదమున్నట్లు గోచరించును.

జపమాచరించువారు వారి వారి మానసిక శారీరక స్థితి గతులననుసరించి ఒక క్రమమైన వేగమున, పద్ధతిన జరుపుట శాస్త్ర సమ్మతము.



నిత్యం జపమాచరించువారు ఒక నియమమునకు తగ్గకుండ చేయవలెను. ఈ నిత్యజపము వలన ఏ రోజున చేసిన పాపము ఆ రోజుననే నశించును. పాపము చేయని వారికి భగవదనుగ్రహము త్వరగా లభించి చిత్తశాంతి చేకూరును. కారణాంతరములచే స్నానాదులాచరించ సాధ్యము కాకున్ననూ జపమాచరించుట మానరాదు. మంత్రస్నానము, మానసిక స్నానము మొదలగు ప్రక్రియలాచరించి జపము సాగించవలెను.

పర్వదినములందు (శ్రీరామనవమి, హనుమజ్జయంతి, నృసింహ జయంతి మొదలగునవి) ప్రత్యేకముగా జపించుట శ్రేయస్కరము.

కామ్యజప మాచరించువారు అనగా ఏవైనా కోరికలను మనస్సునందుంచి చేయువారు, జీతము నాశించి సేవ చేయు భృత్యునివలె భయభక్తులతో విధి నిషేధములతో, కట్టుబాటులతో నాచరించిన పద్ధ్యస్కాల ఫలితములు పొందగలరు.

నిష్కామముతో జపమాచరించు వారికి కట్టుబాట్లు తాత్కాలికముగా భంగపడినా ప్రమాదము లేదని పెద్దల ప్రవచనము.

ఆధ్యాత్మికశక్తి అభివృద్ధి గోరువారలు వైరాగ్యము వృద్ధిగావించుకొని 'అచల జప' మాచరించవలెను. ఇట్టి జపమాచరించువారికి ఆసన శుద్ధి (పద్మాసనము, సుఖాసనము, స్వస్తికాసనము మొదలగునవి) మిక్కిలి అవసరము.

జపాభ్యాసము ధృఢపడుటకు 'చలజపము' (అనగా తిరుగుచు, త్రాగుచు, నిలుచుని, కూర్చొని, భోగ సమయమున, విరామమందు మానసికముగా జపమాచరించుట) గొప్పగా సహకరించును. వాక్ శుద్ధిని కూడ కలుగజేయును.

గ్రహ బాధలకు లోనైన వారు యథాశాస్త్రీయముగా దైవ విగ్రహము, దేవాలయము, అశ్వత్థము. (రావి చెట్టు) సాధుమఠములకు మంత్రమును జపించుచు నియమిత సంఖ్యా ప్రదక్షిణములు గావించెదరు, దీనిని ప్రదక్షిణ జపమందురు. ఈ జపము వలన సమస్తగ్రహ బాధలు తొలగి మంత్ర సిద్ధి త్వరగా లభించును.

అజపా ప్రసక్తి ఉచ్ఛ్వాస నిశ్వాసములతో మౌనముగా మంత్రమునుడువుట భావన చేయుట అజపాజపమని తెలియనగును. ఈ జపమాచరించు వారికి క్రమేపీ శ్వాసలసంఖ్య తగ్గి విషయములందు విముఖత చేకూరి ఇంద్రియ జయము చేకూరును ఒకచో శరీర స్మృతి తాత్కాలికముగా కోల్పోవు అవకాశమున్నందున జాగరూకత వహించుట, దృఢ సంకల్పము అవసరము,

(తే 3-88ది ఆంధ్రభూమి) సౌజన్యంతో

జపమాల

జపమాల మంత్రానుష్ఠానపరులకు చాల ముఖ్యమైనది. అదిమనస్సు ఆరాధ్య దైవముపై నిలుపుటకు గొప్పగా సహకరించును. జపము చేయువారికి జపమాలగుప్త ధనము వంటిది. చేతిలోనికి జపమాల తీసికొనిన వెంటనే సాధకుని మనస్సు భగవంతుని యందు లగ్నమై నిర్మల స్థితి యేర్పడును మంత్రము దానికదే జ్ఞాపకమునకు వచ్చును. ఒకచో మనస్సు దారి తప్పి విషయ ప్రపంచ వాసనలలోనికి జారవచ్చు ప్రమాదమున్నది. అట్టి సమయమున జపమాల సాధకునికి సహకరించి మనస్సును మాధవునిపై పునకు త్రిప్పును. మనస్సు చంచలమైనది. దానిని ఒక క్రమపద్ధతిలో నడుపుటకు జపమాల అవసరము ఎంతైనా ఉన్నది. సాధకుడు నియమబద్ధుడై ఒక క్రమ పద్ధతిని ఒక సంఖ్యను కనీసముగా నిర్ణయించుకొని (108 లేక 1008 మొదలైనవి) జపమాచరించును. అట్టి సమయముల జపమాల జపసంఖ్యను సునాయాసంగా తెల్పి సాధకునికి మనోవ్యథ తొలగించును.

జపమాల మూడు విధములు :-

1) కరమాల — కరమాలను గురించి 'స్కాంద పురాణము'న వివరముగా చెప్పబడినది. చేతివేళ్ళ కణుపు మీద లెక్కించు విధానమును కరమాలయందురు. కరమాలతో జపమాచరించువారు అనామిక (ఉంగరపు వ్రేలు) మధ్య కణుపు వద్ద ప్రారంభించి, క్రిందకి వచ్చి అన్చాటినుండి చిటికెన వ్రేలి క్రింద కణుపుమీదుగా పైకి పోయి, అనామిక పై కణుపునకు చేరి అచ్చటి నుండి చూపుడు వ్రేలి క్రిందకు దిగును. ఇవి మొత్తం 10 అనగా జపసంఖ్య పదియగును, పదికి మించి జపసంఖ్య గుర్తించుటకు ఎడమ చేతి వ్రేళ్ళను వాడుకొనవలెను.

రెండవది మణిమాల-మణిమాలలో మణులతోను, రుద్రాక్షలతోను, తులసి పూసలు శంఖములతోను, ముత్యములు, పగడములు, కుశ (దుర్భ) పర్వములు వాటితోను తయారు చేసికొందురు. 108 పూసల మాల ఉత్తమము 54 పూసల మాల మధ్యమము; 27 పూసమాల అధమముగా చెప్పబడినది పైజెప్పిన సంఖ్యగాక మేరువుగా (కొనికి పూస) ఒక పెద్ద పూస చేర్చుకొనవలెను అట్టి మాలను సంస్కరించుకొని జపమునకు ఉపయోగించుకొనవలెను. మాలా సంస్కార విధానము భిన్నరీతుల మున్నది.

జపమాలను పంచగవ్యములతో సంస్కరించుకొనుట సులభవిధానము. ఇట్టి



మాలతో జపమాచరించ గోరువారు కొన్ని జాగ్రత్తలు తీసికొనుటఅవసరము జపమాచరించు సమయమున 'జపమాల' ఊగరాదు, ఊపరాదు. క్రిందకు జారవిడువరాదు. జపమాల దారము చేతిలో తెగనీయరాదు. దారము తెగునన్న అనుమానమున్న ముందుగనే దారము మార్చుకొనవలెను. రాగి, వెండి, బంగారు తీగెతో జపమాల తయారు గావించుకొనుట శ్రేష్ఠము. వేళ్ళ చివర జపించుట, మేరువు పూస దాటి జపించుట, లెక్కలేకుండ జపించుట నిష్ఫలమని శాస్త్రవచనము.

ఇక మూడవది 'వర్ణమాల' దీనినే మాతృకా మాలయని కూడ నందురు. ఈ మాలతో జపించిన వెంటనే సిద్ధి కలుగును, వర్ణమాలతో 12 సంవత్సరములు జపమాచరించిన అణిమాది సిద్ధులు జ్ఞానము కూడ లభించునని పెద్దల వచనము. వర్ణమాల యనగా మంత్రమునకు ముందు వర్ణము (అక్షరము) చేర్చి జపించుట. అక్షరములు 50 కలవు. ఒకేసారి అనులోమ విలోమముగా జపించిన 100 అగును. ఆపైన అం, కం, చం టం, బం, తం, పం, యం, శం అని ఎనిమిది జపించిన 108 పూర్తి అగును. వర్ణముల యొక్క శక్తిని గూర్చి 'అక్షమాలికోపనిషత్తు'లో వివరముగా చెప్పబడినది. వర్ణముల శక్తి ఇట్లు చెప్పబడినది.

1) "అం" — మృత్యువును జయించును, సర్వవ్యాపకమైనది.
2) "ఆం" — ఆకర్షణాత్మకము, సర్వత్ర ఉండునది,
3) ఇం — పుష్టినిచ్చునది.
4) ఈం — వాక్ప్రసాదమిచ్చును. నిర్మలమైనది.
5) ఉం — సమస్తబలము నిచ్చును, సారతరమైనది.
6) ఊం — ఉచ్చాటనము గావించునది.
7) ఋం — సంక్షోభము గలిగించునది, చంచలమైనది.
8) ౠం — సమ్మోహన కరమైనది, ఉజ్వలమైనది
9) ఌం — విద్వేషణ కరము, మోహకమైనది.
10) ౡం — మోహకరమైనది.
11) ఏం — సర్వ వశ్యకము, శుద్ధమైనది. సత్యమైనది.
12) ఐం — శుద్ధ సాత్వికమైనది, వశ్యకము.
13) ఓం — నిఖిల వాఙ్మయ స్వరూపము, శుద్ధము, శాశ్వతము.

14) ఔం —సర్వవాఙ్మయ స్వరూపము.
15) అం —మోహన కరము
16) అః —రౌద్రము, మృత్యునాశని
17) కం —సర్వ విష హరము, శుభముల నిచ్చునది
18) ఖం —క్షోభపఱచునది, వ్యాపకమైనది.
19) గం—సర్వ విఘ్నములను పోగొట్టునది, మహత్తరమైనది.
20) ఘం— సౌభాగ్య ప్రదాయిని, స్తంభనము.
21) ఙం—సర్వవినాశనము, ఉగ్రరూపము.
22) చం — అభిచార నాశనము, క్రూరము.
23) ఛం — భూతనాశనము; భయంకరము.
24) జం — ప్రచండమైనది, ప్రయోగనాశిని.
25) ఝం—భూతనాశకరము.
26) ఞం—మృత్యువును నశింపజేయును.
27) టం—సమస్త వ్యాధి నాశని, మేలు చేయును.
28) ఠం—చంద్రరూపమైనది.
29) డం— గరుడాత్మకము, విషహరము, శుభకరము.
30) ఢం — సమస్త సంపదలొసంగును. శుభస్కరము.
31) ణం—సర్వసిద్ధుల నిచ్చును.
32) తం — ధన ధాన్యముం నిచ్చునది, ప్రసన్నకరమైనది.
33) థం — ధర్మప్రాప్తి నొసంగును, నిర్మలము.
34) దం—వృద్ధిని, పుష్టిని కలిగించును.
35) ధం—విషజ్వరముల నణచును
36) నం—భక్తి ముక్తి ప్రదాయిని, శాంతమైనది.
37) పం — మంగళప్రదమైనది. విష, విఘ్నముల నశింపజేయును.
38) ఫం — అణిమాది సిద్ధుల నొసగును. జ్యోతి రూపమైనది.
39) బం—సర్వదోషహరమైనది, శుభకరము.
40) భం— భూతముల శాంతింపజేయును.
41) మం — ద్వేషించువారిని మోహింపజేయునది.
42) యం—సర్వవ్యాపకము, పావనమైనది.



43) రం—దాహకరమైనది.
44) లం — విశ్వమును భరించునది, ప్రకాశించునది.
45) వం—సర్వ సంతృప్తిని కలిగించును. నిర్మలమైనది.
46) శం—సర్వఫలములనొసగును, పవిత్రమైనది.
47) షం—ధర్మార్థ కామముల నొసగును తెల్లనైనది
48) సం—సర్వకారణమైనది. సర్వవర్ణములకు సంబంధించినది.
49) హం — సర్వవాఙ్మయ స్వరూపమైనది. నిర్మలమైనది.
50) ళం—సర్వశక్తుల నిచ్చునది, ప్రధానమైనది.

ఈ 50 (ఏబది) కాక మేరువు (కొలికిపూస)కు
క్షం—వర్ణము చెప్పబడినది.
క్షం—కారము పర, అపర తత్వముల జ్ఞాపకము చేయు పరంజ్యోతి రూపమైనది.

జపమాచరించు వారు అనుసరించవలసిన విధానములు :

సూర్యోదయమునకు పూర్వమే నిద్రనుంచి మేల్కాంచి, ఇష్టదేవతా స్మరణగావించి, కాలకృత్యముల తీర్చుకొని, తూర్పు, ఈశాన్య దిక్కులలో గొంతు కూర్చొని (కుక్కుటాసనము) దంత ధావనము ముగించుకొని స్నానమాచరించవలయును.

స్నానం రెండు రకములు :-

1) బాహ్యస్నానము 3) మానసిక స్నానము. బాహ్యస్నానము అయువును, బలమును, ఓర్పును వృద్ధి గావించి అలసటను, దాహమును, శ్రమను, చెమటను (సేద్యము) పోగొట్టును.

మానసిక స్నానములు పలువిధములుగా చెప్పబడినవి అందులో ప్రాణాయామయు 'యోగమయ' మానసిక స్నానములలో చెప్పబడినది. అటులనే ధ్యానమయ స్నానము మొదలగునవి.

బాహ్య స్నానము గంగను స్మరించుచూ, మంత్ర సహితముగా చేయుట ఉత్తమము.

స్నానానంతరము శుభ్రమైన తెల్లని వస్త్రము ధరించుట శ్రేయస్కరము. సౌమ్యజనములకు ధౌతవస్త్రము ప్రధానము.

పట్టుగుడ్డ, ధావళి, ఉన్నివస్త్రములు శ్రేష్ఠములు. పట్టుగుడ్డ విషయములలో భిన్నాభిప్రాయములున్నవి

క్రొత్తపట్టుగుడ్డ ఎన్నినాళ్ళైననూ అనుష్ఠానమునకు పనికి వచ్చుననియు, ఆ గుడ్డతో భోజనము చేసిననూ లేక ఉతికిననూ, పక్షమున కొకసారి శోధన గావించవలెననియు, పదిరోజుల కొకసారి, మాసమున కొకసారి ఉతికి శుభ్రపరచు కొనవలెననియు, భిన్నరీతుల చెప్పబడినవి. కాని ధావళి, ఉన్ని వస్త్రములు సర్వదా పవిత్రములనియు, ఉతకవలసిన పనిలేదనియు, సూర్యునికి జూపి ఏడుమార్లు విదిలించిన శుద్ధియగుననియు తెలియనగును.

తదనంతరము వారివారి సాంప్రదాయాను సారముగా పుండ్రము (బొట్టు) ధరించి శుద్ధమయిన స్థలమున, సుఖాసనమున గూర్చుండి జపమాచరించవలెను "ఆసనం విజయం యేనజితం తేన జగత్రయమ్" అని చెప్పబడియున్నందున ఒక స్థిరమయిన ఆసనమున జపాంతము వరకు ఉండగల్గుట ఉత్తమము.

జపమునకు సిద్ధాసనము, స్వస్తికాసనము, పద్మాసనము ఉపయోగకరములని 'యోగ చూడామణ్యుపనిషత్' మరియు 'హఠయోగ ప్రదీపిక'లు పలుకుచున్నవి.

జపసమయమున మనస్సు శుద్ధిగయున్న ఉత్తమ ఫలితములు పొందగలరు. మనశ్శుద్ధికి అహింస, అక్రోధము, అహంకార త్యాగము, భూతదయ, క్షమాగుణము, సాత్వికాహార సేవనము గొప్పగా సహకరించును.

జపము వలన సత్ఫలితములు సాధించుటకు భగవంతునియందు (ఇష్ట దైవము) అచంచలమయిన 'భక్తి' అవసరము.

'భక్తి, కర్మ, జ్ఞానములలో భక్తి అతి ప్రధానమయినది బలీయమయిన భక్తివలనగాని, కర్మ, జ్ఞాన సోపానములు చేరలేర.

"మయి భక్తిర్హి భూతానా మమృతత్వాయ కల్పతే" అనెడి "శ్రీమద్భాగవత" ప్రమాణము ననుసరించి భగవంతుని యందు భక్తియే భూతములకు అమృతత్వమును గల్గించునని తెలియుచున్నది.

'నమే భక్త ప్రణశ్యతి' అనెడి భగవద్గీతా ప్రమాణము వలన భక్తుడు నశింపడనియు తెలియనగును భక్తి శ్రేయస్సును కలిగించి మోక్షము నొసంగుననియు, భక్తులకు జాతి, విద్య, రూప, కుల, ధన, కర్మలలో ఉచ్ఛనీచాది భేద



ములు లేవనియు 'నారద భక్తిసూత్రములు' వక్కాణించుచున్నది. అధ్యాత్మ రామాయణము, భక్తి రసామృత సింధువు శ్రీ మద్భాగవతము మొదలగు పవిత్ర గ్రంథములు 'భక్తి'ని విపులముగ పలికియున్నవి

అట్టి నిష్కళంక భక్తితో, సుఖాసనమున, తూర్పు, ఉత్తర, ఈశాన్య దిక్కుల కభిముఖముగ కూర్చొని, నియమిత సమయముల, శ్రద్ధగా ఒడుదుడుకులు లేక జపమాచరించిన సుఖముల బడయగలరని ధర్మశాస్త్ర వచనము.

తే 15-5-88 ది, 5-6-88 ఆంధ్రభూమి దినపత్రికవారి సౌజన్యంతో)

## శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి వారి చరిత్ర

* వీరం భొట్లయ్య తల్లికి వైరాగ్యమును బోధించుట :

"దేహమనిత్యము కాని దాని యందుండు జీవాత్మయు, పరమాత్మయు నిత్యములు. ఈ శరీరము ఎముకలు, మాంసము, నెత్తురు, చర్మములతో నిర్మాణమైన తోలుబొమ్మ. ఇది మలమూత్రముల కొంప. మిగుల యేహ్యమయినది. ఎదుటవారిని [illegible]తో గాంచిన నీకీ నగ్నసత్యము గోచరించ గలదు. దీనికి చక్కని వయస్సున ఆభరణాదులచే నలంకరించిన దీనియందు మోహము జనించి స్త్రీ పురుషు లొండొరులు ప్రేమించుకొని సంసారమను వలలో చిక్కుకొని యిందుండి తప్పించుకొనలేక మోహ బంధములచే కట్టుపడి యొనర్చిన కర్మానుభవములకై కాలుడను కిరాతునిచే బాధలు పడుచున్నారు. ఈ మర్మమంతయు నీవు బాగుగా జ్ఞప్తికి దెచ్చుకొని యోజించిన నీకే విశదము కాగలదు"

* వీరంభొట్లయ్య తల్లికి పిండోత్పత్తి క్రమము (సృష్టి రహస్యము) తెలుపుట :

"అమ్మా! మానవుడు భుజించిన యన్నము మూడు భాగములుగా చెప్పబడుచున్నది. అన్నము ఘన పదార్థము, ఉదకాదులు ద్రవ పదార్థములు, నేయి, నూనె మొదలగునవి చమురు పదార్థములు. ఈ మూడును చక్కగా జీర్ణమై శరీరమునకు మనమును ప్రాణికి చైతన్య సమర్థతయును, మనస్సునకు ధ్యానమును కలుగజేయును. దీనిలో మదమెక్కువయైనప్పుడు పురుషునకు శుక్లమును, స్త్రీకి శోణితమును వృద్ధి చేయును. అందుచే స్త్రీ పురుషులకు కామవాంఛ కలిగి సంభోగము గావింతురు. ఋతుకాలమందలి అట్టి సంభోగము వలన శుక్ల శోణితములు స్త్రీ

యోనియందు మిశ్రితమై గర్భధారణము కలుగుచున్నది. శుక్ల భాగమధికమైన పురుషుడును, శోణిత భాగమధికమైన స్త్రీయును, రెండును సమాన భాగములైన నపుంసకుడును జన్మింతురు.

మరియు స్త్రీగర్భధారణాది యైదు దినంబుల వఱకు శోణితముతో గలిసిన శుక్లము నీటిపై బుడగవలెనుండును. పది దినములకది కోడిగ్రుడ్డు యాకారమును పొందును. ఒక మాసం కది గట్టిపడి శిరస్సును, తోకయు, నేర్పడును. రెండు నెలలకా తోకవలెయున్న దానియందు కాళ్ళు చేతులు నేర్పడును. మూడునెలలకు పొట్ట యేర్పడును. నాల్గుమాసములకు ప్రక్కలు యేర్పడును. అయిదు మాసములకు పాదములును, అరిచేతులును యేర్పడును. ఆరు మాసములకు ముక్కు, చెవులు, కన్నులు మొదలగు రంధ్రములుగల యవయవములు పుట్టును. ఏడవమాసమందా దేహములో జీవుడు ప్రవేశించును. అప్పుడు ముఖము పైకి యుండును. బొడ్డు మొదలుకొని బ్రహ్మరంధ్రము వఱకును వెనుకవైపున చిన్న రంధ్రములుగల నాళముండును. ఆ కాలమున తల్లి యొక్క జఠరాగ్ని బాధ లేకుండుటకు సూతియను నొక తొడుగు (మావి) పిండమును చుట్టి యుండును. ఎనిమిది, తొమ్మిది మాసములందు గర్భస్తజీవునకు పూర్వజ్ఞానము కలిగి భూమిమీద పడువఱకు మూత్ర స్థానమైన గర్భములోనుండి తాను గత జన్మము నందొనర్చిన దుష్కర్మలను తలపోసికొని పలు విధముల విచారించుచు ఆగర్భ నరకమందు తానపుడు పడుచున్న బాధలను తలచుకొని తన పూర్వపు దుష్కర్మలకు పశ్చాత్తాపము పడుచు, భగవంతుని ధ్యానించును. యిక ముందు భూమిపై జన్మించి నప్పటినుండియు, ఏ పాపకర్మను చేయక సదా భక్తిమార్గము చేతనే కాలము గడిపెదనని, పాడబావిలో పడున్న కుక్కవలె తనకు తాను బుద్ధి చెప్పుకొనుచుండును. అందులోను కొందరు జన్మించి వారి పూర్వ పుణ్యమున సద్గురు నాశ్రయించి సాంఖ్యము, తారకము అమనస్కములలో నేదేని సాధనచేసి తరించుట గలదు. కొందరు భక్తియోగము చేత సగుణ నిర్గుణోపాసకులై పరమాత్మను చేరుదురు. నవ మాసములును నిండిన పిదప దినమున విష్ణుమాయ గప్పి పిండ మధో ముఖమై తల్లికి ప్రసవవేదన కలిగించి తల్లియొక్క అపానవాయువు యొక్క ఒత్తిడి (పీడనము) చేతను పిండమందలి ప్రాణవాయు పీడనము చేతను మెల్ల మెల్లగా భూపతనమై పూర్వాగ జ్ఞానమంతయు మఱచి మాయలోకమున బడి క్యావు క్యావు మనేడ్వ నారంభించును. అప్పుడు తల్లి దండ్రులును, యితర బంధువులును అమితానందంబుల నొందుదరు.



* "జీవుల పదునాల్గు లక్షణములను వీరంభొట్లు తల్లికి బోధించుట"

భూమిపై జన్మించిన దాదిగా ఆ శిశువున కిసుమంతయు జ్ఞానము లేక పంచము మీదనే అహో రాత్రంబులు మలమూత్రములో బడి పొరలుచు, ఈగలను, దోమలను తోలుకొనలేక, నల్లుల బాధను పడలేక, ఆకలి మొదలగు బాధలను వ్యక్త పఱచ లేక యేడ్చుచు, దుఃఖించుచుండును. ఆయా బాధల ననుభవించుటయేగాక చేదులు, కారములు మొదలగు మందుల సేవించలేక యేడ్చుచు, మధ్య మధ్య బాల గ్రహాది బాధల ననుభవించుచు భగవదనుగ్రహము చేతనవియన్నియు దాటి నాలుగైదు సంవత్సరములు గడచినచో అక్షరాభ్యాసమనియు, ఉపాధ్యాయుల దండనలనియు బాధలుపడును ఎట్లో కొంతవిద్య నేర్చి లోకజ్ఞానము కల్గి యౌవనము ప్రాప్తించుసరికి గుదిబండనువలె నొక కన్యను వివాహము గావింతురు ఆ కాలమున మాత్రము పురుషుడు యుక్తా యుక్త విచక్షణ శూన్యుడై, ఆ కాలములందైన నామెతో క్రీడించుచు నామెయే లోకమని తల్లి దండ్రులను విస్మరించి భార్యాపోషణాదులకై నీచమనియైన నెంచక నీచ వృత్తులనేవి చేసి ధనార్జన గావించుచు తల్లి దండ్రుల గసరికొట్టుచు బిడ్డలగనుచు వారిని పెంచుటకై పలుపాట్లు పడుచు, ధనార్జనకై యెన్నియో దుర్మార్గముల గావించుచు, ఏ సమయ మందును పరమాత్మను స్మరింపక వార్ధక్యము పైబడిరాగా తనుగన్న కొడుకులకు భార్యలు రాగా, తన కొడుకులు కోడండ్రు తనకు సరిగా ఉపచారములు గావించుటలేదని మూలుగుచు, తుదకు కాలుసేతులు వంగిపోగా, మరల మంచంపైబడి రోగములచే బాధపడుచు కుయ్యో మొఱ్ఱో యనునేగాని యప్పుడైన 'నారాయణా!' యన్న పాపంబున బోడు. ఇన్ని బాధలనుభవించి యాయువు మూడగా అసువులు బాసి కాలకింకరులు వచ్చి బంధించి బాధింపుచు ముండ్లపైన నడిపించుచు యమలోకంబునకు గొంపోబడి అచట తిరిగీ యమదండల ననుభవించి మరలనిట్టే యెచటనో జన్మించును. కావుననో జననీ! పాంచ భౌతికమైన యీ దేహమనిత్యమని యెరిగియు దీనిపై నింత మమకారము నొందనేల!" అని చెప్పగా వీర పాపమాంబయు సర్వమెరిగిన జ్ఞానియే యగుట వలన కుమారుకు చెప్పినదంతయు చక్కగా విని వాని జ్ఞానమున కానందించి, 'నాయనా యీ దేహమెట్లు సృజింపబడినదో చెప్పగలవా' అని ప్రశ్నించెను.

* వీరంబొట్లయ్య తల్లికి సాంఖ్యయోగము తెల్పుట:-

"అమ్మా! సావధానముగా వినుము. భూమి, నీరు, అగ్ని, గాలి (వాయువు), ఆకాశము అను నీ యైదును మొదటి పంచభూతములు.

వీనిలో వరుసగా

1) వాక్కు, పాణి, పాదము, గుదము, గుహ్యమునను నీ పంచనాత్మలను భూమియను భూతమువలన పుట్టెను.

2) శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధమునను నీ యైదు పంచతన్మాత్రలు నీటినుండి పుట్టినవి.

3) శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము నను నీ యైదు పంచ తన్మాత్రలును అగ్ని భూతము నుండి పుట్టినవి.

4) ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానమునను నీ ఐదు పంచ తన్మాత్రలును వాయు భూతమునుండి పుట్టినవి.

5) మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారమునను నీ నాల్గింటిని అంతఃకరణ చతుష్టయమందురు.

మొత్తము మొదటి నాలుగైదు యిరువదియు అంతఃకరణ చతుష్టయముతో కలిసి యిరువది నాలుగు. వీనినే చతుర్వింశత తత్వము అందురు.

వీని కలయికల తోడనే శరీరము సృష్టింప బడినది. మరియు నీ పంచ భూతములను, పంచతన్మాత్రలను పంచీకరణములై సకల యింద్రియములును వారి హెచ్చుతగ్గు పాళ్ళ వలన సర్వరజస్తమో గుణంబులను, స్థూల, సూక్ష్మ, కారణ శరీరములను, కామక్రోధ లోభ మోహ మద మాత్సర్యంబులను అరిషడ్వర్గమును పుట్టినవి. జీవుడా పాంచ భౌతిక శరీరములో ప్రవేశించినప్పటినుండియు నాయా గుణంబులన్నియు సమయానుకూలముగా ప్రజ్వరిల్లు చుండును. అందలి జీవుడు జ్ఞానవంతుడై అయా వికారముల వేటిని ఉద్రేకింపనీయక వానితో సంబంధమే మాత్రమును పెట్టుకొనక తనంతట తానై నిలిచి యున్నచో అచలుండందురు. దీనినే సాంఖ్యయోగమందురు అనగా జ్ఞానముతో కలసి పంచ వింశతి తత్వ యుతుండైన జీవుని తెలిసికొనుటనే ఆత్మయందురు. ఆ యాత్మ సహాయమున పరమాత్మను తెలిసికొనినచో నిక పరబ్రహ్మమొక్కడే సత్యము, నిత్యమునై నిలుచును. తక్కిన వన్నియు నశించును. ఇదియే జీవబ్రహ్మైక సంధానము. అతడే ముక్తుడు" అని వీరంభొట్లయ్య తల్లికి సాంఖ్య సూత్రమును తెలిపెను.



* వీరం భొట్లయ్య తల్లికి తారకోపదేశము చేయుట:-

"బిడ్డా! పరబ్రహ్మనెఱుగ సాధనమెట్లు"ని ప్రశ్నించగా

"అమ్మా! అదియెంతయో పనికాదు. నీవంటివారికది సులభము తెల్పెద నాలకింపుము. పద్మాసనము వేసికొని కూర్చుండి నిశ్చలముగాను, మనస్సును చలింపనీయకుండగను కూర్చుండి, అతి చంచలమైన చిత్తమును చలింపనీయక అణుమాత్రముగా కానవచ్చు మెఱుపువలె ప్రకాశించు వెలుగునందు మాత్రమే మనస్సును లయము చేసినచో చిన్ముద్ర ధరియించియున్న శ్రీగురుమూర్తి యొక్కడే కానవచ్చును. అట్లే యింకను నిన్ను నీవు మరచి చూడగా చూడగా ఆయణువులో నాగురుమూర్తి యంతరించి కోటి సూర్యులొక్కమారుగా వెలిగినంత వెల్తురు కనిపించును. అప్పుడు నీవను నొక్కతే వున్నా వనుకొనవు. ఆ తన్మయత్వములో నీవును ఆ వెలుగులో లీనమై పోవుదువు. అదియే పరబ్రహ్మము. ఆ పరిపూర్ణమునందైక్యమగుటనే అచల పరిపూర్ణమందురు. అదియే అద్వైతము. అది యొక్కటియే నశింపక శాశ్వతమై యుండునది ఆ పరబ్రహ్మము నందైక్యమగుటనే జీవబ్రహ్మైక్యమందురు.... ఇంక తానూలేదు ఏమియూలేదు. దానినే సమాధియందురు. జీవుడీ దేహమును విడిచిపోవు సమయమున కాతడా బ్రహ్మమునందైక్యమయి యుండెనేని యింక వానికింక జనన మరణములు లేవు. శాశ్వతానంద పదవి యొక్కటే, మోక్షము, అని చెప్పగా నానంద బాష్పములు జొటరాల సత్యం తానందముతో కుమారుని కౌగలించుకొని, "నాయనా! నువు కుమారుడవును- కావు, మానవమాత్రుడవును-కావు, కేవల మా పరమేశ్వరుడవే యిట్లవతరించితివి.... ........మీ జనకుని వలన కూడ మున్నెన్నడు వినియుండని పరమ రహస్యములన్నియు గూడ నాకు తెల్పి నా సందియము బాపితివి. ఐన నింకొక్క సందియము మాత్రం నాడెందమును బాయకున్నది. అణుమాత్రంబైన విద్యుల్లతయే పరబ్రహ్మము (పరిపూర్ణము) అని చెప్పితివి. దానిని చూచుచున్నానని తెలిసికొనుట. నేను చూచుచున్నానను కొన్నది జీవాత్మ, ఆ జీవాత్మ పరమాత్మ (పరబ్రహ్మము) లో నెట్లు లీనమగును? అపుడు జీవాత్మ యెట్లు నశించును? అట్టి పరిపూర్ణము నందైక్య సంధానమెట్లు?" అని ప్రశ్నించగా వీరంబొట్లయ్య "అమ్మా! వినుము. నీ నేత్రముల మూసికొన్నను, తెరిచి యుంచినను దృష్టిని యీ ప్రపంచమందలి

యేవస్తువు మీదను నిల్పక కేవలము భ్రూమధ్య మందలి లక్ష్యము మీదనే నిల్పి గాలి దీపము చరించునట్లు క్షణక్షణము అన్య చింతలవైపునకు బోవు చిత్తములను మనస్సు చెదరనీయక యేకాగ్రత చేసి పంచేంద్రియములకును గోచరించు సమస్తం బును సచ్చిదానంద స్వరూపమేయని యనుకొని సమస్తంబును బ్రహ్మమయమే యని యెఱుంగుము. తానుకూడ బ్రహ్మమునేయని తెలిసికొన్నవాడెవడో వాడే ముక్తుడు. అదియే ఐక్య సంధానము అట్లు చేసి తరించుము". అని చెప్పెను.

* భక్తియన నెట్టిది? దాని ప్రభావ మెట్టిది?

భక్తియన నెట్టిది? దాని ప్రభావ మెట్టిది? దయయుంచి తెల్పుదురా? అని నొక భక్తుడు కోరగా వీర బ్రహ్మేంద్ర స్వాములవారు, "భక్తియనునది యొక మహాద్భుత శక్తి. దానికేదియు సాటిలేదు. భక్తికి వశ్యుడుగాని యే దేవుడును లేడు. అది జగదీశ్వరుని యందధికమైన ప్రీతితో నొనరించినచో మోక్షము కొంగు బంగారమై యుండును. వేదాంత మార్గమున సాధింప బూను వారికి కొన్ని జన్మలు పట్టును. కాని నిజమైన భక్తుడా జన్మలోనే మోక్షము నందగలడు. వాని కొఱకా యధిష్టాన దేవత యంతయు సిద్ధము చేసి గట్టును, భక్తియు, జ్ఞానమును, వేర్వేరు మార్గముల బట్టినను, తుదకొక్క చోటికే వచ్చి కలియును. సద్గురు నాశ్రయించి, జ్ఞానమార్గములన్నియు తెలిసికొని అష్టాంగాది యోగములన్నియు నభ్యసించి జీవా త్మను పరమాత్మలో నైక్యము గావించుకొనుట సాధారణ కార్యము కాదు అది కత్తుల సాము వంటిది. 'ఓ కృష్ణభగవానుడా, నేనేమియు నెరుగను. అన్యధా శరణం నాస్తి త్వమేవ శరణం మమ' అని త్రికరణశుద్ధిగా నా శ్రీకృష్ణ భగవానుని యందే యహర్నిశలు ధ్యానముంచుకొని తన్మయత్వము నొందిన వాడును ఆ కృష్ణ భగ వానుని కరుణచే పరబ్రహ్మము నందేకము కాగలడు. కావున మీరందరును సందియ ములు మాని నా యందు భక్తినిలుపుకొని ముక్తి నొందుడు.

* నిజ గురువు, నిజ శిష్యులెట్టివారని సిద్దయ్య అడుగుట :-

సిద్దయ్య స్వాములవారిని చూచి సకల సద్గుణములు కలిగిన శిష్యుడు అనగా యెట్టివాడో తెల్పుదురా? యని యడుగగా బ్రహ్మంగారు, "సిద్దా! ఇటు చూడుము. నిత్యమూ గురుసేవ చేయుటయందే ఆసక్తి కలవాడును, గురువుగారి యందు ఎక్కువ భక్తి విశ్వాసములు యెవ్వనికుండునో, ఎవని శాంతం, ఓర్పు, పాపభీతి, సత్యహింసాది సద్గుణములు గల్గియుండి,తానే కార్య మొనరించినను దాని కర్తవ్య మును ఫలమును కూడ ఆచార్యార్పణముగా చేయుచు తన గురువుగారే సాక్షాత్తు పరబ్రహ్మమేయని యెవడు నమ్మియుండునో, నిత్యము తన గురుమూర్తినే కండ్లతో చూచు చుండుటను, మనస్సులో ధ్యానించుటను యిష్టపడునో యాతడే నిజ శిష్యుడు.



ఇక నిజ గురువు అనగా నెట్టివాడందువా? సత్ప్రవర్తనము అనగా న్యాయ ముగా సంచరించుట, పుణ్యకర్మలు చేయుట, అహంకార మమకారంబులు విడచుట, దంభములు చెప్పక, దర్పములు చూపక తన పూర్వ కర్మలననుసరించి లభించిన యిల్లాలితో సంసారము చేయుచు, మానావ మానములకును, దూషణ భూషణ తిర స్కారములకు కించనొందక, ఎల్లప్పుడును పరోపకార చింత కలిగి యుండుట, విసుగుదల కోపము లేక శాంత స్వభావుడై తన శిష్యకోటియందు పక్షపాత బుద్ధి లేక తన హృదయంలో కొంత విద్యా రహస్యములను దాచుకొనక శిష్యులకు పరి పూర్ణముగా చెప్పుట, శిష్యులను నిజంగా తన కుమారుల వలెనే చూచుచు నిత్య సంతోషియైయుండునో అతనినే నిజ గురువు అని చెప్పవచ్చును" అని చెప్పిరి.

అప్పుడు సిద్దయ్య, "గురూత్తమా! లోకములో కొందరు జ్ఞానవంతులును. కొందరు అజ్ఞానవంతులునై యుందురు. వీరందరును బ్రహ్మ విచారణ చేయుటకు అర్హులేనా?" అని యడుగగా వీరబ్రహ్మేంద్రుల వారు 'నాయనా! బ్రహ్మవిద్యను నేర్చుకొనుటకు గాని. బ్రహ్మ విచారణ చేయుటకుగాని, బ్రహ్మచారి, గృహస్తు, వానప్రస్తు, సన్యాసి, పురుషుడు, స్త్రీ, స్వమతస్తుడు, స్వకులస్తుడు అగ్రవర్ణుడు, అధమ వర్ణుడు అను భేదం లేవియు నక్కఱలేదుగాని శిష్యుడా విద్యను గ్రహింప శక్తి గలవాడో లేదో, వాని దీక్ష యెంతవరకున్నదో, శాశ్వతమో, తాత్కాలికమో కనిపెట్టవలెను. తుద కట్టివాడు ముదుసలియైనను, వ్యాధిగ్రస్తుడైనను కూడ తత్వ విచారణ చేయవచ్చును" అని చెప్పెను.

* సిద్దనికి తారకోపదేశము చేసి పంచముద్రల నెఱింగించుట :-

"నాయనా! నీకిదివఱకే ప్రణవ పంచాక్షరీ మంత్రమును దాని ప్రభావమును తెలియజెప్పియున్నాను. ఇపుడు తారకయోగమును తెల్పుదును. దానిని శ్రవణమనన నిధి ధ్యానంబుల చేసి తరింపుము. ఈ దేహమందు జ్ఞానేంద్రియములు, కర్మేం ద్రియములు, పంచతన్మాత్రలు, స్థూల సూక్ష్మకారణ శరీరములు, కామ్యాద్యరి షడ్వర్గములు గలవు ఈ యరిషడ్వర్గమును గెలుచుటకును మనో మారుతములనే

కము చేయుటకును సాధనముగా తారకము, సాంఖ్యము, అమనస్కము అను మూడు యోగములు గలవు.

తారక యోగము అభ్యాసము వలనగాని సుబోధకము కాదు కావున దానికి సాధనములైన పంచముద్రలను ముందు తెలిసికొనవలెను. 1. ఖేచరి, 2. భూచరి, 3. మధ్యమ; 4. షణ్ముఖి; 5. శాంభవి అనునవి పంచముద్రలు వీనిని గూఢ అభ్యాసము చేతనే తెలిసికొనవలెను. ఆ ముద్రలను పట్టునప్పుడు చిణీ, చిణీ, ఘంట, శంఖ, వీణా, వేణు, తాళ, భేరి, మృదంగ, మేఘనాదములని దశవిధ నాదములును ముందుగా వినవచ్చి యా పిమ్మట నదియే 'ఓమ్'కార నాదమై నిలిచిపోవును. ఆ నాదములను వినప్పుడు నీ జ్ఞాన మనోబుద్ధి చిత్తాహంకారములను చెదరనీయక సమిష్టి వ్యష్టియను భేదములు గల జీవ చైతన్యమును తెలిసికొంటివేని ప్రణవ ఓంకార లక్ష్యార్థమైన పరబ్రహ్మమే తాను అనెడి స్థితి కలుగును.

ఇంక పంచముద్రలెట్లు పట్టవలెననగా

1. ఖేచరి :- అనగా కళ్ళు తెరచిగాని, మూసిగాని భ్రూమధ్యమున దృష్టి నిలిపి చూచుట.

2 భూచరి :- అనగా నేత్రములను కదల్పక ముక్కు కొనను దృష్టి నిలిపి చూచుట.

3 మధ్యమ :- అనగా నాసికామధ్యమందు దృష్టి నిలిపి అంతర్లక్ష్యమున మనసును నిలిపి చూచుట.

4 షణ్ముఖి :- అనగా కండ్లు రెండునూ, చెవి రంధ్రములు రెండునూ, ముక్కు పుటంబులు రెండునూ రెండు చేతుల ప్రేళ్ళతోనూ మూసి భ్రూమధ్యమున దృష్టిని నిలిపి చూచుట.

5. శాంభవి :- అంతర్లక్ష్యమును, బాహ్యదృష్టియు గలిగి మనో మారుతముల చలనములు లేకుండా చేయుట.

ఈ యైదింటిని వరుసగా నభ్యాసము చేసి తుదకు శాంభవీ ముద్రలో స్థిరపడి యుండవలెను. అరచూపులోనైనను, పూర్తిగా కండ్లు మూసికొనియైనను త్వరలో ప్రకాశించు పరతత్వ స్వరూపమును తెలిసికొనవలెను.

ఇక తారక యోగమనగా సూర్యచంద్ర నక్షత్రములందు ప్రకాశించు



'విమల బిందువు' నైక్యంబు చేసి లక్ష్యత్రయములచే నొప్పుటయే తారకయోగము అనబడును. లక్ష్యత్రయమనగా బాహ్యలక్ష్యము, మధ్య లక్ష్యము, అంతర్లక్ష్యము అనునవి కనుక మండలత్రయం నందలి 38కళలను తెలిసికొనుటకును సాధనములైన అంతర్లక్ష్యముతో గూడిన ఖేచరి, షణ్ముఖి, శాంభవి అను మూడు ముద్రలును, బహిర్లక్ష్యము గల భూచరి, మధ్యమ ముద్రలును నీకు చక్కగా వివరించితిని కనుక పద్మాసనము వేసుకొని కూర్చుండి సాధకము చేసుకొనుచుండుము పరబ్రహ్మమును తెలిసికొని ధన్యుడవగుము" అని చెప్పిరి.

* స్వాములవారు ఒక భక్తునకు లక్ష్యత్రయమును వివరించుట:-

లక్ష్యత్రయమనగా బాహ్య, మధ్య అంతర్లక్ష్యములని మూడు విధములు. అందు బాహ్యలక్ష్య మెట్టిదనగా బయటి నాసాగ్రమున వాయువును మనస్సును ఏకము చేసి దృష్టి చెదరనీయకుండా నిలిపియుంచవలయును. అపుడు ఆ దృష్టికి అనగా నాసాగ్రమునకు నాలుగంగుళములు పైన ధూమ్ర వర్ణము (పొగరంగు)ను, ఎనిమిది అంగుళములపైన రక్తిమము (ఎఱ్ఱరంగు)ను, పంద్రెండు అంగుళములపైన పీతప్రభ (పసుపుపచ్చ రంగు)ను కనిపించును. ఈ మూడున్ను వీని సంధుల రెండు మిశ్రవర్ణములును మొత్తము అయిదురంగులును పంచభూతము వర్ణములనబడును. ఈ వర్ణములు తనకెదుట కనిపించినపుడు దానిని మెల్లగా క్రీగన్నుల వెనుకకు గూర్చి శిరమును పైకెత్తుచూ దృష్టి చలించకుండా చూచిన యెడల దానిలో చంద్రకాంతివలె కనబడును. మరియు చెవులు, ముక్కులు, నేత్రములను చేతి వ్రేళ్ళతో మూసి చిత్తమును దానిలో లయింపజేసిన యెడల (జాగ్రత్తగా విన్నయెడల) ప్రణవనాదము (ఓంకారము) వినబడును. మరియును శబ్ద ప్రభావము వల్ల నవరత్న కాంతులును కూడా కాన్పించును ఈ విధముగా ఆత్మ ప్రత్యయ ప్రకాశమైన యెడల దానినే బాహ్యలక్ష్యమని యందురు.

మధ్యలక్ష్యము:- కంటిపాపల రెంటినీ కదలనీయక మనసును కనుబొమల మధ్యకు రప్పించి చూచినచో అదృష్టి మధ్య మిక్కిలి సూక్ష్మమైన యొక రంధ్రమున్నట్లు కనిపించును. నీ దృష్టిని జాగ్రత్తగా ఆ బిలమందు చూచుటకు ప్రవేశపెట్టి చూచిన యెడల నక్షత్రములును సూర్య చంద్రులును ఎట్టి కాంతిని గల్గియుందురో అట్టి కాంతి కనిపించును. ఆ వెలుగుతో పైన చెప్పిన పంచభూత వర్ణంబులును వాయువుతో క్రోడీకరించి చూచినచో రకరకములైన రంగుల శోభింప

జేయును. అంతేగాక అంతము గానరాని యాకాశమునందు గాఢాంధకారము గ్రమ్మి నట్లును, కణకణలాడు అగ్నిహోత్రమువలె పరాకాశమునూ మిక్కిలి తేజోవంత మైన తత్వాకాశమును, కోటి సూర్య ప్రభలతో వెలుగు సూర్యాకాశమును మొత్తం పంచ మహాకాశములును కనబడును వీనినింగాచుచు తన్మయుడై యుండినచో దానినే మధ్య లక్ష్యమందురు.

అంతర్లక్ష్యము:- ఇది వెనుక చెప్పిన రీతిగా సూర్య చంద్రాగ్నులవలె వెలుగుచు పంచభూత వర్ణములతో కలిసియుండి అపోజ్యోతి రసమునకు ఆశ్రయమై కనబడును. ఈ గుర్తులు కంటిమధ్యను పరమాత్మ, హైరణ్య, సచ్చిదానంద, అమృతులకు సాక్షిస్వరూపమై వెలుపలను, లోపలను గూడ గమనించును. ఈ రెండు చిహ్నంబులును స్పటిక నీలవర్ణములతో వాయువుయొక్క ఉపస్థానమునుండి జీవతారకమనే పేరుతో ఒప్పుచుండును. దీనినే అంతర్లక్ష్యమందురు. ఈ విధముగా తారకయోగాభ్యాసము నెల్లప్పుడు చేయుచు మనోమారుతములను చలింపనీయక అభ్యసించవలెను. అట్లు చేసినచో అంతరాత్మ పరమాత్మయందు ఐక్యము నొంద గలదు.

* సిద్ధయ్య స్వాములవారిని, "మానవుడు మృతుడైన వెనుక మరల జన్మ మెత్తునా యెత్తడా సెలవీయడ"ని వేడగా స్వామి వారిట్లనిరి. "అది పరబ్రహ్మము, పరమాత్మగా మారినప్పుడు తనలోని కొంతభాగమునందు వేర్వేరు జీవాంకురములను ప్రవేశపెట్టి, వానిని లోకమందు ఆయారూపాలలో జన్మింపజేసినాడు. ఆ జీవాంకుర మునే మనము 'జీవాత్మ' అనుచున్నాము. ఆ జన్మించిన వారిలో మానవులనబడే ప్రాణులకు (జీవులకు) యుక్తాయుక్త విచక్షణ జ్ఞానమును యిచ్చి యీ లోకమందు వారిని పురుషార్థములను సాధించి తన్నెఱుంగ వలసిందిగా నాజ్ఞాపించి సుకర్మ దుష్కర్మల నేర్పరచి సత్కర్మలొనర్చిన వారికి సత్ఫలములు, దుష్కర్మ మొనర్చినవారికి దుష్ఫలములు అనుభవించ వలసినదని యాజ్ఞనిచ్చి యున్నాడు. సత్కర్మఫలము పుణ్యమనియు. దుష్కర్మఫలమును పాపమనియు నందురు. ఎట్టి వారికిని యీ ఫలములనుభవింపక తీరదు. ఆ నరులు తమ తమ చేసిన పుణ్య పాప ఫలము లనుభవింపుటకై ఒక జన్మాంతరమున మరియొక జన్మము నెత్తు చుండవలెను ఏ కర్మ చేసిననూ జన్మ తప్పదు. జ్ఞానులిది తెలిసికొని ఏ కర్మము నొనరించిననూ అహంకార మమకారములు విడిచి నిష్కామముగా నొనరించినచో అనూ పుణ్యపాపఫలములు (కర్మలు) తన్నంటవు. పైగా తాను జ్ఞానము నార్జించి



జ్ఞానాగ్నిచేత కర్మబీజములను దహించెనేని దానితో తాను (జీవాత్మలో కూడిన పరమాత్మ) తనలోని జీవసమును కాల్చివేయగా ఆత్మ + పరమాత్మ మిగిలి ఆయాత్మ పరమాత్మ భాగమే యగుటచేత పుటము పెట్టిన కత్తి బంగారములోని కత్తిపోయి మేలిమి మిగిలి అది అసలు మేలిమితో కలిసిపోవునట్లు జ్ఞానాగ్నిచే గాల్చి జీవమును చంపిన నయ్యంకురము నశించి అదియును పరిశుద్ధాత్మయైన పరమాత్మలో కలసి పోవును, ఇదియే జీవాత్మ పరమాత్మలో నైక్యము నొందు మార్గము" అని గురువుగారు చెప్పగా సిద్ధయ్యగారు బ్రహ్మానందభరితులైరి.

"ఒక యోగి ఆత్మకథ"

పరమహంస యోగనంద్ అనబడే యోగి తన ఆత్మకథలో ఎందరో మహానుభావుల గురించి తెలియజేశారు. పరమహంస యోగానంద్‌గారు (1893-1952) శ్రీరాంపూర్ వాస్తవ్యులైన స్వామి శ్రీ యుక్తేశ్వర్ గిరిగారి శిష్యులు. వారు కాశీవాసులయిన ప్రసిద్ధయోగి పుంగవులు శ్రీ లాహిరీ మహాశయుల శిష్యులు. లాహిరీ మహాశయులు ప్రాచీనకాలంనుంచి యిప్పటికీ కూడ అమరులుగా హిమాలయాల్లో జీవిస్తున్న మహావతార్ బాబాజీకిశిష్యులు.

ఇప్పుడొక పారాయణ గ్రంథమైన పరమహంస యోగానంద్‌గారి ఆత్మకథ పదిహేడు భాషలలోనికి అనువాదమయింది.

ఈ జగద్గురువులు యోగవిద్యను (దైవ సాక్షాత్కారానికి తోడ్పడే శాస్త్రీయ ప్రక్రియలు) జీవితంలోనే కాకుండా మరణంలోకూడ ప్రదర్శించారు. ఆయన చనిపోయిన కొన్ని వారాల తర్వాత కూడా ఆయన ముఖం అమరత్వమనే దివ్య తేజస్సుతో ప్రకాశించింది. లాస్ ఏంజిలస్‌లోని ఫారెస్ట్ లాన్ మెమోరియల్ పార్కు మార్చురీ (శవాల్ని భద్రపరిచే చోటు; ఇక్కడ మహాగురువుల భౌతిక కాయాన్ని తాత్కాలికంగా ఉంచటం జరిగింది). డైరెక్టరు,శ్రీహరీ టి.రోవే, సెల్ఫ్ రియలైజేషను ఫెలోషిప్ సంస్థకు వ్రాసిన ప్రమాణిత పత్రంలోని కొన్నిభాగాలు క్రింద పొందుపరుస్తున్నాం. "పరమహంస యోగానంద్‌గారి మృతదేహంమీద కంటికి కనబడే క్షయత్వ చిహ్నలేవీ లేకపోవటం, మా అనుభవంలో అత్యంత అసాధారణమైన విషయం....చనిపోయిన యిరవైరోజుల తరువాత కూడా ఆయన భౌతికకాయంలో శారీరక విఘటనం కనబడలేదు....ఆయన చర్మంమీదబూజుపట్టిన దాఖలా ఏమీ కనిపించలేదు. ఆయన శరీర కణజాలాలు (టిస్యూస్) ఎండిపోవడం

ఏమీ గోచరించలేదు. ఇంత పరిపూర్ణమయిన శరీర సంరక్షణ మా శవాగార చరిత్రలో, మాకు తెలిసినంతవరకు సాటిలేనిది....యోగానంద్‌గారి శవాన్ని స్వీకరించినపుడు శవాగార సిబ్బంది, శరీర క్షయానికి సంబంధించిన మామూలు క్రమగత పరిణామ చిహ్నాల్ని శవపేటిక మీద వున్న గాజు మూతలోంచి గమనించవచ్చునని భావించారు ఒక్కొక్క రోజు గడుస్తున్న కొద్దీ పరిశీలనలో ఉంచిన ఈ శరీరంలో మార్పేమీ రాకపోవడంతో మా ఆశ్చర్యం పెరుగుతూ వచ్చింది. యోగానంద్‌గారి శరీరం అద్భుత నిర్వికార స్థితిలో ఉన్నట్టు కనిపించింది ....ఏ సమయంలో కూడ ఆయన శరీరం నుండి దుర్వాసన వెలువడలేదు" అసాధారణమయిన, మానవాతీతమైన యీ అద్భుతం, మానవాళికి భగవంతుని సేవించడము ద్వారా మానవుడు సాధించగలిగిన విజయాలకు ఒక మచ్చు తునక. మరణానంతరము యీ అద్భుతం ప్రదర్శించి పాశ్చాత్యులను కూడ మన సంస్కృతిని అనుసరించే విధంగా మార్చగలిగిన యీ పరమహంసయోగానంద్ స్వామి జీవించి ఉండగా వ్రాసిన ఆత్మకథలో యిటువంటి అపూర్వమయిన వ్యక్తుల గురించి ప్రస్తావించారు అదే విధంగా ఎన్నో అమూల్యమయిన విషయాలు తెలియజేశారు.

సంకలన కర్త

## సనాతనమైన వేదాలు

సనాతనమయిన నాలుగు వేదాలకు, ఇప్పటికీ 100పై చిలుకు ప్రస్థాన గ్రంధాలున్నాయి. ఎమర్సన్ తన "జర్నల్"లో వైదిక భావనకు ఈ విధంగా జోహర్లు అర్పించాడు. "అది ఉష్ణం మాదిరిగాను, రాత్రి మాదిరిగాను, అలలులేని కడల మాదిరిగాను, మహత్తరమయినది. ఇందులో ప్రతీ ధార్మికభావనా ఉంది. ఉదాత్త కవితా హృదయంగల ప్రతి కవి మనస్సులోనూ పర్యాయక్రమంలో మసిలే మహత్తరమయిన నీతులన్నీ ఉన్నాయి—ఈ గ్రంధాన్ని ఉపేక్షించకూడదు. నామట్టుకు నేనొక్కణ్ణి అరణ్యంలోనో, సరస్సులోనో, ఒక నావలోనో ఉన్నట్లయితే ప్రకృతిమాత ఇప్పుడు నన్నొక బ్రాహ్మణ్ణి చేస్తుంది. అనంతమయిన ఆవశ్యకత, శాశ్వతమయిన నష్టపరిహారం, అగాధమయిన శక్తి, అఖండమయిన మౌనం....ఇదీ దాని ఉద్ఘోష. శాంతి, పరిశుద్ధత, సంపూర్ణ పరిత్యాగం—అన్న సర్వవ్యాధి చికిత్సకాలు, పాపాలన్నీ పరిహరించి, నన్ను అష్టదేవతల ఆనందధామానికి తీసుకు వెళ్తాయని చెపుతూంది."



## కనుబొమల మధ్య ఉండే బిందువు

"ఒంటి"కన్ను లేదా "జ్ఞాన" నేత్రం ఉండేస్థానం. మామూలుగా మరణ సమయంలో మనిషిలో ఉన్న చైతన్యాన్ని పవిత్రమయిన ఆస్థానానికి లాగేయటం జరుగుతుంది. చనిపోయినవాళ్ళ కళ్ళు పైకి తిరిగి ఉండటానికి కారణం ఇదే;

పుట్టుగ్రుడ్డి అయిన "రాము" అనే శిష్యుడు తన అంధత్వాన్ని పారద్రోలి తన కంటికి వెలుగు ప్రసాదించవలసిందిగా ప్రార్థించినపుడు "లాహిరీ" మహాశయులు మొదట తన కంతటి శక్తి లేదని నిరాకరించినా. పరమాత్మని శక్తికి పరిమితిలేదు. అటు నక్షత్రాల్నీ, ఇటు శరీరంలో జీవకణాల్ని నిగూఢమయిన తన ప్రాణశక్తితో ప్రజ్వలింపజేసే పరమాత్ముడు నీ కళ్ళకి తప్పకుండా వెలుగు ఇవ్వగలడు" అంటూ లాహిరీ మహాశయులు రాము ముఖంలో కనుబొమల మధ్య ఉండే బిందువును స్పృశించారు.

"నీ మనస్సును ఏడురోజులపాటు అక్కడ కేంద్రీకరింప జేసివుంచి తరచుగా 'రామ' నామం జపిస్తూఉండు. సూర్యుడి తేజోబింబం నీ కోసం ప్రత్యేకంగా ఉదయిస్తుంది" అన్నారు.

ఒక్క వారంలో అది జరిగింది; రాము మొట్ట మొదటిసారిగా ప్రకృతిమాత సుందర ముఖాన్ని దర్శించాడు.

(రాము విశ్వాసమన్నది భక్తితో దున్నిన నేల అందులో లాహిరీ మహాశయుల శక్తివంతమూ శాశ్వతమూ అయిన రోగనివారణ బీజం మొలకెత్తింది.

## రెండు శరీరాలున్న సాధువు

(పరమహంస యోగానంద పన్నెండేళ్ళ వయస్సులో కాశీ.చూసి రావడానికి వారి నాన్నగారిని అనుమతి కోరారు.) ఆయన ఆ మర్నాడు బరేలీనుండి కాశీకి వెళ్ళి తిరిగి రావడానికి వీలుగా ఒక రైల్వేపాసు, కొన్ని రూపాయి నోట్లు, రెండు ఉత్తరాలు యిస్తూ, కాశీలో కేదార్‌నాథ్ బాబు అని మా స్నేహితుడున్నాడు. అతనికి ఒక సంగతి తెలపవలసి ఉంది. దురదృష్టవశాత్తూ అతని ఎడ్రసు పోయింది. కాని మా యిద్దరికీ తెలిసిన స్నేహితులు స్వామి ప్రణవానందగారని ఆ ఊళ్ళోనే ఉన్నారు. ఆయన ద్వారా నువు ఈ ఉత్తరం అతనికి అందజేయగలవనుకుంటాను.

ఆ స్వామీ నేనూ ఒకే గురువుగారి శిష్యులం. ఆయన ఆధ్యాత్మికంగా చాలా ఉన్నత స్థితిని అందుకున్నారు. ఆయన దర్శనంవల్ల నీకు మేలు కలుగుతుంది. ఈ రెండో ఉత్తరం నిన్ను ఆయనకు పరిచయం చెయ్యడానికి పనికి వస్తుంది." అన్నారు. కాశీ చేరిన వెంటనే ప్రణవానంద స్వామి వారి నివాసానికి వెళ్ళాను. కేవలం ఒక అంగవస్త్రం కట్టుకున్న, కొంచెం లావుపాటి మనిషి ఒకాయన కొద్ది ఎత్తుగా ఉన్న వేదిక మీద పద్మాసనం వేసికొని కూర్చొని ఉన్నారు ఆయన పెదవుల మీద పరమానందానుభూతిని సూచించే చిరునవ్వు చిందులాడుతున్నది.... నేను వంగి ఆయన పాదాలు స్పృశిస్తూ, 'ప్రణవానంద స్వామివారు మీరేనండీ?' అని ప్రశ్నించాను.

ఆయన తల ఊపారు. "నువ్వు భగవతి బాబుగారి కొడుకువా?" ఆయన మాటలు నాన్నగారిచ్చిన ఉత్తరాన్ని నా జేబులోంచి తీసి యిచ్చే వ్యవధి లేకుండానే బయటకు వచ్చేశాయి. నేను ఆశ్చర్యపోతూనే ఆ పరిచయపత్రం ఆయనకు అందించాను. కాని అదింక అనవసరమే అనిపించింది.

"కేదార్ నాథ్ బాబుగారు ఎక్కడున్నారో తెలుసుకుంటాలే, నీకోసం" ఈ స్వాములవారు తమ దివ్యదృష్టితో మళ్ళీ నన్ను ఆశ్చర్యంలో ముంచెత్తారు. ఆ ఉత్తరం వేపు ఒకసారి చూసి మా నాన్నగారిని గురించి ఆప్యాయంగా మాట్లాడారు.

మా సంభాషణను చటుక్కున తుంచేసి స్వామివారు గంభీరమైన నిశ్చల రూపులుగా మారిపోయారు, ఒక నిగూఢమైన వాతావరణము ఆయన చుట్టూ ఆవరించింది. మొట్టమొదట, ఆసక్తికరమైనదేదో గమనించినప్పటి మాదిరిగా ఆయన కళ్ళు మెరిసాయి. తరువాత మందగించాయి. ఆయన అంత మితంగా మాట్లాడినందుకు నేను చిన్నబుచ్చుకున్నాను. మా నాన్నగారి స్నేహితుడిని కలుసుకోవడం ఎలాగో అప్పటి దాకా నాకు చెప్పనేలేదు. నాకక్కడ ముళ్ళమీద కూర్చున్నట్టు ఉంది. ఇంకే ఏం తోచక రవ్వంత విసుగుదలతో మేమిద్దరం మినహా ఖాళీగా ఉన్న ఆ గదిలో కలయజూశాను. ఆయన బల్లక్రింద పావుకోళ్ళు నాకు కనబడ్డాయి.

"చిన్నబాబూ! గాబరాపడకు. నువ్వు చూడదల్చినాయన ఒక్క అరగంటలో వచ్చి నిన్ను కలుస్తారు" మళ్ళీ ఆయన, అవగాహనకు అందని మౌనంలోనికి వెళ్ళిపోయారు. ముప్ఫయి నిముషాలు గడిచాయన్న సంగతి నా వాచీ తెలిపేసరికి స్వామి వారు లేచారు.



"కేదార్ నాథ్ బాబుగారు గుమ్మం దగ్గరకు వస్తున్నారనుకుంటాను" అన్నారాయన.... ఇక నేను మంచీ, మర్యాద చూడకుండా గదిలోంచి వచ్చేసి సగంమెట్లు దిగేసరికి సన్నగా, చామనచాయగా, మధ్య తరహ ఎత్తు ఉన్న ఒకాయన్ని కలిశాను. ఆయన తొందరలో ఉన్నట్లున్నారు.

"కేదార్ నాథ్ బాబుగారు మీరేనా?" ఉద్రేకంగా అడిగాను. "ఔను, నువ్వు భగవతి బాబుగారి కొడుకువి కదూ! నన్ను కలుసుకోవడానికి ఇక్కడ కాచుకొని ఉన్నావు కదూ!" స్నేహ పూర్వకమయిన చిరునవ్వుతో అడిగారాయన.

"ఏమండీ, మీరిక్కడికి రావడం ఎలా జరిగింది" చెప్ప శక్యంకాని విధంగా ఆయన అప్పుడు అక్కడ ఉండటంతో నాకు మతిపోయి నట్టయింది. విస్మయం కలిగింది.

"ఇవాళ అన్నీ విచిత్రంగానే జరుగుతున్నాయి. దాదాపు ఒక గంట కిందట నేను గంగలో స్నానం పూర్తి చేసుకునే సమయానికి ప్రణవానంద స్వాములవారు నా దగ్గరికి వచ్చారు. ఆ సమయంలో నేనక్కడ ఉన్నట్లు ఆయనకు ఎలా తెలిసిందో నాకు తెలియదు.

'భగవతి బాబుగారబ్బాయి మీకోసం మా యింట్లో ఎదురు చూస్తున్నాడు. మీరు నాతో వస్తారా?' అన్నారు. నేను సంతోషంగా సరేనన్నాను. మేమిద్దరం చెయ్యీ చెయ్యీ పట్టుకొని వస్తూ ఉండగా, పావుకోళ్ళతో నడుస్తున్న ఆ స్వామివారు, ఈ గట్టిబూట్లతో నడిచే నాకన్నా చురుగ్గా ముందుకు సాగడం ఆశ్చర్యం కలిగించింది.

'మా యిల్లు చేరడానికి మీకు ఎంతసేపు పడుతుంది?' అంటూ చటుక్కున ఆగి అడిగారు ప్రణవానందులు.

'సుమారు అరగంట', 'నాకిప్పుడు వేరే పని ఉంది' అప్పుడాయన చూపిన చూపులోని మర్మం నాకర్థం కాలేదు. "మిమ్మల్ని విడిచి నేను వెళ్ళాలి. మీరు వచ్చి నన్ను ఇంట్లో కలుసుకోవచ్చు. భగవతిగారబ్బాయి, నేను మీ గురించి ఎదురు చూస్తుంటాం' 'అలాకాదు' అని నేను అడ్డు చెప్పేలోగానే ఆయన టకటకా దూసుకు వెళ్ళిపోయి గుంపులో మాయమైపోయారు. నేను వీలయినంత త్వరలోనే ఇక్కడికి నడిచి వచ్చాను."

"అదేమిటి? ఆయన–ఆ ప్రణవానంద స్వామి వారు సుమారు ఒక గంట కిందట నే[illegible]డికి వచ్చినప్పటినుండి నాకళ్ళముందు నుండి కదలలేదే!"

అంటూ మొత్తం కథంతా ఆయనకు చెప్పేశాను. కేదార్‌నాథ్ బాబుగారి కళ్ళు ఆశ్చర్యంతో పూర్తిగా విప్పాయి. 'మనం ఈ భౌతిక ప్రపంచంలో ఉంటున్నామా లేక కలగంటున్నామా? నాజీవితంలో ఇలాంటి అద్భుతం చూస్తానని నేను ఊహించలేదు ఈ స్వామి ఒట్టి మామూలు మనిషే అనుకున్నాను. ఈయన అదనంగా మరో శరీరం సృష్టించుకొని దాంతో పనులు చేసుకుంటారని ఇప్పుడు తెలుస్తోంది" మేమిద్దరం కలసి ఆస్వాముల వారి గదిలోనికి ప్రవేశించాము....వచ్చినాయన తమ ముందు మోకరిల్లుతుండగా స్వాములవారు ప్రశ్నార్థకమైన చిరునవ్వుతో నావైపు తిరిగారు.

"ఇదంతా చూసి ఆశ్చర్యపోతావెందుకు? ఈ దృగ్విషయిక ప్రపంచంలో ఉన్న సూక్ష్మమైన ఏకత్వం నిజమైన యోగులముందు దాగలేదు నేను ఈ క్షణంలోనే,దూరంగా కలకత్తాలోవున్న నాశిష్యుల్ని కలుసుకొని వాళ్ళతో మాట్లాడగలను" అన్నారు.

* దూర దర్శన, దూరశ్రవణ శక్తులు

మన సత్వ శాస్త్రం ద్వారా యోగులు వెల్లడించిన శాస్త్రనియమాల చెల్లుబడిని గురించి భౌతిక శాస్త్రం, దాని పద్ధతిలో అది రూఢి చేస్తోంది. ఉదాహరణకు, మానవుడికి దూర దర్శన శక్తులున్నాయన్న సంగతి, 1934 నవంబరు 26వతేదీన రాయల్ యూనివర్సిటీ ఆఫ్ రోమ్ అనే విశ్వవిద్యాలయం నిరూపించడము జరిగింది. డా॥ గిసేప్ కాలిగారిస్ అనే స్నాయవిక మనో విజ్ఞాన శాస్త్రవేత్త (న్యూరో సైకాలజీ ప్రొఫెసరు) ఒక వ్యక్తి శరీరంలో నిశ్చితమైన కొన్ని భాగాలు నొక్కుతారు అప్పుడావ్యక్తి గోడకు అవతల వున్న వ్యక్తుల్నీ, వస్తువుల్నీ సూక్ష్మమైన వివరాలతో సహా వర్ణించి చెప్పారు. చర్మం మీద నిశ్చితమైన కొన్ని చోట్ల వంచలనం కలిగిస్తే ఆవ్యక్తికి అతీంద్రియానుభూతులు కలుగుతాయనీ మరో విధంగా చూడలేని వస్తువుల్ని చూడగలుగుతాడని డా॥ కాలిగారిస్ అక్కడి ప్రొఫెసర్లకు చెప్పారు. ఆవ్యక్తి గోడవతల ఉన్న వస్తువుల్ని చూసేటట్టు చెయ్యడానికి ప్రొ॥ కాలిగారిస్ అతని రొమ్ముకు కుడివేపు ఒకచోట వదిహేను నిమిషాలసేపు ఒత్తారు, శరీరంలో కొన్ని నిశ్చిత స్థానాల్ని వంచలింపజేసినప్పుడు మనుషులు కొన్ని వస్తువులను అంతకు పూర్వం తాము చూసినా చూడక పోయినా, ఎంతదూరమైన వాటినయినా చూడ గలుగుతారని డా॥ కాలిగారిస్ అన్నాడు.



* ఆంతః పరిశీలన

మానవుడు చాలకాలం చిత్తశుద్ధిగా అంతః పరిశీలన అభ్యసించాలి. జ్ఞానార్జనకు అత్యంత బాధాకరమైన మార్గమిది. ఆత్మ పరీక్ష చేసుకోడం, తన ఆలోచనల్ని నిర్విరామంగా పరిశీలన చేసుకోడం కఠోరమైన విదారక అనుభవం, అత్యంత ప్రబలమైన అహంకారాన్ని సైతం అదినుగ్గు చేస్తుంది. కాని నిజమైన ఆత్మవిశ్లేషణ ద్రష్టలను తయారు చేయడానికి గణిత శాస్త్రీయంగా పనిచేస్తుంది. 'ఆత్మాభి వ్యక్తి' విధానం పేరిట సాగే పైయక్తికాభిప్రాయ ప్రకటనలు, దేవుణ్ణి గురించీ విశ్వాన్ని గురించి తమకు తోచినవక్తిగతమైన వ్యాఖ్యానాలు చేయడానికి తమకు హక్కుందని విశ్వసించే అహంకారుల్ని తయారు చేస్తాయి.

అటువంటి దురహంకార పూరితమైన మౌలికత సమక్షంనుంచి సత్యం వినమ్రంగా వెళ్ళిపోతుందనడంలో సందేహం లేదు.

మనిషి బడాయిల్లోంచి బయటపడేవరకు శాశ్వత సత్యాన్ని అర్థం చేసు లేడు అనేక శతాబ్దాలుగా పంకిలమై ఉన్న మానవ మనస్సు లెక్కలేనన్ని ప్రపంచ మాయలతో కూడిన దుర్భర జీవితాన్ని సృష్టింస్తోంది. మొదట—తనలోని శత్రువులతో జరిపే పెనుగులాట ముందు, యుద్ధ, భూమిలో జరిగేపోరాటాలుతీసికట్టే అనిపిస్తాయి. ప్రచండబల ప్రయోగంతో జయించడానికి ఇవేమీ మానవ రూపంలో ఉన్న శత్రువులుకావు? విషవాయువుల్ని వెళ్ళగక్కే అస్త్రాలను బహునేర్పుగా అమర్చుకొని, అంతటా కమ్ముకొని, నిర్విరామంగా పనిచేస్తుండే, తామసిక కామాలనే యీ యోధులు మనల్ని అందరినీ హత మార్చడానికి చూస్తుంటారు.తన ఆదర్శాల్ని భూస్థాపితం చేసి సాధారణ ప్రారబ్ధానికి తల వంచినవాడు ఆలోచనా శూన్యుడు, అతడు నిర్వీర్యుడుగానూ, మూర్ఖుడు గానూ, అవమాన కరుడు గానూ తప్ప మరో రకంగా కనిపించడు.

* భారతదేశం—ఆధ్యాత్మిక జీవనం

సనాతన ఋషులు (ఋషులంటే ద్రష్టలు అని అర్థం; నిశ్చితంగా కాల నిర్ధారణ చేసి చెప్పడానికి వీలులేనంత సనాతనమైన వేదాలకు కర్తలు వీరు) ఆధ్యాత్మిక జీవనానికి సంబంధించి, నిర్మూలించడానికి శక్యంకాని పద్ధతులు ఏర్పరిచి వుంచారు. వాళ్ళ సనాతన సూక్తులు ఈ నాటికీ ఈ దేశానికి చాలు. భౌతిక వాదం ఎన్నికుతర్కాలు చేసినప్పటికీ యివి పాతబడిపోలేదు; అనాగరికమూ

కాలేదు. శిక్షణాత్మకమైన యీ బోధలు భారతదేశాన్ని యిప్పటికీ తీర్చిదిద్దుతున్నాయి వేలకొద్దీ సంవత్సరాలుగా — తత్తరపాటు పండితులు కాలగణన చేయడానికి ఖాతరు చేసే దానికంటె మిన్నగానే — సంశయాత్మకమైన కాలమే వేదాలవిలువను ఋజువు చేసింది .. ...

* వేదాలు — వాటి విశిష్టత

వేదాలు నాలుగు. అవి ఋగ్వేదం, యజుర్వేదం, అధర్వణ వేదం, సామ వేదం. ఈ పవిత్ర గ్రంథాల్లో సృష్టికర్త అయిన దేవుణ్ణి బ్రహ్మతత్వంగా అభివర్ణించడం జరిగింది. ప్రతి ఒక్క మానవుడిలో, ఈయన్ని జీవాత్మ అంటారు, బ్రహ్మ శబ్దం 'బృహ' ధాతువు నుంచి వచ్చినది. ఈ ధాతువుకు 'విస్తరించడం' అని అర్ధం దివ్యశక్తి దానంతట అది పెరగడం అంటే సృజనాత్మక కార్యకలాపంలోకి దూకడం అనే వైదికార్ధాన్ని తెలియజేస్తుంది యిది. ఈ విశ్వం, సాలీడు గూడు మాదిరిగా ఆయన సత్తాలోంచే వివర్తం చెందుతుందని (వికురుతే) చెబుతారు. ఎరుకతో, ఆత్మను బ్రహ్మ పదార్ధంలో లీనం చేయడం — అంటే జీవాత్మను పరమాత్మతో ఐక్యం చెయ్యడమే — వేదాల మొత్తం సారమని చెప్పవచ్చును.

వేదాల సార సంగ్రహమైన 'వేదాంతం' అనేకమంది పాశ్చాత్య ఆలోచనా పరులకు స్ఫూర్తినిచ్చింది.

ఫ్రెంచి చారిత్రకుడైన విక్టర్ కూజ్యాం యిలా అంటాడు "ప్రాచ్యదేశాల తత్వశాస్త్ర మహాగ్రంథాల్ని — అన్నిటికన్నామిన్నగా, భారతదేశ గ్రంథాల్ని — మనం సావధానంగా చదివినపుడు ప్రాచ్యదేశాల తత్త్వశాస్త్రం ముందు మోకరిల్లకుండానూ, మానవ జాతికి తొలికాలపు ఉనికిపట్టయిన ఆ ప్రాంత సర్వోత్తమ తత్త్వ శాస్త్రానికి కాణాచి అని గమనించకుండానూ ఉండలేనంతటి గాఢమైన అనేక సత్యాల్ని వాటిలో మనం కనిపెడతాం"

....భారత దేశపు అపార సాహిత్యంలో గ్రంథ కర్తృత్వం ఆరోపించి ఉండని గ్రంథాలు వేదాలే ! 'విద్‌' అనే ధాతువుకు - 'తెలుసు కోడం' అని అర్థం వేద మంత్రాలు అపౌరుషేయాలనీ (ఋగ్వేదం X 290, 9), అవి "అతి ప్రాచీన కాలం" నుంచి పారం పర్యంగా వస్తున్నవనీ ఉత్తరోత్తరా కొత్త భాషను ధరించాయని (III. 39, 2) ఋగ్వేదం చెబుతోంది. "ద్రష్ట" అయిన ఋషులకు యుగ యుగాంతరాల్లో దైవ ప్రేరణవల్ల వెల్లడి అయిన యీ వేదాలకు నిత్యత్వం అంటే "కాలబాధితమైన ప్రామాణికత" ఉందని చెబుతారు.



వేదాలు నాదరూపంలో వెలువడి ఋషులకు "నేరుగా వినిపించిన" (శ్రుతి)వి. అవే ప్రధానంగా మంత్ర పాఠరూపంలో ఉన్న సాహిత్యం. అందుచేత వేదాల్లో వున్న 10. 00 000 మంత్రాలూ (రెండేసి పాదాలున్నవి. అనేక వేల సంవత్సరాల పాటు బ్రాహ్మణ పురోహితుల మౌఖిక పఠన పాఠనాల వల్ల పరంపరాగతంగా వచ్చినవే కాని ఎవరో వ్రాసి పెట్టినవికావు కాయితమూ, రాయీ యీ రెండూ కాలగతిలో నశించే అవకాశ మున్నవే. ఒకరి దగ్గరినుండి మరొకరి దగ్గరికి అందించడానికి భౌతిక పదార్థం కంటే మనస్సే తగిన సాధనమని ఋషులు తెలుసుకున్నారు. కనుక వేదాలుగ యుగాంతరాల వరకూ నిలిచి వున్నాయి. "హృదయ ఫలకాల్ని" మించ గలిగినవి మరేమున్నాయి ?

వేద శబ్దాలకున్న ఒక నిర్దిష్టక్రమాన్ని (అనుపూర్వి) గమనించి, ధ్వనుల సంయోజనకూ (సంధి) అక్షరాల పరస్పర సంబంధానికీ (సంతానం) ఏర్పడిన ధ్వని శాస్త్ర నియమాల్ని అనుసరించి కంఠస్థం చేసుకున్న పాఠాల శుద్ధతను కొన్ని నిష్కృష్ట గణిత శాస్త్ర పద్ధతుల్లో నిరూపించి బ్రాహ్మణులు వేదాల మౌలిక పరిశుద్ధతను అత్యంత ప్రాచీన కాలం నుంచి పరిరక్షిస్తూ వచ్చారు. వేద శబ్దం లోని ప్రతీ అక్షరమూ కూడా విలక్షణత ఉన్నది. ఫలప్రదమైనది.

*విశ్వకవి రవీంద్రనాథ్ టాగూర్ ఆదర్శప్రియుడైన ప్రఖ్యాత భారతీయ శాస్త్రవేత్త, సర్ జగదీశ్ చంద్ర బోసును సంబోధిస్తూ ఆ వంగదేశపు మధుర గాయకుడు గానం చేసిన కవితకు తెలుగు అనువాదం.

"ఓ తపస్వీ ! సామ వేద మంత్రాల మేఘ గంభీర గర్జనతో "ఉత్తిష్ఠత నిరోధిత ! అంటూ మేలుకొలుపు. శాస్త్రాభిమానులైన జనాన్నీ కుతర్కాలతో కీచులాడుకునే పండితుల్నీ పిలిచి వ్యర్థ తర్కాల్ని విడిచి పెట్టమని చెప్పు ఆ మూఢ దాంభికుల్ని, సువిశాలమైన ప్రపంచంలోకి రావడానికి ప్రేరేపించు. నీ శిష్యబృందాన్ని కూడ ఆహ్వానించు: వాళ్ళు నీ యజ్ఞవేదికకు నలువైపులా ఒకే కట్టుగా నిలవాలి. దాంతో మన భారత దేశము తన సత్య స్వరూపాన్ని తిరిగి పొంది కర్తవ్య నిష్ఠతో, శ్రద్ధతో, ధ్యానంతో అప్రమత్త చిత్తురాలయి లోభహీన, ద్వంద్వ హీన, శుద్ధ, శాంతరూపం పొంది విశ్వగురు స్థానాన్ని మళ్ళీ అలంకరించాలి.

*సరళమైన విశ్వప్రేమమయ భావన ద్వారా అన్నిమతాల సాధువులూ దైవ సాక్షాత్కారం పొందారు కేవలం పరబ్రహ్మ నిర్గుణం— అంటే "గుణాలు

లేనిదే", అచిత్యం — అంటే "ఆలోచనకు అందనిదీ" కావడం వల్ల మానవుల ఆలోచనా ఆకాంక్ష ఆ పరబ్రహ్మకు జగజ్జననిగా ఒక మూర్తిమత్వమిస్తూ వచ్చాయి. వేదాల్లోనూ భగవద్గీతలోనూ వివరించిన విధంగా సాకారదైవ భావననూ కేవలం నిరాకార బ్రహ్మ భావననూ సమ్మేళనం చేయడం, హిందూతత్వ చింతనసనాతన కాలంలోనే సాధించిన విజయం ఈ "పరస్పర విరుద్ధాల సమన్వయం" హృద యాన్నీ బుద్ధినీ కూడ తృప్తి పరుస్తుంది భక్తిజ్ఞానమూ, ప్రధానంగా ఒకటే. ప్రపృత్తి అంటే దేవుణ్ని "ఆశ్రయించడం", శరణాగతి — అంటే దేవుడి దయనే నమ్ముకొని తనను తాను అర్పించు కోవడం, అన్నవి నిజంగా పరమోన్నత జ్ఞాన సాధనకు మార్గాలు,

* సాధువులకు ఉండే వినయం, దేవుణ్ణే ఏకైక ప్రాణంగానూ, న్యాయ మూర్తిగానూ భావించి, ఆయన మీదే సంపూర్ణంగా ఆధారపడి వున్నామన్న (శేష త్వం) గుర్తింపు వల్ల యేర్పడినది. భగవంతుడి స్వరూపమే ఆనందం కాబట్టి ఆయనతో భావైక్యం పొందినవాడు సహజమైన అపరిమితానందం అనుభవిస్తాడు. "ఆత్మా సంకల్ప శక్తి పొందే భావా వేశాల్లో మొదటిది ఆనందం."

పసి పిల్లలకు సహజమైన హృదయంతో జగన్మాతను చేరే అన్ని యుగాల భక్తులూ, ఆవిడ ఎప్పుడూ తమతో ఆడుకుంటూనే ఉంటుందని ధృవ పరుస్తారు..... దేవుని దృష్టిలో పెద్దా చిన్నా అన్న తేడా లేదు. అంత పరిపూర్ణ నైపుణ్యంతో ఆయన సూక్ష్మమైన అణువునే కనక నిర్మించి ఉండకపోతే ఆకాశం, అభిజిత్తూ స్వాతివంటి నక్షత్రాల్ని సగర్వంగా అలంకరించుకొని ఉండగలిగేదా ? ఇది "ముఖ్య మైనది" అది "ముఖ్యం కానిది" అన్న విచక్షణలు దేవుని కసలు తెలియనే తెలి యవు: లేకపోతే ఒక సూది కనక లేకపోతే మొత్తం విశ్వమంతా కుప్ప కూలి పోయేది ;

* సంస్కృత మంటే మెరుగు దిద్దినది, సంపూర్ణ మైనది" అని అర్థం. ఇండో యూరోపియన్ భాష లన్నిటికీ సంస్కృతం పెద్దక్క. దీని అక్షర లిపిని "దేవనాగరి" అంటారు. అంటే "దేవతానిలయం" అని వాచ్యార్థం. ప్రాచీన భారతదేశపు భాషాశాస్త్రవేత్త పాణిని, గణిత శాస్త్రీయంగానూ మనో వైజ్ఞానికం గానూ సంస్కృతానికున్న పరిపూర్ణతను ప్రశంసిస్తూ, 'నా వ్యాకరణం తెలిసినవాడు దేవుణ్ణి తెలుసుకుంటాడు' అన్నాడు. నిజానికి భాషోత్పత్తి క్రమానికి మూలం కనుక్కొకునేవాడు. చివరికి సర్వజ్ఞుడౌతాడు.



* ఆధ్యాత్మిక సాధన అనగా దేవుణ్ణి చేరేదారి ప్రాథమికమైన మార్గం.

* ప్రేమించే బంధువులతో బాటు మనకు వరాలన్నీ ప్రసాదించే– ఆ మాటకు వస్తే, ఈ జీవితాన్నే ప్రసాదించిన– దేవుణ్ణి అన్వేషించడానికి భక్తుడికి సంసార బంధం అవరోధం కలిగించేటట్టయితే అటువంటి అనుబంధం 'మాయ' అని హిందు వుల పవిత్ర గ్రంధాలు ఉద్బోధిస్తున్నాయి. ఏసుక్రీస్తు కూడ అలాగే చెప్పాడు, 'నాకంటే తన తల్లినిగాని, తండ్రినిగాని ఎక్కువగా ప్రేమించేవాడు నావాడు కావ డానికి అర్హుడు కాడు'

(మత్తయి 10 = 37 (బైబిలు)

* శంకరాచార్యులవారు- వారి గురుశిష్యులు:

భారతదేశపు దార్శనికులందరిలోకి గొప్పవారయిన శంకరాచార్యులవారు (శంకరులు) గోవిందయతి శిష్యులు; గోవిందయతి గౌడ పాదులవారి శిష్యులు. గౌడ పాదాచార్యుల 'మాండూక్యకారిక'కు శంకరులు వ్రాసిన వ్యాఖ్యానం సుప్రసిద్ధ మయినది. తిరుగులేని తర్కంతోనూ రమ్యమైన ప్రసన్నశైలితోనూ శంకరులు, వేదాంత తత్త్వాన్ని కచ్చితంగా అద్వైత (రెండూ కానటువంటి ఏకేశ్వర తత్త్వ) పరంగా వ్యాఖ్యానిందారు ఈ మహాద్వైతి భక్తిపరమయిన స్తోత్రాలుకూడ రచిం చారు. అమ్మవారిని ఉద్దేశించి సీరు చెప్పిన 'దేవ్యపరాధ క్షమాపన స్తోత్రం' లో మకుటం యిలా వుంటుంది– "కుపుత్రో జాయేతక్వచిదపి కుమాతా నభవతి"– దుర్మా ర్గులైన కొడుకులు యెందరో వున్నప్పటికీ దుర్మార్గురాలైన తల్లి యెక్కడా వుండదు.

శంకరుల శిష్యుడైన సనందుడు 'బ్రహ్మసూత్రాల' కు వేదాంత తత్త్వం భాష్యం రాశాడు. దాని వ్రాత ప్రతి అగ్నికి ఆహుతి అయిపోతే (దాన్ని ఒక్కసారి తిలకించిన) శంకరులు దాంట్లోవున్న ప్రతీమాటా తిరిగి శిష్యుడికి అప్పజెప్పారు. 'పంచపాదిక' అన్నపేర ప్రసిద్ధమైన యీ గ్రంథాన్ని యీనాటికీ పండితులు అధ్యయనం చేస్తూ వుంటారు

సనందుడనే ఈ శిష్యునికి మరో కొత్త పేరు రావడానికి చక్కని సంఘటన ఒకటి జరిగింది. ఒకనాడు ఏటిఒడ్డున కూర్చునివున్న సనందునికి అవతల ఒడ్డు

నుంచి శంకరులు తనను పిలుస్తూ వుండటం వినిపించింది. వెంటనే అతను నీళ్ళలోనికి దిగాడు. అతని విశ్వాసానికి పాదాలకూ కూడ ఊతగా శంకరులు తన సంకల్పబలంతో సుళ్ళుతిరిగే ఆ యేటిలో తామరపూలబారు ఒకటి సృష్టించేరు; అతను వాటిమీద నడుచుకుంటూ వెళ్ళి అవతల ఒడ్డుకి చేరాడు. అప్పటినుండీ అతనికి 'పద్మపాదుడ'నే పేరు వచ్చింది.

'పంచపాదిక' లో పద్మపాదుడు తన గురుదేవులకు భక్తి ప్రపత్తులతో బహుధా జోహార్లు అర్పించాడు. శంకరులే స్వయంగా చక్కగా యిలా వ్రాశారు. 'సద్గురువును పోల్చదగినది ఈ మూడులోకాలలోనూ మరొకటిలేదు. చింతామణి అన్నది నిజంగా ఉందనే అనుకున్నప్పటికీ అది యినుమును బంగారంగా మార్చగలదే కాని మరో చింతామణిగా మార్చలేదు. కాని పరమపూజనీయుడైన గురువు అలా కాకుండా తన పాదాల్ని ఆశ్రయించిన శిష్యుణ్ణి తనంతటివాణ్ణి చేస్తాడు. అంచేత సద్గురువు సాటిలేనివాడే కాదు, లోకాతీతుడు.

* యోగి— సర్వవ్యాపక శక్తులు:

యోగి తన జ్ఞానేంద్రియాన్ని ఉపయోగించకుండానే చూడటం, రుచిచూడటం వాసన గ్రహించడం, తాకడం, వినడం అన్నవి చేయడానికి అతనికి సామర్థ్యం కలిగించే సర్వవ్యాపక శక్తుల్ని గురించి 'తైత్తిరీయ అరణ్యకం' లో యిలా వర్ణించటం జరిగింది. "గుడ్డివాడు ముత్యానికి చిల్లి పొడిచాడు, వేళ్ళులేనివాడు దాంట్లోకి దారం యెక్కించాడు; మెడలేనివాడు దాన్ని ధరించాడు; నాలికలేనివాడు దాన్ని పొగిడాడు.

* మానవుడు- ఇంద్రియ సుఖాలు:

'మానవుడు జాగ్రదవస్థలో యింద్రియ సుఖాలు అనుభవించడానికి లెక్కలేనన్ని ప్రయత్నాలు చేస్తూవుంటాడు. ఇంద్రియాలన్నీ అలిసిపోయినప్పుడు చేతికందిన సుఖాన్ని కూడ మరచిపోయి తన స్వభావమైన ఆత్మలో విశ్రాంతి అనుభవించడానికి నిద్రపోతాడు' అని వ్రాశారు. మహావేదాంతి శంకరాచార్యులవారు. ఆ విధంగా అతీంద్రియానందం సాధించడం చాలా సులువు; ఎప్పుడూ రోతతోనే అంతమయే యింద్రియ సుఖాలకంటే అది చాల శ్రేష్టమయినది.



* శ్రీయుక్తేశ్వర్‌గారి ఉపదేశాలు:

చూడ్డానికి వచ్చిన వ్యక్తి ఎవరయినా మనోవికార ద్యోతకమైన కథ ఏదైనా చెప్పడానికి సాహసి చినట్లైతే గురుదేవులు (పరమహంస యోగానందగారి గురుదేవులు) గంభీరంగా మౌనం వహించేవారు. 'అందమైన ముఖం రెచ్చగొట్టే కొరడాలాంటిది; దాంతో దెబ్బలు తినేస్థితి తెచ్చుకోకండి' అని శిష్యులకు చెప్పారాయన.

ఇంద్రియాలకు బానిసలయిన వారు ప్రపంచంలో ఆనందం ఎలా పొందగలరు? అసహ్యమైన బురదలో పొర్లాడుతున్నప్పుడు ప్రపంచపు సూక్ష్మసుగంధాలు వాళ్ళకు సోకవు. పాంచ భౌతిక సుఖాలకు లోబడ్డ మనిషికి సున్నితమైన విచక్షణలన్నీ నశిస్తాయి.

మాయాప్రేరితమైన కామలాలస నుంచి బయట పడడానికి ప్రయత్నించే విద్యార్థులకు శ్రీ యుక్తేశ్వర్ గారు వాళ్ళను ఓర్పుగా అర్థం చేసుకొని తగిన సలహాలిచ్చేవారు.

'ఆబకు కాకుండా ఆకలికి న్యాయమైన ప్రయోజనం వున్నట్టే, తృప్తిపరచాలని కోర్కెల్ని రేపడానికి కాకుండా. కేవలం వంశాభివృద్ధికోసమే ప్రకృతి కామప్రవృత్తిని నెలకొల్పింది' అన్నారాయన 'చెడ్డ కోరికల్ని యిప్పుడు నాశనంచెయ్యి. లేకపోతే అవి సూక్ష్మశరీరం భౌతిక (శరీరం) కోశం నుండి విడివడ్డ తర్వాత కూడా నీతోనే వుంటాయి. శరీరం వాటిని నిగ్రహించుకోలేనంతగా బలహీనంగా వున్నప్పటికీ మనస్సు యెప్పుడూ నిరోధిస్తూ వుండాలి. వాటి ఆకర్షణ కనక క్రూరమయిన శక్తితో నీమీద దాడిచేస్తున్నట్లయితే నిష్పాక్షిక విశ్లేషణతోనూ, అజేయమయిన సంకల్పబలంతోనూ దాన్ని జయించాలి. ప్రకృతి సహజమయిన ప్రతివాంఛనూ జయించవచ్చు.

'మీశక్తుల్ని వదిల పరుచుకోండి. ఇంద్రియాలనే ఉపనదులన్నింటినీ తనలో కలుపుకునే విశాలమైన మహాసముద్రంలా ఉండండి. రోజురోజూ తలయెత్తే యింద్రియ వాంఛలు మీ అంతరంగంలో వున్న శాంతిని తొలిచేస్తాయి; అవి జలాశయానికున్న బెజ్జాలలాంటివి దానిలోని అమృత తుల్యమైన జలాన్ని భౌతిక వాదమనే ఎడారి నేలలో వ్యర్థమయ్యేటట్టు చేస్తాయవి. చెడ్డకోరికలనే శక్తివంతమయిన ప్రచోదక ఆవేగం మానవుడిసుఖానికి మహాశత్రువు ఆత్మనిగ్రహ

సింహంలా ప్రపంచంలో తిరగండి: ఇంద్రియ దౌర్బల్యాలనే కప్పలు చుట్టూచేరి మిమ్మల్ని తన్నకుండా చూసుకోండి

* నిద్రపోని సాధువు

పరమహంస యోగానంద నిద్రపోని సాధువును కలుసుకోడానికి కలకత్తా నుండి బయట దేరి తారకేశ్వర్ దగ్గర రణబాజ్‌పూర్ వెళ్ళారు. నిద్రపోని సాధువు అసలుపేరు రామగోపాల్ మజుందార్. ఆయనకూడ లాహిరీ మహాశయుల శిష్యులే.

'దివ్యత్వాన్ని లోపలే కనుక్కోగలిగేటట్టు చేసే యోగ విద్య అన్నిటికన్న ఉత్తమమైన మార్గ మనడంలో సందేహం లేదు. కాని ఈశ్వరుణ్ణి లోపలే కని పెట్టిన తరువాత త్వరలోనే బయటకూడ దర్శిస్తాం.'

'పవిత్ర మందిరాల్ని ఆధ్యాత్మిక శక్తికి కేంద్ర స్థానాలుగామన్నిస్తూండడం సముచితమైన పని' అన్నారు నిద్రపోని సాధువు.

12 సంవత్సరముల పరమహంస యోగానంద సమాధిస్థితి ప్రసాదించమని అడిగితే, 'నీశరీరం దానికింకా తయారు కాలేదు ఎక్కువ విద్యుద్బలం (ఎలక్ట్రికల్ వోల్టేజి) వల్ల చిన్న బల్బు యెలాపేలిపోతుందో అలాగే నీ నరాలు కూడ విశ్వ విద్యుత్ప్రవాహాన్ని భరించడానికి సిద్ధంగా లేవు ఇప్పటికిప్పుడే నేను నీకు బ్రహ్మ నందానుభవాన్ని కలిగించినట్లయితే నీలో కణ కణం నిప్పుల మీద ఉన్నట్లుగా మారిపోతావు.'

ఆ యోగివర్యులు సాలోచనగా యింకా యిలా అన్నారు. 'లెక్కలోకి రాదగని వాణ్ణి, ఏదో కాస్తంత ధ్యానం చేసినవాణ్ణి—దేవుణ్ణి సంతోష పెట్టడంలో కృతార్థుణ్ణి అయ్యానో లేదో కడపటి తీర్పునాటికి ఆయన దృష్టిలో నాకు యేపాటి విలువ వుంటుందోనని నేను అనుకుంటుంటే నువు నాదగ్గర బ్రహ్మజ్ఞానం కోరు తున్నావు'

'అయ్యా మీరు చాల కాలంగా దేవుణ్ణి అనన్య భక్తితో అన్వేషించడం లేదా?'

నేను అట్టే చేయలేదు. ఇరవై యేళ్ళపాటు నేను ఒక రహస్య గుహలో రోజుకు పద్దెనిమిది గంటల చొప్పున ధ్యానం చేశాను. ఆ తరువాత అంతకన్నా దుర్గమమైన గుహకి మారి అక్కడ యిరవై అయిదేళ్ళు వున్నాను. రోజుకు యిరవై



గంటలు యోగ సమాధిలో వుండేవాణ్ణి. ఎప్పుడూ ఈశ్వర సాన్నిధ్యంలోనే వున్నందువల్ల నాకు నిద్ర అవసరమయ్యేది కాదు. నాశరీరం మామూలు అచేతన స్థితిలో వచ్చే సంపూర్ణ ప్రశాంతిలోనే యెక్కువ విశ్రాంతి పొందేది.'

'కండరాలు నిద్రలో ప్రశాంతి పొందుతాయి, కాని గుండె, ఊపిరితిత్తులు రక్తప్రసరణ మండలం ఎడతెరిపిలేకుండా పని చేస్తూనే వుంటాయి;వాటికి విశ్రాంతి దొరకదు. అధిచేతన స్థితిలో వున్నప్పుడు అంతరింద్రియాలన్నీ విశ్వ శక్తి చేత విద్యుత్పూరితాలయి తాత్కాలికంగా నిశ్చలస్థితిలో వుండిపోతాయి. ఈ పరిస్థితుల్లో నాకు ఏళ్ళతరబడిగా నిద్రే అవసరం లేకపోయింది.'

....'ఇదుగో బాబూ! దేవుడంటే అనంతత్వమేనని తెలియడం లేదూ? నలభై ఐదేళ్ళధ్యానం లోనే ఆయన్ని సంపూర్ణంగా తెలుసుకోగలననుకోడం దురాశే అని చెప్పొచ్చు. అయితే కొద్దిపాటి ధ్యానం చేసినాకూడ అది మనని ఘోరమైన మృత్యు భయం నుంచీ మరణానంతరస్థితుల భయం నుంచి రక్షిస్తుందని బాబాజీ మనకి హామీ యిస్తారు. నీ ఆధ్యాత్మిక ఆదర్శాన్ని చిన్న చిన్న గుట్టల మీద నిలపకు; నిర్నిబద్ధమైన భగవత్ప్రాప్తి అనే లక్ష్య నక్షత్రం మీదే లగ్నం చేయి. కష్టపడి కృషి చేస్తే దాన్ని అందుకుంటావు' అన్నారాయన.

* సామవేదంలో సంగీత శాస్త్రం

సామవేదాలలో సంగీత శాస్త్రాన్ని గురించిన ప్రపంచంలో అత్యంత ప్రాచీనమైన విషయాలు ఉన్నాయి. భారతదేశంలో సంగీతాన్ని చిత్రకళనూ, నాటకాన్నీ దివ్య కళలుగా పరిగణిస్తారు. శాశ్వత త్రిమూర్తులయిన బ్రహ్మ విష్ణు మహేశ్వరులు మొట్ట మొదటి సంగీతకారులు. విశ్వనర్తకుడయిన నటరాజరూపంలో శివుడు విశ్వసృష్టి స్థితి లయాల ప్రక్రియల్లో అనంత ప్రకారాల తాళయుల్ని సృష్టించినట్టూ, బ్రహ్మ తాళాలు వాయించినట్టూ, విష్ణువు మృదంగం వాయించినట్టూ పవిత్ర గ్రంథాల్లో చెప్పటం జరిగింది.

జ్ఞానానికి అధినేత అయిన సరస్వతి తంత్రీ వాద్యాలన్నిటికీ తల్లి అయిన వీణను చేతపట్టి వాయిస్తున్నట్టుగా చిత్రించటం జరిగింది. విష్ణువు అవతరాల్లో ఒకడయిన కృష్ణుడు పిల్లంగోవి ఊదుతున్నట్టు హిందూ కళలో చిత్రించారు; దాని మీద అతడు మాయా జాలంలో సంచరించే మానవాత్మల్ని తన నిజమైన నివాసా

పాట వాయిస్తారు. నికి తిరిగి రమ్మని పిలుస్తున్నట్టుగా ఆనంద పారవశ్యం కలిగించే పాట వాయిస్తారు.

.......భారతదేశం సనాతన కాలంనుంచీ మానవ కంఠస్వరాన్ని పరిపూర్ణమైన ధ్వని పరికరంగా గుర్తిస్తోంది. అందువల్ల హైందవ సంగీతం చాలావరకు మూడు స్వర స్థాయిల శ్రేణికి (మంద్ర, మధ్య, తార స్థాయిలు) పరిమితం చేసుకుంది. ఆ కారణంవల్లనే స్వరసంగతి (ఏక కాలంలో వెలువడే స్వరాలమధ్య సంబంధం) కన్న స్వర మాధుర్యానికి (అనుక్రమ స్వరాల మధ్య సంబంధానికి) ప్రాముఖ్య మివ్వడం జరిగింది.

హిందూ సంగీతం ఆత్మాశ్రయమైన, ఆధ్యాత్మికమైన వైయక్తిక కళ; స్వర మేళన విభవంకన్న పరమాత్మతో వైయక్తిక సామరస్యంసాధించడం దానిలక్ష్యం. భారతదేశంలో ప్రఖ్యాత గీతాలన్నీ దైవ భక్తులు కూర్చినవే. సంగీత విద్వాంసుణ్ణి సంస్కృతంలో 'భాగవతుడు' అంటారు.—అంటే 'భగవంతుని కీర్తించేవాడు' అని అర్థం.

సంకీర్తనలు లేదా సంగీత సభలు, యోగ విద్యకు లేదా ఆధ్యాత్మిక శిక్షణకు స్ఫూర్తిమంతమయిన రూపాలు, వీటికి గాఢమైన ఏకాగ్రత, బీజప్రాయమైన ఆలోచనలోనూ నాదంలోనూ మనస్సును లగ్నం చేయడం—యీ రెండూ అవసరమవుతాయి. మానవుడు స్వయానా 'నాదబ్రహ్మ' (సృజనాత్మక శబ్దం)కు అభివ్యక్తి కాబట్టి ధ్వని అతనిమీద ప్రబలమైన సద్యః ప్రభావాన్ని ప్రదర్శిస్తుంది. ప్రాచ్య పాశ్చాత్యదేశాల మహనీయమైన ధార్మిక సంగీతం మానవుడికి ఆనందాన్ని ప్రసాదిస్తుంది. అతని షట్చక్రాల్లో ఒకదాన్ని తాత్కాలికంగా స్పందన శీలంగా జాగృతం చేస్తుంది. ఆనందభరితమైన ఆ క్షణాల్లో అతనికి తనకు మూలమైన దివ్య స్వరూపం లీలగా స్మృతికి వస్తుంది.

* క్రీస్తు పూర్వంనాటి ఋషుల శాస్త్రీయ విజ్ఞానం

ఋషుల శాస్త్రీయ విజ్ఞానం ఎంతో మహత్తరమైనది. జ్యోతిష సంబంధమైన వ్రతాధికాలు జరిపేందుకు శుభలగ్నాలు నిర్ణయించడానికి వీలైన బావయోగికమైన విలువగల ఖగోళశాస్త్ర పరిజ్ఞానంలో హిందువులు క్రీ.పూ 3100 నాటికే ఎంతో అభివృద్ధి సాధించారు. ఈ సంగతి సూచించే సునిశితమైన ఖగోళ శాస్త్ర విషయాలు మనకు కౌషీతకి బ్రాహ్మణంలో కనిపిస్తాయి. 1934 ఫిబ్రవరి నెల 'ఈస్ట్ వెస్ట్' పత్రికలో ప్రచురించిన ఒక వ్యాసంలో జ్యోతిషాన్ని గురించి లేదా వైదిక ఖగోళ



శాస్త్రగ్రంథావళి గురించి యిలా వుంది. "భారతదేశాన్ని ప్రాచీనదేశాలన్నిటికీ అగ్రస్థానంలో నిలిపి, విజ్ఞానాన్వేషకులకు దాన్ని పవిత్ర యాత్రాస్థలంగా చేసిన శాస్త్రీయ విజ్ఞానం దానిలో ఉంది. 'బ్రహ్మగుప్త' అనే పేరుతో ఖగోళ శాస్త్రగ్రంథం ఒకటి వుంది. ఇందులో మన సూర్యమండలంలో వున్న గ్రహాల సూర్యకేంద్రక చలనం, భూభ్రమణ మార్గవక్రత, భూమికున్న గోళాకృతి, చంద్రుడి పరావర్తనకాంతి, ప్రతీరోజూ భూమి తన అక్షం మీద చేసే పరిభ్రమణం, పాల పుంతలో స్థిర నక్షత్రాల ఉనికి, గురుత్వాకర్షణ నియమం వంటివేకాక, కోపర్నికస్, న్యూటన్ల కాలంవరకు పాశ్చాత్య ప్రపంచానికి తెలియని వైజ్ఞానిక యదార్థాల్ని యెన్నిటినో యీ గ్రంథంలో చర్చించడం జరిగింది

పాశ్చాత్య గణిత శాస్త్రాభివృద్ధికి ఉపకరించిన 'అరబ్బీ అంకెలు' అనేవి భారతదేశం నుంచీ అరబ్బుల ద్వారా యూరప్‌కు తొమ్మిదో శతాబ్దంలో వచ్చాయి. భారతదేశంలో యీ అంకె లేఖన ప్రణాళిక ప్రాచీనకాలంలోనే రూపొందింది.

* సనాతన ఋషి పుంగవుడు—పతంజలి

పతంజలి క్రీ.పూ. రెండో శతాబ్దివాడని చాలామంది విద్వాంసులు అంటున్నప్పటికీ ఆయన కాలం ఖచ్చితంగా తెలియకుండానే వుంది. ఋషులు బహు సంఖ్యాకమైన విషయాలెన్నిటిగురించో గ్రంథాలు వ్రాశారు. వారి అంతర్దృష్టి యెంత గాఢమంటే ఎన్ని యుగాలకయినా సరే వాటికి కాలదోషం పట్టించగల శక్తి లేదు. అయినప్పటికీ ఆ ఋషులు తమ గ్రంథాల్లో తమ జీవితకాలాన్ని పేర్కొనడానికి గాని, తమ మూర్తిమత్వాల ముద్రలు వాటిమీద వేయడానికి గాని యేమీ ప్రయత్నించకపోవడంతో తరువాతి చారిత్రకులకు విభ్రాంతి కలిగించింది. తమ స్వల్ప జీవిత కాలాలు అనంత జీవితంలో మెరిసే మెరపుల్లా తాత్కాలిక ప్రాముఖ్యం కలిగినవేననీ, సత్యం కాలాతీతమనీ, దానిమీద వ్యాపారముద్ర వెయ్యడం అసాధ్యమనీ, అదేమీ తమ సొంత ఆస్తి కాదనీ వారికి తెలుసు.

పతంజలి—యోగశాస్త్రము

పతంజలి యోగశాస్త్రాన్ని అష్టాంగ యోగమంటారు. అందులో మొదటి మెట్లు :

1) యమం : నైతికవర్తన,
2) నియమం : మత ధర్మానుష్ఠానం.

ఇతరుల్ని బాధపెట్టకపోవడం (అహింస),
ఎప్పుడూ సత్యాన్ని పాటించడం (సత్యం),
దొంగతనం చెయ్యకపోవడం (అస్తేయం),
ఇంద్రియాల్ని నిగ్రహించుకోవడం (బ్రహ్మచర్యం),
దేనికీ ఆశపడకపోవడం (అపరిగ్రహం)
అన్నవాటితో 'యమం' నెరవేరుతుంది.
శారీరక, మానసిక పరిశుద్ధత (శౌచం),
తృప్తి (సంతోషం),
స్వయం శిక్షణ (తపం),
పవిత్ర గ్రంథాల్ని అధ్యయనం చెయ్యడం (స్వాధ్యాయం),
దేవుడిమీద భక్తి (ఈస్వర ఫణిదానం)
'నియమం' కిందికి వస్తాయి.

తరువాతి మెట్లు ఏవంటే :- (3) ఆసనం (సరయిన భంగిమ)—వెన్నెముకను నిటారుగా నిలిపి శరీరాన్ని నిలకడగా,ధ్యానానికి అనువైన సుఖాసనంలో ఉంచాలి.

4) ప్రాణాయామం (సూక్ష్మమైన ప్రాణ ప్రవాహాలను అదుపులో ఉంచుకోడం);

5) ప్రత్యాహారం (జ్ఞానేంద్రియాల్ని బయటి వస్తువుల మీంచి వెనక్కి మళ్ళించుకోడం);

చివరి మెట్లు అసలు యోగం కిందికి వచ్చే అంగాలు :

6) ధారణ (ఏకాగ్రత) — మనస్సును ఒకే ఆలోచన మీద నిలిపి ఉంచడం;

7) ధ్యానం (దైవ చింతన);

8) సమాధి (అధిచేతనానుభవం)

ఈ అష్టాంగ యోగమార్గం అంతిమ లక్ష్యమయిన కైవల్యానికి చేరుస్తుంది. అందులో యోగి బుద్ధి గ్రాహ్యతకు అతీతంగా ఉండే సత్యాన్ని సాక్షాత్కరింప జేసుకుంటాడు.



మానవ ప్రవర్తనను చక్కదిద్దడానికి బౌద్ధమతంలో ఏర్పడ్డ 'అష్టాంగ మార్గం' దీనికి భిన్నంగా యిలా వుంది:-

1) సరయిన ఆదర్శాలు (సమ్యగ్దృష్టి),
2) సరయిన ఉద్దేశ్యం (సమ్యక్ సంకల్పం),
3) సరయిన మాట (సమ్యక్ వాక్కు),
4) సరయిన చేత (సమ్యక్ కర్మ),
5) సరయిన బతుకు తెరువు (సమ్యక్ ఆజీవిక),
6) సరయిన కృషి (సమ్యక్ వ్యాయామం),
7) (ఆత్మను గురించి) సరయిన జ్ఞాపకం (సమ్మక్ స్మృతి)
8) సరయిన సాక్షాత్కారం (సమ్యక్ సమాధి)

### సాధకులకు హెచ్చరిక:

ఆత్మతో ఐక్యమే ఏకైక లక్ష్యం కాని విభూతులు సంపాదించడం కాకూడదని, అవి కేవలం పవిత్రమార్గంలో పడే పుష్పాలు మాత్రమేనని పతంజలి పాఠకుణ్ని హెచ్చరిస్తాడు. శాశ్వత ప్రదాతను అన్వేషించాలి కాని ఆయన ప్రసాదించే సిద్ధుల్నికాదు; స్వల్ప ఉపలబ్ధులతో తృప్తిపడే అన్వేషకుడికి దేవుడు దర్శన మియ్యడు. అందువల్ల సరిగా సాధనచేసే యోగి తన సిద్ధుల్ని వినియోగించుకోకుండా జాగ్రత్తపడతాడు. లేకపోతే అవి మిథ్యాహంకారం కలిగించి కైవల్య చరమావస్థకు చేరకుండా ప్రక్కదారి పట్టిస్తాయి.

యోగి తన అనంత లక్ష్యాన్ని చేరినపుడు విభూతులు ప్రదర్శించవచ్చు, ప్రదర్శించకపోవచ్చు. అది అతని ఇచ్ఛానుసారం. అప్పుడతని చర్యలు అలౌకిక ఘటనా పరమయినా కాకపోయినా కర్మబంధం లేకుండానే జరుగుతాయి. వ్యక్తి పరమయిన అహంకారమనే అయస్కాంతం యింకా ఉన్నచోటే కర్మ అనే ఇనప రజనను ఆకర్షించడము జరుగుతుంది.

### రోగ నివారక శక్తులు

ముత్యాలూ, రత్నాలూ, లోహాలూ, కొన్ని ఓషధులూ మనిషి ఒంటికి తగిలి ఉన్నట్లయితే అవి శరీర కణాలమీద విద్యుదయస్కాంత ప్రభావం చూపిస్తాయి. కొన్ని మొక్కల్లోనూ, లోహాల్లోనూ, రత్నాల్లోనూ కూడ ఉండే కర్బనమూ,

ఇతర లోహ మూలకాలూ మానవ శరీరంలోనూ ఉన్నాయి. ఈ విషయాల్లో ఋషులు కనిపెట్టిన వాటిని యెప్పుడో ఒకనాడు శరీరశాస్త్రవేత్తలు కూడ ధృవ పరుస్తారు. విద్యుత్ ప్రాణ ప్రవాహాలతో సంవేదన శీలకమయిన మానవ శరీరం, ఈనాటికీ అన్వేషించని అనేక రహస్యాలకు కేంద్రం.

రత్నాలకూ, లోహపు కడియాలకూ శరీరంలోని రోగాన్ని నయంచేసే విలువ ఉన్నప్పటికీ శ్రీ యుక్తేశ్వర్ గారు వాటిని సిఫారసు చెయ్యడానికి మరో కారణం కూడ లేకపోలేదు. సద్గురువులు తాము రోగ నివారకులుగా కనిపించాలని ఆశించరు. దేవుడే రోగ నివారకుడు; అంచేత సాధువులు, ఈశ్వరుడి దగ్గర్నుంచి తాము సవినయంగా అందుకున్న శక్తుల్ని తరచు రకరకాల ముసుగులలో మరుగు పరుస్తారు. సాధారణంగా మానవుడు ప్రత్యక్ష వస్తువుల మీదే విశ్వాసం పెట్టుకుంటాడు. రోగం నయం కావడానికని మా గురుదేవుల దగ్గరికి ఎవరైనా వచ్చినప్పుడు ఆయన వాళ్ళకి దండ కడియం వేసుకోమనో, రత్నం ధరించమనో సలహా ఇస్తుండేవారు. వాళ్ళలో విశ్వాసం రగుల్కొల్పడానికీ, వాళ్ళ దృష్టిని తమమీంచి మళ్ళించడానికీ అలా చేస్తూ ఉండేవారు. కడియాలకూ, రత్నాలకూ విద్యుదయస్కాంత సంబంధమయిన రోగ నివారక శక్తులు అంతర్గతంగా ఉన్నప్పటికీ వాటితోపాటు గురుదేవుల గుప్తమయిన ఆధ్యాత్మిక ఆశీర్వాదాలు కూడ కలిసి ఉండేవి.

## క్రియాయోగం

క్రియా శబ్దానికి సంస్కృత మూలధాతువు 'కృ'—అంటే చెయ్యడం, ప్రతిస్పందించడం అని అర్థము. కార్యకారణాల ప్రకృతి నియమమయిన "కర్మ" శబ్దంలోనూ అదే ధాతువు కనిపిస్తుంది. ఈ ప్రకారంగా క్రియాయోగం 'ఒకానొక చర్యద్వారా పరమాత్మతో పొందే కలయిక (సంయోగం)" అవుతుంది. ఈ ప్రక్రియను నిష్ఠగా సాధనచేసే యోగి కర్మనుంచి—అంటే కార్యకారణ సహతౌల్యాల నియమబద్ధ శృంఖలం నుంచి—క్రమక్రమంగా విముక్తి పొందుతాడు.

యోగ సంబంధమయిన కొన్ని ప్రాచీన నిషేధాల మూలంగా జన బాహుళ్యం కోసం ఉద్దేశించిన పుస్తకంలో క్రియా యోగానికి పూర్తి వివరణ ఇయ్యకూడదు. ఇక్కడ మాత్రం స్థూలమయిన ప్రస్తావన చాలు.



క్రియా యోగమన్నది మనిషి రక్తంలో ఉన్న కర్బనాన్ని హరింపజేసి అక్సిజన్ (ప్రాణవాయువు/అమ్లజని)తో నింపే ఒకానొక మానసిక-శారీరక ప్రక్రియ. మెదడులోనూ, వెన్నెముకలోనూ ఉన్న కేంద్రాల్ని నవశక్తితో నింపడానికి ఈ అదనపు అక్సిజన్ అణువులు ప్రాణశక్తి ప్రవాహంగా మారిపోతాయి. ఒంట్లో కలుషరక్తం జమకాకుండా ఆపి, యోగి కణజాలాల క్షయాన్ని తగ్గించడం కాని ఆపెయ్యడం కాని చేస్తాడు. ప్రగతి సాధించిన యోగి తన శరీరకణాల్ని శక్తిగా మార్చేస్తాడు. ఎలిజా, ఏసు, కబీరు, ఇతర ప్రవక్తలు క్రియాయోగాన్నో ఆమాదిరి మరో ప్రక్రియనో ఉపయోగించడంలో ప్రవీణులైన పూర్వులు. దాంతో వారు తమ శరీరాల్ని తమ సంకల్పానుసారంగా ప్రత్యక్షమూ చేసేవారు, అదృశ్యమూ చేసేవారు.

భగవద్గీతలో కృష్ణ భగవానుడు క్రియాయోగాన్ని రెండుసార్లు ప్రస్తావించాడు. ఒక శ్లోకంలో ఇలా ఉంది. "పీల్చే గాలిని విడిచే గాలిలో వేల్చి, విడిచే గాలిని పీల్చేగాలిలో వేల్చి, రెండు శ్వాసల్నీ తటస్థీకరిస్తున్నాడు యోగి. ఆ ప్రకారంగా అతడు ప్రాణాన్ని గుండెనుంచి విడుదల చేసి ప్రాణశక్తిని తన అదుపులో ఉంచుకుంటాడు." దీని తాత్పర్యం యేమిటంటే, "యోగి ఊపిరితిత్తులూ గుండే చేసే పనిని నెమ్మది చేసి దాని ద్వారా అదనంగా ప్రాణం (ప్రాణశక్తి) సరఫరా అయ్యేటట్టు చేసుకొని శరీరంలో తరుగుదలను (జీవకణక్షయాన్ని) అరికడతాడు. అంతే కాకుండా అతడు అపానాన్ని (విసర్జక ప్రవాహం) అదుపు చేసుకోవడంవల్ల ఒంట్లో పెరుగుదలకు సంబంధించిన మార్పుల్ని కూడ అరికడతాడు. ఈ ప్రకారంగా తరుగుదలనూ, పెరుగుదలనూ నిలుపుజేసి యోగి ప్రాణశక్తిని అదుపులో ఉంచుకోవడం నేర్చుకుంటాడు."

గీతలో మరో శ్లోకం ఇలా చెబుతోంది. "కనుబొమల మధ్య బిందువుమీద చూపు నిలపడము వల్లా, ముక్కులోనూ ఊపిరితిత్తుల్లోనూ (ఆడే) ప్రాణ, అపాన వాయువుల సమ ప్రవాహాల్ని తటస్థీకరించడం వల్లా సర్వోన్నత లక్ష్యాన్ని సాధించ బూనిన ధ్యానయోగి (ముని) బాహ్య విషయాలనుంచి వెనక్కి తగ్గగలుగుతాడు, మనస్సునూ బుద్ధినీ అదుపు చేయగలుగుతాడు. కోరికనూ, భయాన్నీ క్రోధం గెలగుతాడు, శాశ్వతంగా విముక్తుడవుతాడు."

నాశరహితమైన ఈ యోగాన్ని వెనకటి ఒక అవతారంలో ప్రాచీన జ్ఞాని

అయిన వివస్వతుడికి ఉపదేశించిన వాణ్ని నేనేననీ, ఆ వివస్వతుడు మహాధర్మ శాసకుడయిన మనువుకు ఉపదేశించాడనీ కూడ కృష్ణుడు చెబుతాడు. ఆ మనువు సూర్యవంశ స్థాపకుడయిన ఇక్ష్వాకుడికి ఉపదేశం చేశాడు. ఆ విధంగా ఋషులు రాజయోగాన్ని ఒకరి దగ్గరి నుంచి మరొకరికి అందిస్తూ భౌతికవాద యుగాలు వచ్చే వరకు కాపాడారు. ఆ తరువాత పురోహితుల గోపన ప్రవృత్తివల్లా మానవుడి ఉపేక్షవల్లా యీ పవిత్రవిద్య క్రమంగా అందుబాటులో లేకుండాపోయింది.

యోగవిద్యకు ప్రప్రథమ శాస్త్రకారుడైన ప్రాచీనఋషి పతంజలి క్రియా యోగాన్ని రెండుసార్లు పేర్కొంటూ ఇలా రాశాడు. "శరీర వ్యాయామం, మనో నిగ్రహం, ఓం కారము మీద ధ్యానం కలిసి క్రియా యోగమవుతుంది." ధ్యానంలో వినవచ్చే ఓం కారమనే యదార్థమైన విశ్వనాదమే దేవుడని అంటాడు పతంజలి

ఓంకారం — సృజన శీలక శబ్ద బ్రహ్మం।
— స్పందనాత్మక బ్రహ్మాండ చాలక యంత్ర ధ్వని।
— ఈశ్వర సత్తకు ప్రత్యక్ష సాక్షి।

యోగసాధన కొత్తగా మొదలుపెట్టిన వాడు సైతం, అద్భుతమైన ఓం కార నాదాన్ని త్వరలోనే తనలోపల వినవచ్చు. ఆనందమయమైన ఈ ఆధ్యాత్మిక ప్రోత్సాహంతో అతడు తాను ఊర్ధ్వలోకాలతో సంపర్కం పెట్టుకున్నానని నమ్మ గలుగుతాడు.

క్రియా యోగప్రక్రియ—అంటే ప్రాణశక్తి నియంత్రణ గురించి పతంజలి రెండోసారి ఇలా ప్రస్తావించాడు. "ఉచ్ఛ్వాస నిశ్వాసాల గతిని విచ్ఛేదించడం జరిగే ప్రాణాయామంవల్ల ముక్తిని సాధించవచ్చు."

క్రియా యోగి తన ప్రాణశక్తిని వెన్నుబాములోని ఆరు కేంద్రాల్ని (ఆజ్ఞా, విశుద్ధ, అనాహత, మణిపూర, స్వాధిష్ఠాన, మూలాధారాలనే షట్చక్రాల్ని) చుట్టి కిందనుంచి పైకీ, పైనుంచి క్రిందకి పరిభ్రమించేటట్టు మానసికంగా నిర్దేశిస్తాడు. ఈ ఆరు చక్రాలు విరాట్పురుషుడికి సంకేతమయిన రాశిచక్రంలోని పన్నెండు రాసులకు సమానం. మానవుడి సున్నితమైన వెన్నుబాము చుట్టూ అర నిమిషం పేషు పరిభ్రమించే శక్తి అతని పరిణామంలా సూక్ష్మ ప్రగతిని సాధ్యం చేస్తుంది. ఒక్క క్రియకు పట్టే ఆ అరనిమిష కాలం ఒక సంవత్సరంలో జరిగే ప్రకృతి సహజమైన ఆధ్యాత్మిక వికాసానికి సమానం



సర్వద్రష్ట అయిన ఆధ్యాత్మిక నేత్రమనే సూర్యుని చుట్టూ పరిభ్రమించే ఆరు (ధ్రువత్వ గణనరీత్యా పన్నెండు) ఆంతరిక నక్షత్రరాశులుగల మానవుడి సూక్ష్మశరీర వ్యవస్థకు భౌతిక సూర్యునితోనూ, పన్నెండు నక్షత్ర రాశులతోనూ పరస్పర సంబంధమున్నది. ఆ ప్రకారంగా మానవులందరూ ఒక అంతరిక విశ్వం వల్లా, ఒక భౌతిక విశ్వంవల్లా ప్రభావితులవుతూ ఉంటారు. మానవుడి లౌకిక, పారలౌకిక పరిసరం, పన్నెండేసి సంవత్సరాల ఆ వృత్తుల్లో అతన్ని, అతని సహజ మార్గంలో ముందుకు నెట్టుతుందని సనాతన ఋషులు కనిపెట్టారు. మానవుడికి తన మేధ, విశ్వ చైతన్యాన్ని అభివ్యక్తీకరించడానికి తగినంతగా పరిపూర్ణ వికాసం పొందేటట్టు చేయడానికి పది లక్షల సంవత్సరాల సహజ, వ్యాధిరహిత పరిణామం అవసరమని పవిత్ర గ్రంథాలు నొక్కి చెబుతాయి.

ఎనిమిదిన్నర గంటం సాధన చేసిన వెయ్యిక్రియలు యోగికి ప్రకృతి సహజమైన పరిణామంలో వెయ్యి సంవత్సరాలలో వచ్చే ఫలితాన్ని ఒక్కరోజులో కలిగిస్తాయి. 3 65.000 సంవత్సరాల పరిణామం ఒక్క ఏడాదిలో వస్తుంది.... క్రియా యోగసాధన చేసే యోగులు ఒక గురువు మార్గ దర్శకత్వంలో గాఢ సాధనవల్ల జనించే శక్తికి తట్టుకోడానికి తమ శరీరాల్నీ, మెదడునూ జాగ్రత్తగా సిద్ధం చేసుకుంటారు.... ఒకవేళ ఏ యోగి అయినా సంపూర్ణ సాక్షాత్కారం సాధించక ముందే చనిపోయినట్లయితే వెనుకటి క్రియాసాధన బాపతు సత్కర్మను తనవెంట తీసుకుపోతాడు. కొత్తజన్మలో అతడు స్వాభావికంగానే అంతిమ లక్ష్యంవైపు ఆకృష్టుడవుతాడు

* లాహిరీ మహాశయుల సందేశం

నువ్వెవరి వాడివీ కావనీ ఎవ్వరూ నీ వారు కారనీ గుర్తుంచుకో ఎప్పుడో ఒకనాడు హఠాత్తుగా ఈ ప్రపంచంలో ప్రతిదీ వదిలేసి పోవలసి ఉంటుందని తెలుసుకో—కాబట్టి దేవుడితో ఇప్పుడే పరిచయం చేసుకో."

"ప్రతిరోజూ దైవానుభూతి అనే గాలి గుమ్మటంలో ఎగురుతూ రాబోయే మృత్యువనే సూక్ష్మయాత్రకు తయారవు. మాయవల్ల నిన్ను నువ్వు మాంసాస్థుల కట్టగా చూసుకుంటున్నావు. నిజానికిది కష్టాలు కాపురం చేసే గూడు మాత్రమే. ఎడతెరిపి లేకుండా ధ్యానం చెయ్యి. ఏ విధమైన క్లేశమూ లేని అనంతత్వంగా నిన్ను నువ్వు తొందరగానే చూసుకుంటావు శరీరానికి బందీవై ఉండటం మానెయ్యి.

క్రియాయోగమనే రహస్య కీలకాన్ని ఉపయోగించి శరీరం నుంచి తప్పించుకొని పరమాత్మ సన్నిధిలోకి పారిపోవటం నేర్చుకో."

* శ్రీ యుక్తేశ్వర్‌గారి పునరుత్థానం

పరమహంస యోగానంద్‌గారి గురువులు శ్రీ యుక్తేశ్వర్‌గారు 81 సంవత్సరముల వయస్సులో 1936 మార్చి 9వ తేదీన రాత్రి 7.00 గంటలకు మహాసమాధి చెందారు. తరువాత 3 నెలలకు యోగానంద బొంబాయిలో హోటలు గదిలో కూర్చొని ఉండగా కిటికీలోంచి వీధికి అవతలవేపు ఎత్తయిన ఒక భవనం పైకప్పు మీద కృష్ణభగవానుడు దర్శనమిచ్చారు — చిరునవ్వు చిందిస్తూ పలకరింపుగా తల ఆడిస్తూ ఆ దివ్య మంగళ విగ్రహుడు నావేపు చెయ్యి ఊపాడు. కృష్ణ భగవానుడిచ్చిన సందేశాన్ని నేను అర్థం చేసుకోలేక పోవడంతో ఆయన ఆశీః సంకేతంతో అంతర్ధాన మయ్యాడు. అద్భుతమైన దివ్యానుభూతితో ఉత్తేజం పొందిన నాకు ఏదో ఆధ్యాత్మిక సంఘటన జరుగ బోతున్నదన్న అభిప్రాయం కలిగింది. 1936 జూన్ 19వ తేదీ మధ్యాహ్నం 3. 00 గంటలకు – అంటే శ్రీకృష్ణుడు దర్శనమిచ్చిన వారం రోజులకు – బొంబాయి హోటల్లో నేను మంచం మీద కూర్చొని ధ్యానం చేసుకుంటూ ఉండగా ఒకానొక దివ్య కాంతి నాకు బాహ్యస్మృతి కలిగించింది నేను కళ్ళువిప్పి ఆశ్చర్యంగా చూస్తూ ఉండగా నాగది ఒక విచిత్ర ప్రపంచంగా మారిపోయింది. సూర్యకాంతి ఒక దివ్య తేజస్సుగా పరిణామం చెందింది. ఎదురుగా రక్తమాంసాలతో నిండిన శ్రీయుక్తేశ్వర్ గారి విగ్రహాన్ని చూసే సరికి ఆనంద తరంగాలు నన్ను ఉక్కిరి బిక్కిరి చేసేశాయి.

"గురుదేవా ! మీరు మీరేనా ? పూరీ ఇసక పర్రలో పూడ్చి పెట్టిన శరీరం మాదిరి మరో దేహం ధరించి వచ్చారా మీరు ?"

"నేను వాణ్ణే నాయనా ! ఇది రక్తమాంసాలున్న శరీరం. నేను దీన్ని సూక్ష్మ శరీరంగా చూస్తున్నప్పటికీ నీ దృష్టికిది భౌతికమైనదే. విశ్వాణువుల్లోంచి నేను పూర్తిగా కొత్త శరీరాన్ని సృష్టించుకున్నాను. ఇది ముమ్మూర్తులా నీ స్వప్న లోకంలో పూరీలో స్వప్న భూమిలో నువు పూడ్చి పెట్టిన విశ్వ స్వప్న భౌతిక శరీరాన్ని పోలివున్నదే. నిజం చెప్పాలంటే నేను పునరుత్థానం చెందాను. — భూమిమీద కాదు కాని ఒక సూక్ష్మంలోకంలో. ఎప్పటికో ఒకనాటికి మహా నీ ప్రియతములు అక్కడికి వచ్చి నాతో పాటు ఉంటారు. ...



....భగవంతుడు మానవుడి ఆత్మను వరుసగా మూడు కోశాల్లో పొందుపరచి ఉంచాడన్న సంగతి నువు పవిత్రగ్రంథాల్లో చదివావు — భావం లేదా కారణ శరీరం; మానవుడి మానసిక భావోద్రేక ప్రకృతికి స్థానమైన సూక్ష్మశరీరం స్థూలమైన భౌతిక శరీరం, భూమిమీద మనిషికి భౌతిక జ్ఞానేంద్రియాలు ఏర్పడి వుంటాయి. సూక్ష్మలోక వ్యక్తి తన చేతనతోనూ, అనుభూతులతోనూ ప్రాణ కణిక (లైఫ్‌ట్రాన్) లతో తయారైన శరీరంతోనూ పని చేస్తాడు. కారణ శరీర్య ధరించినవాడు భావాల ఆనందమయ లోకాల్లో ఉండిపోతాడు. ...

....మానవుడి ఆత్మ ఒకటో, రెండో, మూడో శరీరమనే సీసాల్లో బంధించి ఉంది అజ్ఞానమూ కోరికలూ అనే బిరడాలతో గట్టిగా బిగించి ఉన్నంత కాలం అతడు పరమాత్మ సాగరంలో లీనం కాలేడు. "చావు" అనే సుత్తి దెబ్బతో స్థూల భౌతిక కాయం బద్దలయి పోయినప్పుడు సూక్ష్మ కారణ శరీరాలనే తక్కిన తొడుగులు రెండూ సర్వవ్యాప్త ప్రాణమనే పరమాత్మతో సచేతనంగా లీనం కావడానికి వీలు లేకుండా ఆత్మను నిరోధించడానికి ఇంకా మిగిలి ఉంటాయి. జ్ఞానం ద్వారా నిష్కామం అలవడినపుడు దాని శక్తి తక్కిన కోశాల్ని రెండిటినీ ఛిన్నాభిన్నం చేసేస్తుంది. చివరికి స్వల్పమయిన మానవాత్మ విముక్తమయి అమేయ సమృద్ధమయిన పరమాత్మతో ఐక్యమవుతుంది.

పరమగురు చరణ సన్నిధి

'పరమగురు చరణ సన్నిధి' శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారు వ్రాసిన 'At the Feet of the Master' అను గ్రంథమునకు అనువాదము. 1910 లో ముద్రించబడిన ఆంగ్లపుస్తకము 1966 నాటికి 29 ముద్రణలు పూర్తి అయి గ్రంథములు ప్రపంచము నంతటినీ వ్యాపించినవి. వసంతా ఇన్స్టిట్యూట్ అనకాపల్లివారు 1983 నాటికి మూడు ముద్రణలు తెలుగులో పూర్తిచేసి ప్రచారము చేయుచుండిరి.

'ప్రథమ జ్ఞాన దీక్ష' పొందనర్హులను చేయు నుపాయము బోధించిన యీ ఉత్తమమైన గ్రంథము దివ్యజ్ఞాన వాఙ్మయములో ప్రస్థానత్రయ' మను మూడు గ్రంథములలో ప్రథమ గ్రంథమని చెప్పెదరు.

మహీపీఠము అనే గ్రంథంలో చెప్పబడినట్టుగా భగవత్తత్త్వము గురించి భగవంతునికి మనిషికి గల సంబంధము గురించి మానవాళికి తెలిపి వారిని సంస్కా-

రించుటకు. భగవంతునిచే నియమింపబడిన మహాపురుషులకు మానవాళికీ మధ్య గురువులు గలరు వారు ప్రపంచ దేశాలన్నిటిలోను తమ దివ్యజ్ఞాన సమాజము విస్తరించి తమ కేంద్రకార్యాలయమును కొన్నివిదేశాలలో పెట్టి చివరికి కర్మభూమియైన భారతభూమియే కేంద్రస్థానముగా నిర్ణయించుకొని టిబెట్ దగ్గఱలో గల హిమాలయా పర్వతాలను తమ స్థావరంగా స్థిరపఱచుకొని తమ కార్యకలాపాలను కొనసాగించారు. పరమగురువుల ఆదేశానుసారం అనీబిసెంట్ వంటి 'పెద్దలు' తమ సంస్థకు భవిష్యత్ గురువును కనుగొనుటకు తీవ్రప్రయత్నాలు చేశారు. ఆ కాలంలో మన రాష్ట్రంలో దివ్యవిజ్ఞాన సమాజానికి ఎంతో ఆదరణ ఉండేది. సమాజ కార్యక్రమాలు చురుకుగా సాగేవి. సమాజ 'పెద్దలు' భవిష్యత్ గురువును వెదుకుటకు ఊరూరా తిరిగేవారు అవిధంగా 'పెద్దలు' మదనపల్లి (చిత్తూరుజిల్లా) 1908 లో వచ్చినప్పుడు ఒక 13 సం॥ల బాలునిమీద వారి దృష్టిపడగానే వారికి అంగీకార సూచకంగా అంతరంగా సంకేతాలు అందాయి. అప్పుడు వారు ఆనందంతో ఆ బాలుని తండ్రికి వివరంగా తమ దృక్పథం తెలియజేయగానే ఆయన తమ ఏ సమాజానికి సభ్యుడో ఆ సమాజానికి అధినేతగా, తన కన్నబిడ్డని చేస్తామన్నందుకు, ఆ అదృష్టం తనకు లభించినందుకు పొంగిపోయి తన పుత్రుని వారికి అప్పగించేందుకు అంగీకరించాడు 11 గురు ఉన్న తన సంతానంలో 8వ సంతానం సద్వినియోగపడుతున్నందుకు తృప్తిచెందారు. కాని ఆబాలుడు తను ఒంటరిగా వెళ్ళడానికి నిరాకరించాడు. తన సోదరుని కూడ పంపితే తను వస్తానన్నాడు. ఆ విధంగానే తల్లిదండ్రులు తమ యిద్దరు కుమారులను సమాజశ్రేయస్సుకు అప్పగించారు పరమగురువులు ఆ అబ్బాయి (జిడ్డు కృష్ణమూర్తి)ని తీర్చిదిద్దే బాధ్యతను అనీబిసెంటు అమ్మగారికి అప్పజెప్పారు. ఆ అబ్బాయి ఆ వయస్సునుండే లోకానికి గురువుగా గల అర్హతలను సంపాదించడము మొదలుపెట్టాడు. వేదాలనూ సకల శాస్త్రాలనూ క్షుణ్ణంగా అభ్యసించాడు. పరమగురువుల ఆశీస్సులు, అభినందనలు పొంది చివరికి వారసత్వం పొందాడు. మధ్యలో తనతోటి అన్నదమ్ముని మరణం తనను కొంత క్రుంగదీసినా అకారణంగానే ఆధ్యాత్మికంగా ఎంతో ఉన్నతమైన స్థాయికి యెదిగి తనను తీర్చిదిద్దిన వారిని ఆశ్చర్యపఱచాడు. చిన్నవయస్సులోనే పువ్వుపుట్టగానే పరిమళం వెదజల్లినట్లు తన ప్రతిభను 'పరమగురువు చరణ సన్నిధి' పుస్తకం వ్రాయటం ద్వారా వెల్లడిచేశాడు. ప్రపంచ వ్యాప్తంగా ఆయన అభిమానులు తమ యావదాస్తులన్నీ ఆయన ఆధిపత్యంలోని తూర్పుదేశపు ధ్రువతార



(Star of the east) అను సంస్థకు ధారపోశారు. లెక్కలేనంత ఆస్తులతో ఆ సమాజం ఉధృతమయిన ప్రచారం జరిపేది. ఆయన ఉపన్యాసం విని సర్వం వదలి ఆయనతోపాటు అనుసరించేవారు యెక్కువయ్యారు. ప్రపంచవ్యాప్తంగా ఆయనకు ఆహ్వానాలు అందేవి. ఆయన ప్రపంచ దేశాలన్నీ తిరుగుతూ ఉపన్యాసాలిచ్చేవారు. అనీబిసెంటు అమ్మగారు, కర్నల్ అల్కాటు, లెడ్ బీటరువంటి 'పెద్దలు' తము నాటిన విత్తనం వృక్షమయి ఫలాలనివ్వడం చూసి తమ కృషి ఫలించినందుకు గర్వపడేవారు. ఆ సమాజ సభ్యులు, ఆయనతో తిరిగే శిష్యులు ఆయన భావాలను దివ్యజ్ఞాన సమాజ పరిధిలోనే ఉండేటట్టు చూసుకునేవారు. ఆ సంబంధిత మనస్తత్వం ఆయనకు నచ్చేదికాదు. కాని 'పెద్దలు' కూడ దివ్యజ్ఞాన సమాజభావాల పరిధిలోనే ఉండేటట్టుగా ప్రోత్సహించేవారు. లోకమంతా తన పాదాక్రాంతులయి తననే 'కర్త'గా భావిస్తున్న తరుణంలో 'సమాజ' సభ్యుల సంకుచిత భావాలకు తిరుగుబాటుచేసి 'సమాజానికి' దానం చేసినవారికి ఎవరి ఆస్తులు వారికే యిచ్చేసి తను కేవలం మనిషినేనని 'భగవంతుడు' కాదని ప్రకటించి దివ్యజ్ఞాన సమాజానికి తను కట్టుబడిపోయి విశ్వమానవ సమాజంలోకి స్వేచ్ఛగా వెళ్ళలేకపోవడం తనకూ అడ్డుగా వుందని ఆ అడ్డు తను తొలగించుకొని విశ్వమానవులకు అంకితమవుతున్నానని ఎలుగెత్తిచాటి సమాజ పెద్దలను క్రుంగదీసి ప్రపంచాన్నంతటినీ విస్మయపరచి మనిషిగా తను గొప్పదనాన్ని నిరూపించుకొని భగవంతుని సేవలోనే పూర్తిగా నిమగ్నమయి మానవాళిని తన అభిప్రాయాలతో ఉపన్యాసాలతో ఆకర్షించి విపరీతమయిన ఆదరణ సంపాదించి 1987 లో పరమపదించారు. అందలం యెక్కించి ప్రపంచమంతా తనను దేవుడని అంటుంటే పరిపక్వమయిన జ్ఞానంతో తనుదేవుడిని కానని దేవుడిని కొలిచే మానవుడినని చాటి అందరినీ విస్మయపరచిన ఆ మహావ్యక్తి మన తెలుగువాడే గావడం మన అదృష్టం। అటువంటి మహావ్యక్తి తను ఆ స్థితిని అందుకునేందుకు ఏమి ఆచరించారో, ప్రారంభంలో పరమగురువులు తమకు ఏమి ఉపదేశం చేశారో తెలియజేసే అమృతతుల్యమయిన యీ 'పరమగురు చరణ సన్నిధి' గ్రంధంలోని విషయాలు సూక్ష్మంగా తెలియజేయడం జరిగింది.

— సంకలనకర్త.

**మోక్షమార్గమును చేరు సాధనములు:**

మోక్షమార్గమును చేరుటకు నాలుగు సాధనములున్నవి.

1. వివేకము (Discrimination).
2. వైరాగ్యము (నిష్కామత్వము) (Desirelessness).
3. సదాచారము (Good Conduct).
4. ప్రేమ (LOVE)

వీనిలో నొక్కొక్క దానిని గూర్చి నాకు పరమగురువు చెప్పిన దానిని మీకు చెప్పుటకు ప్రయత్నింతును.

1 వివేకము:- దీనినే మోక్షమార్గమునకు చేర్చు సదసద్వివేకమనియందురు. వివేకము మార్గారంభమునందేగాక చివరివఱకు అన్ని విషయములలో నిత్యము అభ్యసించవలెను. నీవు మోక్షమార్గమున చేరుట, ఆ మార్గమునే పొందదగిన దన్నియు లభించునని ఎరిగినందుననే. తెలియనివారు ధనము కొరకును అధికారము కొరకును పాటు పడుదురు. కాని యవి ఉండిన నొక్క జన్మము వరకు ఉండ వచ్చును కావున నవి అసత్తులు. సత్తులును నిత్యములునై వీనికంటే శ్రేష్ఠమయినవి కలవు. వీని నొకసారి చూచినచో నీవు అసద్వస్తువుల (అసత్తు + వస్తువులు) నిక కోరవు

....భగవంతుని కొక సంకల్పమున్నది. అది ప్రపంచము పురోభివృద్ధికి వచ్చు (పరిణామ) మార్గము (EVOLUTION) మానవుడు ఆ మార్గమిట్టిదని చూచి వాస్తవముగ తెలిసికొనినప్పుడు ఆ మార్గమున పాటుపడుచు దానితో నేకీభవింపక యుండజాలడు. ....ధర్మ పక్షమున నుండి యధర్మము నెదిరించును స్వలాభమునకు గాక లోక శ్రేయస్సు కొరకు పాటు పడును.

ఇట్లు భగవంతుని పక్షమున నున్న మానవుడు మాలో నొక్కడగును. హిందూ, బౌద్ధ, క్రైస్తవ, మహమ్మదీయ మొదలగు ఏ మతమని చెప్పుకొన్ననూ, ఇండియా, ఇంగ్లండు, చైనా, రష్యా మున్నగు ఏ దేశస్థుడైననూ ఒకటే. భగవత్పక్షము వారు రామిచట నున్న దెందులకో, తమ కర్తవ్యమేమియో ఎరుగుదురు. మిగిలిన వారికింకను కర్తవ్యము తెలియక తరచు అవివేకముగ వర్తింతురు.

ఇట్లు నిశ్చయించిన పిమ్మట సదసత్తులలో ననేక భేదములున్నవని గుర్తిం



చుము. ఒప్పు-తప్పు; ముఖ్యము; ఉపయోగకరము- వ్యర్థము; సత్యము- అసత్యము; స్వార్థము-నస్వార్థము; వీనిని వివేకముతో తెలిసికొనుట యింకను మిగిలియే యుండును....

నీ శరీరమున కొక కోరిక కలిగిన అది నిజముగ నీవు కోరినదే నాయని నిలిచి యోచింపుము.

....నీవు నీ యంతరంగమును శోధించి నీలోనున్న యీశ్వరుని కనుగొని ఆయన వాక్కులను వినవలెను. అదియే నీ వాక్కు! శరీరములే నీవు అనుకొని పొరబడకుము.

స్థూల శరీరము నీవుకావు.

కామమయ శరీరము నీవుకావు. మనోమయ శరీరము నీవుకావు.

ఇవి తమకు కావలసిన వానిని పొందుటకు తామే ఆత్మవలె నటించును. కాని నీవు వాటినన్నిటినీ తెలిసికొని వాటికి యజమానిగా యెరుంగుము.

....దేహము నీ వాహనము. నీ పెక్కు గుఱ్ఱము. కనుక దాని నాదరించి చక్కగా కాపాడవలెను. దాని శక్తికి మించిన పనినీయరాదు. శుద్ధమైన అన్నపానముల నిచ్చి దానిని సరిగా పోషించవలెను లేశమైనను మురికి లేకుండునట్లు శుభ్రముగా నుంచవలెను. శరీరము పూర్తిగా పరిశుద్ధముగను ఆరోగ్యముగను లేనిచో నీవు నిరంతర శ్రమతో కూడిన యీ కఠినమగు సాధనను చేయజాలవు. సారాంశపు మాట — శరీరము ఎల్లప్పుడును నీకు లొంగియుండవలెను గాని నీవు శరీరమునకు బానిస కాకూడదు.

కామమయ శరీరమునకు దాని కోరికలుండును అవి పెక్కులు నిన్ను కోపించుకొనుమని, పరుష వాక్కులాడుమని, అసూయ పడుమని, ఆశపడుమని, యితరుల కున్నది చూచి యోర్వకుమని. దిగులు చెందుమని ప్రేరేపించును ఇవిగాక యింకను ఎన్నో కోరికలు దానికి గలవు. అది యట్లు కోరుట నీకు కీడు చేయదలచి గాదు అది దానికి ప్రియము గనుక. ఇట్టి తీవ్రమగు ఉద్వేగములు కలుగుట, ఆ యుద్వేగములు నిరంతరము మారుచుండుట దానికి కావలెను. ఇవియేవియు నీకక్కర లేదు. కావున వీనిలో నీ కోరికలేవి? నీ శరీరపు కోరికలేవి? యని వివేచన చేయవలెను.

నీ మనోమయ శరీరము సగర్వముగ తాను వేరనియు, తాను గొప్పయిత

రులు తక్కువ యనియు అనుకొనును నీవు దానిని ఐహిక విషయములనుండి మరలించినను, పరమగురువు పనిని, పరోపకారమును యోచింపక తన మేలునే యోచింప యత్నించును. ధ్యానము చేయునపుడు నీకు కావలసిన విషయములను విడిచి తనకు కావలసిన పెక్కు విషయములను గూర్చి చింతించునట్లు చేయును, ఈ మనస్సు నీవుకాదు. నీవు ఉపయోగించదగిన యొక పనిముట్టు. కావున నిచట కూడ వివేచన మావశ్యకము. నిరంతరము జాగరూకుడవై యుండవలెను. లేనిచో ఓడిపోవుదువు.

....చేయదగిన పని యేదియో తెలుసుకొనుటకు యత్నింపుము. పని పెద్దదా చిన్నదా యనిచూచికాదు నిర్ణయించుట. లోకులు మంచిదని చెప్పు గొప్ప కార్యముకంటె పరమ గురుని పనికి ప్రత్యక్షముగ ననుకూలించు చిన్నపని బహు యోగ్యము....

....పేదల కన్నమిడుట సత్కారమే. గొప్పది. ఉపయోగకరమును గూడ. అయిననూ దేహముల కాహారమిచ్చుటకంటె వారి యాత్మల కిచ్చుట ఎక్కువ ఉపయోగకరము. ధనవంతుడెవడైననూ శరీరమునకు కాహారమీయగలడు. కాని జ్ఞానవంతుడే ఆత్మకు మేలు చేయగలడు. నీకు గల జ్ఞానము నితరులకిచ్చి సహాయపడుట నీ ధర్మము.

నీ కిదివరకెంత జ్ఞానముండినను, ఈ మోక్షమామార్గమున నీవు తెలిసికొనదగినది యెంతయో గలదు, కనుక దీనిలో కూడ వివేచనము అవసరము....

....భగవంతుడు జ్ఞానస్వరూపుడును, ప్రేమ స్వరూపుడును, నీ జ్ఞానము వృద్ధి కాను కాను నీ యందు భగవద్భక్తి యెక్కువగా వ్యక్తము కాగలదు. కావున విద్య నభ్యసింపుము. కాని యితరులకు సహాయము చేయుటకుపయోగించు దానిని తొలుత నభ్యసింపుము.........

........సత్యా సత్యములను గుర్తించి మనోవాక్కాయములతో (త్రికరణ శుద్ధిగ) నెల్ల వేళలను సత్యానుష్ఠానము చేయుట నేర్చుకొనుము.......

........మోక్షమార్గమున నడువగోరువాడు తనకు తాను యోచించుట నేర్చుకొనవలెను. మూఢాభిప్రాయము కలిగియుండుట లోకము నందలి చెడుగులలో నొకటి. కనుక నా బంధము నుండి పూర్తిగా విముక్తుడవు గమ్ము.



ఇతరులను గూర్చి నీ తలంపులు యదార్థముగ నుండవలెను వారిని గూర్చి నీకు తెలియని దేమియు తలంచరాదు. వారెల్లప్పుడును నీ విషయమే తలంచుచున్నారని యనుకొనవలదు. ఎవ్వరైనను నీకు కీడు చేసినట్లుగాని అతడాడు మాటలు నీకు అన్వయించునని గాని నీవు తలచిన అతడు నిన్ను బాధపెట్టదలచెనని వెంటనే అనుకొనవలదు.........నీతో నొకడు కోపముగా మాట్లాడిన యెడల వాడు నిన్ను ద్వేషించెననిగాని, నిన్ను బాధపెట్టదలచెననిగాని యెంచకుము. బహుశః ఎవ్వడో లేక యే పరిస్థితియో అతనికి కోపము తెప్పించియుండగా, నీ యెదుట పడుటచే ఆ కోపమంతయు తెలివిలేని తనమే, కావున నతడు తెలివి తక్కువగా ప్రవర్తించుచున్నాడు వాని విషయమై నీవు తప్పుగా దలచరాదు.........

........నీ మాటలను సత్యముగ నుండవలెను. ఉన్నది ఉన్నటుల చెప్పవలెను. అతిశయోక్తులుండరాదు. పరులపై దురుద్దేశముల నెన్నడుగాని ఆరోపింపకుము.........

........సరి అయిన పనులనే చేయుము. సహజముగ వర్తింపుముగాని ఉన్న దానికి వేరుగా నటింపకుము. నటన ఎప్పుడును సత్యమను ప్రకాశించనీయదు. స్వచ్ఛమగు అద్దము గుండా సూర్యకాంతి ప్రకాశించునట్లు, సత్యమను జ్యోతి నీ గుండా ప్రసరించవలెను.

స్వార్థమును, నిస్వార్థమును వివేకముతో గమనించవలెను. స్వార్థము అనేక రూపములు దాల్చును. ఒక రూపమున దానిని తుదముట్ట నిర్మూలనము చేసితినని నీవనుకొనుచుండగా, ఇంకొక రూపమున నెప్పటివలెనే యది బలవత్తరముగ పుట్టును. అయినను క్రమ క్రమమున పరోపకార చింత నీ మనంబున నిండి నీ స్వవిషయమును గూర్చి యోచించుటకు వీలు గాని, సమయముగాని లేకయే పోవును.

ఇంకను నొక విధమున వివేకమును జూపవలెను. ఎవరుగాని ఏదిగాని పైకి చూచుటకెంత చెడ్డగా కనిపించిననూ నీవు వారి యందుండు నీశ్వరుని గుర్తించుట నేర్చుకొనవలెను. భగవత్కళ నీయందును యితరుల యందును గూడ కలదు. అందరిలోనూగల ఆకళ మూలమున నీవు వారికి సహాయము చేయగలవు ఆ భగవత్కళను నీ సోదరునిలో మేల్కొలిపి, వికసింపజేయుట నేర్చుకొనుము ఆ విధముగ నీ సోదరుని దుర్మార్గము నుండి రక్షించగలవు.

2. వైరాగ్యము (నిష్కామత్వము) :-

అనేకులకు నిష్కామత్వము లేక వైరాగ్యమును సాధించుట కష్టము. వారికి తమ కోరికలే తాము అనునట్లుండును . అనేకులు వాంఛించు ధనము, అధికారము విలువనేరేవిదని వివేకము వలన నీ విదివరకే తెలిసికొంటివి. ఇది మాట చెప్పుట మాత్రముగాక నీకు దృఢమైన యెడల ఆ రెంటినీ నీవు కోరవు.

ఇంత వఱకు సులభమే; బాగుగ అర్థము చేసుకొనుట మాత్రమవసరము. కాని కొందరు స్వర్గమును కోరుచూ తమకు బంధమోక్షమును జన్మ రాహిత్యమును వాంఛించి ఐహికార్థములను విడనాడుదురు, ఈ పొరపాటులో నీవు పడ కూడదు. నీవు నిన్ను పూర్తిగా మరచియుండిన యెడల మోక్షము ఎప్పుడు కలుగునని గాని ఎట్టి స్వర్గము నీకు వచ్చునని గాని ఆ ఆలోచనలు నీకుండ జాలవు. కోరిక ఎంత ఉన్నత మైనదైనను అది స్వప్రయోజనమును గూర్చినదైన యెడల బంధకారణమే. అట్టి కోరిక నీలో పూర్తిగా నశించినగాని పరమగురుని పనికి నిన్ను నీవు సమర్పించు కొనుటకు గల ఆటంకము తొలగదు

స్వార్థపు కోరికలన్నియు పోయినను నీవు చేయు పనియొక్క ఫలితమును చూడవలెనను కోరిక నిలిచి యుండవచ్చును. నీ వెవరికైనను సహాయము చేసినచో, 'నేను వానికెంత సహాయము చేసితిని' అని చూడగోరుదువు. వాడు దాని నెరిగి కృతజ్ఞత చూపవలయునని కూడ కోరుదువు. ఇదియును కోరికలో జేరినదే. నీకు కార్య కారణ సంబంధమును గూర్చిన ప్రకృతి ధర్మములో నమ్మకము లేదను దీని వలన తెలియును. ఇతరుల సహాయమునకై నీ శక్తిని ధారపోసినచో నీవు చూడ గలిగినను లేకున్నను దానికి ఫలితముండియే తీరవలెను గదా! ప్రకృతి ధర్మమును తెలిసికొని యుంటివేని దీని యదార్థము నీకు తెలియును. ఋజువర్తన ఋజువర్తన కొరకే గాని ప్రతిఫలమును కోరికాద. చేయుట నీ ధర్మము గనుక పనిచేయవలెను గాని ఫలమును జూడగోరికాదు. లోకమును ప్రేమింతువు గావున లోకసేవకు నిన్ను నీవు సమర్పించుకొనవలెను దానికి కారణమేమనగా సేవ చేయకుండుట నీకు చేతకాదు.

అణిమాది సిద్ధులను పొందగోరకుము. అవినీకు మేలని పరమగురువున కెన్నడు తోచునో అపుడవి నీకు వచ్చును. ముందే అవి కలుగునట్లు చేసికొనినచో పెక్కు బాధలు కలుగును. ఆ శక్తులు కలవానిని తరచుగ కొన్ని దేవ గణములు



మోసగించి తప్పుత్రోవల కీడ్చును, వానికి అహంకారము కలుగును. తాను తప్పు చేయనే చేయనని తలచును. అది యెట్లుండినను వానిని సాధించుటకు పట్టు శక్తిని కాలమును ఇతరులకు సేవ చేయుటయందు వినియోగించవచ్చును. మనుజుడు పరిపక్వమును కాను కాను ఆ శక్తులు వచ్చును. రాక తప్పదు ముందే నీకవి వచ్చుట మంచిదని పరమగురువునకు దోచినచో నిరపాయముగ వానిని పొందు విధమును వారే నీకు జెప్పుదురు. అంతదనుక నీకవి లేకుండుటయే మేలు.

మరియు దినచర్యయందు కొన్ని చిన్న కోరికలు సామాన్యముగ గలుగును. అవి కలుగకుండ జాగ్రత్త పడవలయును. గొప్పవాడినని, తెలివిగలవాడినని అనిపించుకొన గోరకుము. ఎక్కువగా మాట్లాడ వలెనను కోరిక గూడ విడువుము. మితభాషణము మంచిది. నీవు చెప్పగోరునది సత్యమును, ప్రియమును, సహాయకరమగును. ఉన్నదని నీకు దృఢముగ తోచిననే గాని ఏమియు మాటలాడకుండుటే నయము పలుకబోవుమాట యీ మూడు లక్షణములను కలిగియున్నదా యని జాగరూకతతో యోచించి గాని పలుకకుము,

మాటలాడుటకు ముందు జాగ్రత్తగా నాలోచించుట నిప్పటినుండియే వాడుక చేయుట మంచిది. ఏలనన, పరమగురువు నొద్ద దీక్షను పొందినపుడు పలుకగూడని మాటలను పలుకకుండ, నీవు ప్రతీమాటను పరిశీలించవలసి యుండును. లోకులాడు కొను మాటలు చాలవరకు అవసరముగను అవివేకముగను నుండును. ఇతరుల విషయమై వృథా ప్రసంగము చేయుట క్రూరమైనపని. కావున మాటలాడుటకు మారుగ ఇతరులు చెప్పునది ఆలకించుటను అలవాటును చేసికొనుము. నిన్ను ప్రత్యేకముగ అడిగిననేగాని నీ యభిప్రాయముల నివ్వబోకుము. మోక్ష సాధనముల స్వరూపము ఒకచోట నిట్లు చెప్పిరి—తెలిసికొనుట, సాహసించుట, నిశ్చయించుట, మౌనముగా నుండుట —అని. ఈ నాల్గింటిలో కడపటిది అన్నింటిలో కష్టమైనది.

.... ఒకడు తప్పుచేయుచున్నాడని నీకు తోచినచో, తగు సందర్భమును కుదుర్చుకొని. ఏకాంతమున నెమ్మదిగా నీ కట్లు తోచుటకు గల కారణములను వారికి జెప్పుము. వాడు నీ యభిప్రాయము సరియని ఒప్పుకొనుట సంభవము. కాని ఈపాటి జోక్యము కలిగించుకొనుట కూడ యనుచితముగ నేర్పడు సమయములనేక ముండును. అది యెట్లుండినను నీవెన్నడుగాని మూడవవాని యొద్దకు బోయి ఆ మాటలను సల్లాపము కొరకు చెప్పరాదు. అది మిగుల క్రూరమైన పని.

పిల్లలను గాని, పశువులనుగాని యెవరైనను హింసించుట జూచితివేని నీవు కల్పించు కొనవచ్చును. దేశపు చట్టములకు విరోధముగ నెవరైన వర్తించినచో నీవు దాని నధికారులకు తెలుపవలయును. ఎవరినైనను బోధించుటకు నీ స్వాధీనమున నుంచినచో వాని లోపములను మృదువైన మాటలతో వానికి చెప్పుట నీ ధర్మము కావచ్చును. అట్టి సందర్భములలో తప్ప నీపని నీవు చూచుకొనుము. మౌనమను సుగుణము నభ్యసింపుము.

3. సదాచారము :-

సదాచారమునకు ముఖ్యముగ కావలసిన యంశములారింటిని పరమగురు వీ రీతిగా చెప్పిరి.

1. మనో విషయమగు నిగ్రహము.
2. కాయిక కర్మ విషయమగు నిగ్రహము.
3. భిన్నరుచుల సహనము
4. సంతోషము.
5. ఏకాగ్రత.
6. విశ్వాసము.

[సాధన చతుష్టయమువలెనే వీనిలో కొన్ని తరచుగ 1. శమము: 2. దమము: 3. ఉపరతి; 4.తితిక్ష; 5. సమాధానము; 6. శ్రద్ధ అని 'శమాది షట్కము' అను పేర్లతో పేర్కొనబడుట నేనెరుగుదును. అయినను నాకుపదేశించినపుడు పరమ గురువు స్వంతముగ జెప్పిన పేర్లనే నేనుపయోగించుచున్నాను.]

(1) మనో విషయమగు నిగ్రహము :-

నిష్కామత్వమను సాధనముతో కామమయ శరీరమును నిగ్రహించవలయునని తెలియుచున్నది గదా! ఈ సాధనమును మనోమయ శరీర నిగ్రహమున కన్వయించుము. మనో నిగ్రహమనగా నీకు కోపము గాని ఆతురము గాని లేకుండునటుల నీ స్వభావమును నియమించుకొనుట యొకటి. ఎల్లప్పుడును శాంతము కలిగి కలవిలపాటు నొందకుండునటుల మనస్సునే నిగ్రహించుట రెండవది. స్థూల శరీరమందలి నాడులలో సాధ్యమైనంత వఱకు కలత పుట్టకుండునటుల మనస్సు ద్వారా నాడులను నిగ్రహించుట మూడవది. వీనిలో మూడవది కష్టము. ఏలనన, మోక్షమార్గమును సాధింపబూనినపుడు నీ శరీరమతి సున్నితము కాక తప్పదు. అపుడొక



శబ్దము గాని అదురుపాటుగాని నాడులను తేలికగా కలతపెట్టును. ఏ మాత్రము ఒత్తిడి తగిలినను బాధ కలుగును. ఐనను నీవు నేతనైనంత ప్రయత్నము చేయవలయును.

శాంతమగు మనస్సు అనగా ధైర్యము కూడ నుండవలయునని అర్థము. ధైర్యమున్నచో మోక్షమార్గమున నీకు వచ్చు పరీక్షలను కష్టములను భయపడక ఎదుర్కొనగలవు. మరియు స్థైర్యము కూడ నుండవలెను. అది యున్నచో సామాన్యముగ కలుగు కష్టములను తేలికగా భరించగలవు. స్వల్పవిషయములకు గూడ ఎప్పుడును మనోవ్యథను చికాకును పెట్టుకొనక హాయిగా నుండగలుగుదువు. బయటి నుండి మానవునకు సంభవించినదేదియు అంతగా పట్టించుకొనవలసినది కాదని పరమ గురువు బోధించెను. దుఃఖములు, కష్టములు, రోగములు, నష్టములు ఇవియన్నియు మానవుని ఏమియు చేయలేవు. వానిని లెక్కవేసి మనశ్శాంతిని చెడగొట్టుకొనకూడదు. అవి పూర్వ కర్మ ఫలములు. అవి వచ్చినపుడు కష్టములు కాపురముండవనియు ఎల్లప్పుడును ఆనందమును నెమ్మదిని కలిగియుండుటయే నీ ధర్మమనియు జ్ఞాపకముంచుకొని వానిని నీవు సంతోషముతో వోర్చుకొనవలెను. అవియన్నియు నీ పూర్వజన్మములకు జెందినవి ఈ జన్మమునకు జెందినవి కావు. వానిని నీవు మార్చలేవు. కానవానిని గురించి చింతించుట నిష్ప్రయోజనము. దాని కంటె నీవిపుడు చేయుదానిని గురించి యోచింపుము. దానిని నీవు మార్చగలవు. దీనిచే నీకు రాబోవు జన్మమున గలుగు విషయములు ఏర్పడును.

ఎప్పుడు గాని విచారపడకుము. దిగులుగా నుండకుము. దిగులుగా నుండుట తప్పు. ఆ దిగులు యితరులకు వ్యాపించి వారికి గల కష్టములను హెచ్చించును. అటుల చేయుట నీకు ధర్మము కాదు. కావున నీకెప్పుడు గాని ఖిన్నత వచ్చిన యెడల దానిని వెంటనే తొలగదోసికొనుము.

మరియు నింకొక విధమున నీ తలంపుల నిగ్రహించవలెను. వానిని విచ్చలవిడిగా సంచరించనీయరాదు. నీవు చేయుచున్న పనిమీదనే మనస్సు నుంచి ఆ పనిని ఏ లోపము లేకుండునట్లు చేయుము. నీ మనస్సు నూరక ఖాళీగా నుండనీయకుము. మనస్సు పనిలేని సమయమున తలంచుటకు సిద్ధముగా నుండునట్లు అంతరంగమున సత్సంకల్పముల నెల్లప్పుడును చేర్చియుంచుము.

నీ మనశ్శక్తిని ప్రతీ దినమును మంచి పనులకు వినియోగించుము. లోక పురోవృద్ధికి సహాయపడుము. దుఃఖములో నున్న, బాధపడుచున్న, సహాయము కావలసియున్న నీకు తెలిసిన వానినొకనిని ప్రతిదినమును స్మరించి నీ మనస్సు నుండి ప్రేమను వానిపై ప్రసరింపుము.

నీవెప్పుడును గర్వపడవద్దు, గర్వమజ్ఞానము వలన కలుగును. తెలియని వాడు తాను గొప్పవాడిననియు తానేదో గొప్ప కార్యముల చేసితిననియు తలచును. జ్ఞానము కలవాడు భగవంతుడొక్కడే గొప్పవాడనియు, మంచిపని నంతటినీ భగవంతుడే చేయుచున్నాడనియు తెలిసికొనును.

(ii) కాయిక కర్మ విషయమగు నిగ్రహము:-

నీ తలంపులు ఉండవలసిన రీతిగ నుండినప్పుడు కాయిక కర్మ విషయమై నీకంత కష్టముండదు. ఐనను లోకుల కుపయోగకరముగ నుండుటకు తలంపులు కార్యరూపము దాల్చవలెనని మరువకుము. సోమరితనము కూడదు. నిరంతరము మంచి పనుల చేయుచుండవలెను. ఐనను నీవు నీ పనినే చేయవలెను గాని యితరుల పనిని చేయరాదు. ఇతరుల యనుమతితో వారలకు సహాయ మగునట్లు మాత్రము వారి పనిని చేయవచ్చును. ప్రతీవానిని తన పనిని తన త్రోవన చేసికొననిమ్ము. కావలసినప్పుడు సహాయము చేయుటకు సిద్ధముగా నుండవలెను గాని వారి పనులలో నడ్డము దూరకుము. తాను చేయవలసిన పనినే చూచుకొనుట నేర్చుకొనవలెను. అనేకులకు ఇది పెద్ద కష్టము. కాని ఇదియే నీకు చాల ముఖ్యము.

గొప్ప కార్యములు చేయబూనెదనను కారణమున నీవు చేయదగు సామాన్య కార్యములను చేయుట మరువరాదు. ఈ పనులన్నింటినీ నెరవేర్చినగాని యితర కైంకర్యము చేయుటకు నీకు స్వాతంత్ర్యము లేదు. క్రొత్తవియగు నైహిక కార్యములను పైన వేసుకొనకుము. ఇంతవరకు నీవు పూనుకున్న పనులను పూర్తిగా చేసి తీరవలెను. అవి యెవ్వి అనగా స్పష్టముగా నీ పనులని న్యాయముగ నీ మనస్సునకు తోచునవి కాని యితరులు నీపైన వేయ జూచునవి కావు.

(iii) భిన్నరుచుల సహనము :-

అందరి యెడలను పూర్ణమగు సహనము గలిగి యుండవలెను. నీ మత విషయములలో నీకు గల శ్రద్ధాభక్తులు ఇతరుల మత విషయమగు నమ్మకమందును నీవు చూపవలెను. నీకు నీమతము వలెనే వారి మతముకూడ వారికి పరప్రాప్తికి





మార్గమే: అందరకును సహాయపడవలెనని నీవందరి విషయములను తెలిసికొని యుండవలెను.

కాని పూర్ణమగు సహనము నీకు కలగవలెనన్న మొట్టమొదట నీలో మొండితనము, మూఢాభిప్రాయములు పోవలెను. కర్మలు లేక సంసారములు నీకనవసరమని తెలిసికొనవలెను. లేని యెడల నా కర్మల చేయువారి కంటెనేదో విధమున నీవు శ్రేష్ఠుడవని యనుకొందువు. అట్లని కర్మలనింకను పట్టుకొని యుండువారిని నిందించరాదు. వారియిష్టము చొప్పున వారిని చేయనిమ్ము, ఐనను తత్వము నెరిగిన నీకు వారడ్డురాకూడదు. నీవు గడచి దాటినదానిని నీచే బలాత్కారముగా చేయించుటకు వారలు పూనుకొనరాదు. అన్నింటి యెడల దయ గలిగి ప్రవర్తింపుము.

నీవిపుడు కండ్లు తెరచి చూచుచుండుటచే పూర్వము నీవు నమ్ముచుండిన కొన్ని విషయములను, చేయుచుండిన కొన్ని సంస్కారములును వ్యవస్థ లేనివని నీకగపడవచ్చును. బహుశః వాస్తవముగ నవి యట్టివే యగునేమో. నీవు వాని నిక మీద నసుష్ఠింపజాలక పోయినను అవి కొందరు జీవులకింకను ముఖ్యములుగ నుండును. కావున వారికై యాకర్మల గౌరవింపుము. వారికిని స్థానమున్నది. వాటి వలనను ప్రయోజనమున్నది. నీవు పసివాడుగా నుండినప్పుడు వంకరలు లేక పొంకములుగ వ్రాయుటకు కాపీ పుస్తకపు రూళ్ళ గీతలు నీకు సహాయముగ నుండినవి. తరువాత నా రూళ్ళ గీతలు లేకయే అంతకంటే బాగుగను ధారాళముగను వ్రాయుట నేర్చుకొంటివి. ఇతరుల నమ్మకములును సంస్కారములును ఆ రూళ్ళ గీతలువంటివి. అవి నీకును కావలసిన సమయముండెను. ఆ సమయమిప్పుడు దాటి పోయెను.

(iv) సంతోషము :-

నీ కర్మ యెట్టిదైనను సరే దానిని సంతోషముతో భరింపుము. కష్టములు సంభవించుట యనునది నీకు గౌరవమని భావింపుము. కర్మఫల ప్రదాతలగు మహానుభావులు తాము సహాయము చేయుటకు నిన్ను తగిన వానిగ నెంచుచున్నారని తెలియుచున్నది. అది యెంత కఠినముగ నుండినను అంతకంటె కఠినముగ లేదు గదా యని సంతసింపుము. నీ దుష్కర్మము అనుభవము ద్వారా తీరిపోయి నీకు బంధము తెగునంత దనుక నీవు పరమగురువునకు సహాయపడలేవని మరువకుము. నీవు పరమ గురువున కాత్మ నివేదనము చేసికొంటివి గావున నీ కర్మమును పైబడి

రమ్మని కోరితివి. అందువలన నూరు జన్మములందు కొంచెము కొంచెముగ ననుభవింపదగిన కర్మను నీవొకటి రెండు జన్మలలో తీర్చుకొందువు. అది సంపూర్ణముగ తీరిపోవలెనన్న, దానిని సంతోషముగ ఉల్లాసముతో భరింపవలెను.

మరియు నొక యంశమేమన — దేనిని గాని 'నాది' యనుకొనుట పూర్తిగా మానవలయును. నీ కర్మము వలన నీకెక్కువ మక్కువగల వస్తువులను, నీ వెక్కువగా ప్రేమించువారును నీవద్ద నుండి తొలగిపోవచ్చును. అట్టి సమయము నందు గూడ నీవు సంతోషము గలిగి దేనినైనను సరే, అన్నింటినైనను సరే విడుచుటకు సిద్ధముగా నుండవలెను. పరమగురువు తన సేవకుని మూలమున — నితరులకు తన శక్తిని ధారపోయు సందర్భములు కలుగును. సేవకుడు భిన్నతకు లోనైయుండిన యెడల వారటుల చేయజాలరు. కావున సంతోషము సహజముగ నుండవలెను.

(V) ఏకాగ్రత:-

నీ పరమగురువు యొక్క పనిచేయుట యొక్కటియే నీ లక్ష్యముగ నుంచుకొనవలెను. నీవు మరి యేమి చేయవలసి వచ్చినను వారి పనినేమో యెప్పుడును మరువరాదు, అయితే వారి పని తప్ప మరి యేదియు నీకు ప్రాప్తించదు.ఇతరులకు సహాయకరమై స్వప్రయోజనము నపేక్షించని పని యంతయు పరమగురుని పనియే గదా! అట్టి పనిని నీవు వారి కర్పణముగ జేయవలయును. అట్టి పనులలో నొక్కొక్క దానిని నీవు చేయునప్పుడు దానిని బాగుగా గమనించి నీ చేతనైనంత బాగుగా చేయుము. ఆ మహా గురువే మరియునిట్లు వ్రాసిరి — "నీవేది చేసినను అది మానవులకు కాదు, భగవంతునికేనని మనః పూర్తిగ జేయుము." పరమగురువప్పుడే వచ్చి చూచువని నీకు తెలిసినచో ఎట్లు చేయుదువో అట్లు భావించి నీవు చేయు పనినంతయు నారీతిగా చేయవలెను, ఎక్కువ జ్ఞానము కలవారే పైవాక్యము నందలి యర్థమును పూర్తిగా తెలుసుకుందురు. దాని వంటిదే అంతకంటె మిగుల ప్రాచీనమగు మరియొక వాక్యమున్నది. అది, "నీ చేతబడు ఏ పనినిగాని నీ శక్తి నంతను వినియోగించి చేయుము" అని.

ఏకాగ్రత యనగా నీవు ప్రవేశించిన మోక్ష మార్గమునుండి ఏదియును నిన్నొక క్షణకాలము కూడ మరలింపజాలదని యర్థము. నిన్ను మోహింపజేసి తప్పుత్రోవల ద్రిప్పు సందర్భములుగాని ఐహిక సుఖములుగాని, ఐహికమగు ప్రేమలుగాని నిన్ను మరల్పరాదు. నీవీ మార్గముతో ఏకము కావలెను. ఆ మార్గము నీకు సహజమై దానిని గురించి యోచింపనక్కరలేకయే దాని నవలంబించవలెను. దాని నుండి మరలుట నీ కసాధ్యముగ నుండవలెను. అంతరాత్మయగు నీవు ఆ మార్గమున ప్రవేశింప నిశ్చయించితివి. దానినుండి త్రెంచుకొని పోవుట యనగా నీ నుండి నీవు త్రెంచుకొనిపోవుట యగును.

(vi) విశ్వాసము :

నీ పరమ గురువును నీవు పూర్తిగా నమ్మవలెను నీయందు నీకు నమ్మకముండవలెను. నీవు పరమగురువును చూచియుండినచో జనన మరణము లెన్ని గడచినను నీకు వారియందు నమ్మకముండును. వారిని నీవింకను చూచి యుండక పోయిన యెడల వారి స్వరూపమును ప్రయత్న పూర్వకముగ అనుభవమునకు తెచ్చుకొని వారిని నమ్మవలెను. అట్లు నమ్మనిచో వారు నీకు తోడ్పడజాలరు. పూర్ణమగు నమ్మకముండినగాని వారి ప్రేమయు, శక్తియు నీలోకి పూర్తిగా ప్రవహింపజాలవు.

నీయందు నీకు నమ్మకముండవలెను. నిన్ను నీవు బాగుగ యెరుగుదునని యనుకొందువేమో! అట్లెంచి నిన్ను నీవెరుగనే యెరుగవని అర్థము. పలుమారు బురదలో బడిన దుర్బలమగు పై పొట్టును మాత్రమే నీ వెరుగుదువు యదార్థముగ నీవు భగవంతుడనెడు అగ్నినుండియే వెలువడిన అగ్నికణమవు ఆ కారణము వలన చేయ నిశ్చయించినచో నీ కసాధ్యమగునది యొక్కటియు లేదు. "ఒక మానవుడు చేసిన దానిని మరియొక మానవుడును చేయగలడు. నేను మనుజుడనే! అయినను నేను మనుజునందుండు భగవంతుడను గూడ! ఈ పనిని నేను చేయగలను, చేసి తీరెదను" అని నీకు నీవు చెప్పుకొనుము. నీవీ మోక్ష మార్గమున నడువవలయునన్న నీ మనో నిశ్చయము బాగుగ తీరిన ఉక్కువలె నుండవలెను.

4. ప్రేమ (Love) :

సాధనలన్నింటిలో ప్రేమ యనునది చాల ప్రధానము. మానవునిలో ప్రేమ తగినంత దృఢముగ నుండినచో అది వానిని ఇతర సాధనము లన్నింటిని తప్పక సాధించునట్లు చేయును. ప్రేమలేని యెడల తక్కినవన్నియు సరి పూర్తినీయవు. జనన మరణ రూపమగు చక్రము నుండి మోక్షమునియు భగవంతునితో నైక్యము

పొందుటకు తీవ్రమగు నిచ్ఛయనియు దీనిని తరచు నిర్వచింతురు. కాని అట్లు చెప్పుట స్వప్రయోజనమును సూచించునట్లుండును. అర్థములో కొంతభాగమును మాత్రమే తెలుపును. ముముక్షత్వము ఒక కోరికయనుట యంత సరికాదు. దృఢ సంకల్పము, అధ్యవసాయము, మనో నిశ్చయము అని చెప్పవచ్చును. అది ఫలించుటకు దృఢసంకల్పము నీ స్వభావమును పూర్తిగా నాక్రమించి, మరియే యితరమైన తలంపును మనస్సున స్ఫురించుటకు గూడ అవకాశము లేకుండునట్లుండవలెను. నిజముగ నది భగవంతునితో నేకీభావము పొందవలయునను నిశ్చయమే. కాని నీవు వేసటను దుఃఖమును తప్పించుకొనవలయునని ఆ యేకీభావమును కోరరాదు. జీవన్ముక్తుల యందలి గాఢ ప్రేమచే వారికి తోడ్పడి వారు వర్తించునట్లు వర్తించవలెనని కోరవలెను. భగవంతుడు ప్రేమ స్వరూపుడు కావున నీవాయనతో నైక్యము గావలసినచో పరిపూర్ణముగ పరోపకారి బుద్ధియు, పరమప్రేమయు నీయందు నిండి యుండవలయును గదా.

ఈ ప్రేమయనునది దినచర్యలో రెండు విధములుగ నేర్పడును.

మొదటిది– నీవు జాగరూకతో నే ప్రాణిని గాని బాధపెట్టకుండుట.

రెండవది– ఇతరులకు సహాయము చేయుటకు నెల్లప్పుడును సందర్భములను నిరీక్షించుచుండుట.

ప్రేమకు విరోధములగు పాపములు మూడు గలవు. అవి 1) వృథాప్రసంగము, 2) క్రౌర్యము, 3) మూఢాభిప్రాయములు. ఇవి లోకమునందలి పాపములన్నింటి కంటె నెక్కువ చెరుపు చేయును. భగవంతుని యందలి ప్రేమ (భక్తి)తో తన యంతరంగము నిండియుండవలయునని కోరువాడు ఈ మూడు పాపములు చేయకుండునట్లు జాగ్రత్త పడవలెను.

వృథాప్రసంగమెంత పనిచేయునో చూడుడు. దానికి మూలము దుస్సంకల్పము. అదియే యొక పాపము. అందరియందును మంచియున్నది, చెడ్డయు యున్నది. మంచిని తలంచి దానిని బలపరచి లోక పురోభివృద్ధికి మేలు చేయగలము. ఇతరులయందుగల చెడుగు దలచి దానిని బలపరచి లోకపురోభివృద్ధికి భంగమును చేయగలము. అనగా భగవదిచ్ఛననుసరించి నడువగలము, లేక దాని నెదిరించి నడువగలము. మరి యొకనియందలి చెడ్డను నీవు దలచితివేని యేక కాలమున మూడు క్రూరకార్యములను చేసిన వాడవగుదువు. అవి యేవనగా:– 1) నీ



చుట్టుప్రక్కలను మంచి మనోభావములతో నింపుటకు మారుగా దుష్టమనోభావములతో నింపుదువు, అందువలన లోకమునందలి దుఃఖమును ఎక్కువచేయుదువు.

2) ఒక మనుష్యుని యందు నీవు దలచిన దుర్గుణముండినచో దానిని నీవు బలపరచి పోషింతువు. అందువన నీ సోదరుని మంచివానిగ చేయుటకు మారుగ మునుపటికంటె చెడ్డవానిగా చేయుదువు. సాధారణముగ ఆ దుర్గుణము వాని యందుండదు. ఉన్నదని నీకెట్లో తోచియుండును. అప్పుడు నీ దుస్సంకల్పము నీ సోదరుని తప్పుద్రోవలకీడ్చును. వాడింకను పరిపూర్ణుడు గాకున్నచో నీవు భావించిన గుణములు వానియందు కలుగవచ్చును.

3) నీ మనస్సును సత్సంకల్పములతో నించుటకు మారుగ దుస్సంకల్పములతో నించుకొందువు. కావున నీ యభివృద్ధికి నీవే యడ్డుపడుదువు. నిన్ను సూక్ష్మదృష్టితో జూచువారికి అందముగను, ముద్దుగను నుండుటకు మారుగా వికారముగాను, దుఃఖకరముగను కన్పింతువు.

ఇట్లు వృథా ప్రసంగముల జేయువాడు తనకును, తాను చెరుపబూనిన వానికిని ఇంతకీడు చేసియు తృప్తిజెందక తనశక్తి నంతటిని వినియోగించి ఇతరులను సైతము తాను జేయు పాపములో భాగస్థులనుగ జేయుటకు యత్నించును. ఒకనిని గురించి దుర్మార్గపు కథలను, ఇతరులు నమ్మవలెనని కోరి ఉత్సాహముతో వారికి చెప్పును. అంతట వారును తమ దుస్సంకల్పములను పాపమా కష్టజీవిపై గుమ్మరింతురు. ఇట్లు దిన దినమునను, ఒక్కడేగాక, వేలకొలది జనులు చేయుచుందురు. ఈ పాపమెంత నీచమో యెంత ఘోరమో నీకు కొంచెమైనను ఇప్పుడు స్ఫురించుచున్నదా? దీనిని పూర్తిగా మానుకొనవలెను. ఎవరిని గూర్చిగాని చెడ్డ ఎన్నడును మాట్లాడకుము. ఒకడు మరియొకనిని గూర్చి చెడ్డ నీతో చెప్పిన యెడల దానిని వినక నిరాకరించి వారితో 'ఒక వేళనది నిజము కాదేమో! నిజమేయైనను దానిని గురించి మాట్లాడుట కంటె మాటలాడ కుండుట దయజూపినట్లగును గదా! యని మృదువుగ జెప్పుము.

క్రౌర్యము :– ఇది బుద్ధి పూర్వకము, బుద్ధి పూర్వకము కానిది అని రెండు విధములు, బుద్ధి పూర్వక మనునది మరియొక ప్రాణికి బాధ కలుగజేయవలయునని యుద్దేశించి చేయునది. ఇది పాపములన్నింటిలో గొప్పది. మనుజుడు చేయదగినది కాదు. రాక్షస కృత్యము! మనుజులు పలుమారిట్టి పనిని చేసియున్నారు. ఇప్పుడు

ప్రతీ దినమును చేయుచున్నారు......ఉపాధ్యాయులలో ననేకులు వాడుకగా నీ పనిని చేయుచున్నారు. వీరందరు ఈహింస తమ కాచారముగ నేర్పడినదని తమ ఘోర కర్మమునకు సమాధానము చెప్పుకొందురు. అనేకులు చేయుదురు కావున పాపము పాపము గాకపోదు. కర్మ ఆచారమును లెక్క పెట్టదు. క్రౌర్యముయొక్క కర్మఫలము చాల ఘోరమైనది. ఇండియా దేశమున నహింసా ధర్మమందరకును తెలిసినదే గాన ఇట్టి దురాచారముండుట సబబు కాదు. మృగయా వినోదమని పేరు పెట్టి భగవంతునిచే సృజింపబడిన జీవకోటిని వేటాడి బుద్ధి పూర్వకముగ హింసించిన వారందరు క్రౌర్యము వలన ఫలములనుభవింపక తప్పదు.

అట్టి పనులను నీవు చేయవని నేనెరుగుదుము. భగవంతుని యందు నీకు గల ప్రేమను బట్టి యిట్టి పనులను జేయరాదని అవకాశము కలిగి నప్పుడు స్పష్టముగా జెప్పుచుండుము. కార్యము లందు క్రౌర్యముండునట్లే మాటలయందును క్రౌర్యము గలదు. ఎవ్వడైనను మరియొకవిని నొప్పించవలెనని యొకమాట పలికినచో వాడీ క్రౌర్యపాతకము జేసినట్లే. ఈ పాపమును గూడ నీవు జేయవు అయినను క్రూరపు, మాట వలన కలుగు నంత చెరపు, యోచించక పలికిన మాట వలన కలిగినంత చెరుపు యోచించి పలికిన మాట వలనను కలుగ వచ్చును కనుక బుద్ధి పూర్వకము గాని క్రౌర్యము కూడ లేకుండ జాగరూకుడవై యుండుము.

ఈ బుద్ధి పూర్వకముగాని క్రూరకర్మ సాధారణముగ యోచన లేమిచే సంభవించును. లోభము, ధన కాంక్షతో నిండినవాడు న్యాయముగ నితరుల కియ్యవలసిన దానికంటె తక్కువగానిచ్చుట వలనను తనయాలు బిడ్డలను సైతము సగము ఆకలితో నుంచుట వలనను తాను కలుగజేయు కష్టమింతయని యెన్నడును యోచన గూడ జేయడు మరి యొకడు తన కామములనే తలంచి వాని నీడేర్చు కొనుటకు ఎందరు జీవులను ఎన్ని దేహములను నాశనము చేయునో కొంచెము కూడ లెక్క చేయడు.

....కర్మ దేవతలకు మరుపులేదు జ్ఞాపకము లేనందున చేసిన పాపము అని కర్మ తన విధిని మార్పు చేయదు. నీవు మోక్ష మార్గమున ప్రవేశింపగోరితివేని ప్రమాదమున గూడ యే క్రూర కార్యమును జరుగకుండ జాగ్రత్తతో నీవు చేయు పనివలన గలుగు ఫలముల నన్నింటిని యోచించ వలెను.

మూఢాభిప్రాయములు కలిగి యుండుట మరియొక చెడుగు. ఇది ఘోరమగు



క్రూర కార్యములను ఎక్కువగా కలిగించినది. దీనికి లోనైనవాడు వానికంటె నెక్కువ తెలిసిన వారిని తిరస్కరించి బలవంతముగ తాను చేసినట్లు వారిచే గూడ చేయించబూనును. పశువులను బలి యిచ్చితీరవలెనను మూఢాభిప్రాయము వలనను, మనుజున కాహారముగ మాంసమవసరమను మరింత క్రూరమగు మూఢాభిప్రాయము వలనను ఘోరమగు పశువధ యెంత చేయబడుచున్నదో యోచింపుము. మన కత్యంత ప్రేమాస్పద మగు ఇండియాలో మూఢాభిప్రాయము వలన అంత్యజుల యెడ మనము వర్తించు రీతిని యోచింపుము. సోదర ధర్మము తెలిసిన వారియందు సైతము ఈ దుర్గుణ మెట్టి కఠినమగు క్రౌర్యమును కలుగ జేసినదో చూడుడు. ఈ మూఢాభిప్రాయమను పిశాచము చేజిక్క ప్రేమ స్వరూపుడగు భగవంతుని పేరు చెప్పుచు అనేక పాతకములు చేయబడినవి. కావున నది యణుమాత్రమైన నీయందు నిలువకుండ జాగరూకుడవై యుండుము,

ఈ గొప్ప పాపములు మూడును ప్రేమకు విరోధము గావున నవి పురోవృద్ధిని చెరుచును కనుక వానిని జేయకుము. అయితే కీడు చేయకుండట మాత్రము చాలదు. పూనికతో మేలు చేయవలయును లోకసేవ చేయవలయును. తీవ్రేచ్ఛ నీలో పూర్ణముగా నిండి యుండవలయును. నీ చుట్టు పట్ల నుండు మనుజులకు మాత్రమేగాక పశువులకు నోషధులకును గూడ సేవ జేయుట కవకాశము దొరకునాయని మెలకువతో నెల్లప్పుడు నిరీక్షించుచుండ వలయును. నీవు ప్రతిదినము స్వల్ప విషయములందు గూడ లోకసేవ చేయుట నీ స్వభావముగ నేర్పడి గొప్పపని చేయునవకాశ మరుదుగ దొరికినపుడు దానిని జార విడువవు. నీవు భగవంతునితో నేకీభావము చెందవలెనను. తీవ్రేచ్ఛ నీ స్వప్రయోజనమునకు కాదు. భగవంతుని ప్రేమ లోకమందలి ప్రజలకు ప్రవహించుటకు నీవొక సాధనము కావలెనని మాత్రమే.

మోక్ష మార్గమున నుండువాడు ప్రపంచమున నుండుట తనకొరకు కాదు ఇతరుల కొరకు. ఇతరులకు సేవజేయుటకై తన్నుతాను మరచును. పేనా (పెన్ను) యొకటి చేతబట్టి దానితో వ్రాసి మనోభావములను వ్యక్తము చేయగలము. ఆ పేనా లేని యెడల వ్యక్తము చేయజాలము. అట్లే భగవంతుని సంకల్పమందు ప్రవహించి యీ లోకమున నభివ్యక్తము కావలయుననిన మోక్షమార్గమున నుండువాడు భగవంతుని చేతి పేనా వలె నుండును. ఇంతేకాదు ప్రాణము గల జ్యోతిర్మయు

24)

మగు నగ్ని శిఖవలె వాడు తన హృదయమున నిండియుండు నీశ్వరప్రేమను లోకముపై ప్రసరింప చేయుచుండును.

నీకు వలయు సాధనములు—

సహాయము చేయు శక్తినిచ్చు విజ్ఞానము, ఆ విజ్ఞానమును మంచి త్రోవం నడుపు మనోనిశ్చయము, ఆ నిశ్చయమును ప్రోత్సహించు ప్రేమ.

మనోనిశ్చయము, విజ్ఞానము, ప్రేమయను మూడును భగవంతుని మూడు ముఖములు. భగవంతుని సేవించగోరు నీవు ఈ మూడు గుణములను కలిగి యుండవలెను.

—పరమ గురు చరణ సన్నిధి—

* * *

ఇవి నామాటలు కావు. నాకుపదేశించిన పరమగురువు మాటలు. వారు లేనిది నేనేమియు చేసి యుండజాలను. వారి సహాయమున నేను మోక్షమార్గమున ప్రవేశించితిని. నీవును ఆ మార్గమును చేరగోరుదువు. కనుక వారు నాకుపదేశించిన బోధలు నీకును ఉపకరించును. కాని ఆ మాటలు సత్యము లనియు బాగుగ నున్నవనియు చెప్పుట చాలదు. చెప్పిన ప్రకారము అనుష్ఠించినగాని నీవు కడతేర జాలవు. ఆహారమును జూచి అది బాగుగా నున్నదనుటచే నాకలి తీరదు. చేయిచాచి ఆ యన్నమును తినవలెను. అట్లే పరమగురువుల వాక్కులు వినుట (లేక చదువుట) చాలదు వారి ప్రతిమాటను గమనించి ప్రతిసూచనను గ్రహించి వారు చెప్పునటుల నడచుకొనవలెను. సూచనలలో నే యొకటి గ్రహింపక పోయినను, వారి మాటలలో నొకటి విడిచినను అది మరలరాదు. వారు చెప్పినది మరల చెప్పరు—

జిడ్డు కృష్ణమూర్తి.

—అల్కియోని శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారిచే ఆంగ్లములో వ్రాయబడినది తెలుగులోకి శ్రీ చిట్టమూరు రామయ్య, బి.ఎ.,ఎల్.టి., శ్రీ మరిగంటి కృష్ణమాచార్యులు, బి.ఎ బి.ఇడి గార్లచే అనువదింపబడినది.

* * *



## పరమగురు చరణ సన్నిధికి

### పీఠిక

వయసున పెద్దను గనుక ఈ చిన్న గ్రంథమునకు పీఠిక వ్రాయు భాగ్యము నాకు కలిగెను ఇది బాలుడైనను పరిపక్వ జీవుడగు చిన్నసోదరుడు వ్రాసిన ప్రథమగ్రంథము, ఇందలి విషయములు 'జ్ఞానదీక్ష. పొందుటకు సాధనగా 'పరమగురు'వాయనకుపదేశించిరి. బోధలను ఆయన శ్రమతో మెల్లమెల్లగా జ్ఞప్తికితెచ్చుకొని వ్రాసిరి. ఏలనన గడచిన సంవత్సరమున (1909) ఆయన ఇంగ్లీషు భాషాజ్ఞానము ఇప్పటికన్నా తక్కువగా నుండెను. చాలవఱకు పరమగురువు చెప్పిన మాటలే యిందు వ్రాయబడినవి. మిగిలినచోట్ల వారి యభిప్రాయములు శిష్యుని మాటలలో వ్రాసిరి. రెండు వాక్యములు వదలియుండగ పరమగురువు పూరించిరి. మరి రెండుచోట్ల రెండుమాటలు లోపించి యుండగా వానిని వ్రాసిరి. ఇవి తప్ప మిగిలిన దంతయు అల్కియోని స్వయముగా వ్రాసినదే లోకమునకు ఆయన సమర్పించిన మొదటి కానుక యిది!

పరమగురువు బోధ శిష్యునకుపకరించినట్లు ఈ గ్రంథమితరులకు సహాయపడుగాక. అట్టి సదుద్దేశముతో నిది వ్రాయబడినది. గురూపదేశము మొదలు ఈ గ్రంథకర్త చెప్పినట్లు అనుష్ఠించెను. అట్లే ఇతరులు చేసినగాని ఫలితముండదు. చెప్పినట్లు చేసినచో అల్కియోనికి మోక్షద్వారము తెరువబడినట్లు చదువరులకు గూడ ఆ ద్వారము తెరువబడును. మోక్షమార్గమున వారు నడువవచ్చును.

—అనీబిసెంటు.

డిసెంబరు, 1910

### కోరిక

ఆధ్యాత్మికంగా ఎంతో ఉన్నతమైన స్థానంలో వున్నవారు చాలామంది ఉన్నారు, వారందరూ సమాజంలో యీనాడు నెలకొన్న పరిస్థితులకు తమలో తాము చింతిస్తున్నారు. అటువంటి మహనీయులకు నా విన్నపము యేమిటంటే యీనాటి ప్రజల మనుగడకు మార్గదర్శక సూత్రాలను ఆదర్శ పూర్వకంగా సూచిస్తూ, ఏమిచేయాలో తెలియక 'యిటా-అటా' అని కొట్టుమిట్టాడి చివరికి 'అటు' లోని సై

మెరుగుల ప్రలోభములలో చిక్కుకుంటున్న, నాలాంటి వారికి దారి చూపించండి. మీ వంటి వారిలో కదలిక కోసం చేసిన యీ చిన్ని ప్రయత్నానికి స్పందించండి.

మనసులో మాట

సరి అయిన అవగాహన లేక, సరి అయిన గురువు ఆశీర్వాదం దొరకక మనలో చాలా మంది పద్ధతులనూ, సాంప్రదాయాలనూ, నియమాలనూ, నిష్ఠలనూ దీక్షలనూ మన అభిరుచులకు అనుగుణంగా మార్చుకొని వాటిలో అనుభవమున్న వారిని తికమక పెడ్తున్నాము. మంత్రాలనూ, అష్టోత్తర నామాలనూ పుస్తకాలలో చదివేసి అవి చూసి పలకడం వచ్చేసరికి మనం ఒక 'గురువు' అయి పోతున్నాము. ఒక గురువు పద్ధతులకూ యింకొక గురువు పద్ధతులకూ పొంతన లేక నవ్వుల పాలవుతున్నాము. మనకు మనమే గొప్ప అనుకొని పెద్దవారిని గౌరవించడం లేదు.

ఇంక 'దీక్ష' తీసుకుంటున్న వారిలో కొంత మంది ఆ 'దీక్ష' తాలూకా నియమాలను పాటించక భక్తిగా, శ్రద్ధగా చేస్తున్న వారికి తలవంపులు తెచ్చి మొత్తం అందరిమీద చులకన అభిప్రాయం రావడానికి దోహదం చేస్తున్నారు. దానిబట్టి భక్తుడు అనిపించుకొడానికే 'దీక్ష' తీసుకుంటున్నారన్న అభిప్రాయమునకు బలాన్నిస్తున్నారు.

అసలు యీ 'దీక్ష' అన్నది ఏమిటి? ఎందుకు 'దీక్ష' తీసుకుంటున్నారు? వాటికి ఆ నియమాలు యెందుకు పెట్టారు?అన్ని విషయాల గురించి అలోచించటమే లేదు

41 దినములుగాని 108 దినములుగాని దీక్ష తీసుకొని పవిత్రంగా, శ్రద్ధగా, భక్తిగా, నియమములు పాటించి ఆ పర్వదినములు అయిపోగానే తిరిగి మామూలు మనుషులమయిపోతున్నాము. మరి యిన్నాళ్ళు చేసిన కృషి ఫలితమేమున్నది? మానసికముగా మనలో అణుమాత్రమయిన మార్పు రావటం లేదు, ఈ విషయమై మనము ఎందుకు ఆత్మావలోకనం చేసుకోవటం లేదు?

దీక్ష సమయములో భగవంతునికి దగ్గఱయిన అనుభూతిని మనం పొందటం లేదా? మరి ఆ అనుభూతిని పెంపొందించు కోవలసిన బాధ్యత మన మీద లేదా? క్రిమికీటకాదులు, సరీసృపాలు, క్రూరమృగములు, పశు పక్ష్యాదులు, చెట్లుచేమలు, వానర జన్మల పరంపరల తరువాత ఏడుజన్మల మజిలీగా, ఎన్నరాని జన్మలలో ఎన్నికైన జన్మగా మానవ జన్మ యెత్తి అర్చన సృష్టితో మనుగడ సాగిస్తూ నిండు జీవితాన్ని వృధాగా అటవిడుపులాగా ఐహిక బంధాల వుచ్చులో పడి గడుపుతున్నాము

ఓం

# ఆధ్యాత్మిక సాధకులకు

# ఆచరణయోగ్యమైన ముఖ్యాంశములు

సంకలన కర్త

నేటి సమాజములో బాగా జీర్ణించుకు పోయిన భావం యేమిటంటే భక్తి అనేది, ఆధ్యాత్మిక చింతన అనేది వయస్సు ఉడిగి పోయిన తరువాత మరియు శరీరములోని అవయవ పటుత్వం తగ్గిన తరువాత అవలంబించ వలసిందేగాని బాల్యములోను, వయస్సులోను వుండగా చేయవలసినది కాదు. అని ఈ భావం యెంత బలంగా ప్రబలి పోయిందంటే దైవ కార్యక్రమములను నిర్వహించే వారిని అప్రయోజకులుగానూ, అమాయకులు గాని లేగా యేదో స్వార్థముతో నిర్వహించే వారుగాను భావిస్తున్నారు

వేదాలలోను, ఉపనిషత్తులలోను, భగవద్గీతలోను, ఇతిహాసాలలోను చెప్ప బడినవి నిత్యజీవితంలో మనకు మార్గదర్శకముగా వుండేవే: ఆ దృష్టితో పరిశీలిస్తే వాటివల్ల మనకు యెంత లాభమో తెలుస్తుంది. వాటిని ఆలంబనగా తీసుకొని మన ప్రవర్తనను సంస్కరించుకుంటే మన జన్మలు ధన్యమయి మోక్షమార్గాన్ని సుగమం చేసుకున్న వారవుతాము. పీఠాధిపతులు, పరమ గురువులు, మహాత్ములు, పుణ్యపురుషుల యెందరో మనలో పేరుకు పోయిన జడత్వాన్ని వదిలించడానికి సమాజములోనికి బహిరంగముగా వచ్చి తమ అమూల్యమైన సందేశాలిస్తున్నారు. కాని ఐహిక సుఖాలకు, లౌకిక జీవనానికి బానిసలమయి వారి విలువ గ్రహించక వారి ప్రవచనములను మనస్సులోనికి యెక్కించుకోక నిష్ప్రయోజకులుగానే మిగిలిపోతున్నాము. ఆ సందేశములను వింటున్నప్పుడు మనం జీవితాన్ని యెంత వ్యర్థం చేసుకుంటున్నామో అనిపిస్తుంది. కాని అది తాత్కాలికమే: వెంటనే మాయ ఆవరించి మళ్ళీ మన లౌకిక జీవనానికి అలవాటు పడిపోతాము. తాత్కాలికమైన, యీ ఐహిక బంధాల వూబిలో పడి శాశ్వతమైన ముక్తి బంధాన్ని విస్మరిస్తున్నాము.

అరకప్పు టీ యిచ్చిన వాడికి కృతజ్ఞత తెలియచేస్తాము. మరి మనకు యీ నిండు జీవితాన్నిచ్చిన ఆ భగవంతునికి మనం యేం చేస్తున్నాము. ఆయన మన నుంచి యేమీ కోరటం లేదు. కాని మనం ఆయనను గూర్చి ఆలోచిస్తేనే ఆయన మనతో సంబంధము కలిగి వుండి మనకు ఆ అనుభూతిని కలుగజేస్తాడు. మనలో చాలా మందికి యేదో చేయాలని వుంది కాని యేం చేయాలో యెలా చేయాలో



తెలియదు అటువంటి వారి కోసం క్రింది మార్గదర్శక సూత్రాలు గురు దేవులు శ్రీ ఆంజనేయస్వామి ప్రేరణతో తెలియజేయ బడుతున్నవి.

* నిద్రలేచిన వెంటనే పృథ్విని తాకి నమస్కరించవలెను.

* స్నాన మాచరించినప్పుడు జలమును తాకి నమస్కరించవలెను.

* స్నాన మాచరించునప్పుడు శరీరమాద్యంతము గల రోమ కూపములు, చేతివ్రేళ్ళయందు, కాలివ్రేళ్ళయందు, గోళ్ళయందు గల మురికిని తీసివేసి శుభ్రము చేయవలెను.

* స్నానానంతరము సూర్యనమస్కారము చేయవలెను.

* తెల్లని వస్త్రము ధరించి నొసటియందు బ్రహ్మమయ్యను సాంప్రదాయము ననుసరించి కుంకుమగాని, తిలకముగాని, విభూతిగాని, తిరునామముగాని, సింధూరము గాని ధరించవలెను.

* ఈశాన్యమూలలో నుంచబడిన దేముని ఫోటోవద్ద అగరుబత్తి వెలిగించి, తైలదీపం వెలిగించి భక్తితో గణేశుని మొదలుకొని ఆంజనేయస్వామి వరకు అందరి దేముళ్ళస్తోత్ర పారాయణ చేయాలి. దేమునికి కనీసం అరటిపండయినా లేక పటిక పంచదార అయినా నైవేద్యముగా సమర్పించి కర్పూర హారతితో మంగళ శ్లోకం పలికి ఒక్క అరనిముషమయినా ధ్యానంలోకి వెళ్ళి నన్ను నువ్వు దేమునికి అర్పించుకున్నానని తెలియచేసి స్వామి అనుగ్రహం సంపాదించుచున్నాను అన్న సంకల్పము చేసుకొని నెమ్మదిగా లేచి తరువాత నిత్యకృత్యములు చేసుకొనవలెను.

* ఏదయినా పానీయం కాని, ఉపాహారం కాని, ఆహారం కాని, ఏదిగాని తీసుకునేటప్పుడు దేమునికి ఆ పదార్థము అర్పించి ఆ ప్రసాదాన్ని స్వీకరిస్తున్నా నని ఒక్క క్షణం మనస్సులో భావన చేసి తృప్తిగా మిగల్చకుండా తినవలెను. వ్యర్థము చేయకూడదు.

* ఇంటినుండి బయటకు వెళ్ళేటప్పుడు భగవంతుని స్మరిస్తూ వెళ్ళాలి.

* సాయంత్రం యింటికి రాగానే కాళ్ళు చేతులు, ముఖం కడుగుకొని తిరిగి తైలదీపం వెలిగించి భగవంతునికి నమస్కరించాలి

* సత్సంగములలోను, సంకీర్తనలలోను, ప్రవచనములలోను తప్పని సరిగా పాల్గొని ధార్మిక మరియు ఆధ్యాత్మిక కార్యక్రమంలలో చేయి కలపాలి.

* భగవంతుడిని పూజించేవాడిని ఏ కులస్థుడయినా, ఏ మతస్థుడయినా గౌరవించాలి.

పై పదకొండు సూచనలను ప్రతీ ఒక్కరూ సాధకులయినా, కాకపోయినా అనుసరిస్తే మనసుకు, జీవితానికీ శాంతికలుగుతుంది. అవి భగవంతుని రక్షణలోనికి మనలను తీసుకొనమని అడగడానికి సంకేతముగా ఉపకరిస్తాయి.

ఇంక చాలామంది భక్తులు తమ పూర్వజన్మల సుకృతంవలన ఆధ్యాత్మిక చింతన కలవారై యుండి సాధన చేయుటకు మార్గం తెలియక తమకు తోచినట్టుగా చేస్తూ మనుగడ సాగిస్తున్నారు. అటువంటి వారికి ఉపయోగపడేటట్టుగా యీ క్రింది మార్గదర్శక సూత్రాలను యివ్వడం జరిగింది. అయితే వీటిని ఆచరించేవారు మొదటి సూచనలను తప్పని సరిగా పాటించాలి.

* సాధకుడు అన్ని విషయాలలోను మితము పాటిస్తూ, నైతిక బాధ్యతలను నెరవేరుస్తూ, మృదువుగా ప్రియముగా మాట్లాడుతూ సంపూర్ణ స్వార్థరాహిత్యముతో మెలగాలి

* సాధకుడు వీలయినంత వఱకు మౌనము పాటించాలి క్లుప్తంగా, అవసరమయినంత వఱకు మాత్రమే మాట్లాడాలి. ముందుగా ఆలోచించుకొని మనస్ఫూర్తిగా మాట్లాడాలి. ప్రత్యక్షముగా అడిగినప్పుడు తప్ప తన యభిప్రాయమును వ్యక్తపఱచకూడదు.

* ఈర్ష్య, అసూయ, ద్వేషం వీటిమూలంగా కోపం వస్తుంది. అందుచేత కోపమును జయించుటకు దానికి మూలమయిన వాటిని నాశనం చేసుకొని మనస్సులో ఎటువంటి ఉద్వేగం లేకుండా ప్రశాంతతను, ప్రసన్నతను, దయను కలిగి ఉండాలి.

* నేనే చేశాను అన్న భావం అహంకారానికి అంకురార్పణ వంటిది. పూర్వజన్మ వాసనవల్ల యీ కార్యం భగవంతుని యిచ్ఛాను సారం జరిపించబడింది అనుకోవాలి. సత్కారం గాని సన్మానం గాని పొందితే అది భగవంతుని సేవవల్లనే జరిగింది యిది ఆయనకే గాని నాకు కాదు అనుకుంటూ మరింత జాగ్రత్తగా అ



కార్యక్రమాలు నిర్వహించాలి. ఒకసారి గర్వానికి, అహానికి లోబడితే పతన మవుతున్నట్లే. తరువాత పశ్చాత్తాపపడినా తన ముందటి స్థానాన్ని చేరుకోవడానికి నెలలూ, సంవత్సరాలూ పడతాయి. అపకీర్తి వస్తేపోదు, కీర్తి పోతేరాదు,

* మనస్సును ఖాళీగా నుండనీయకూడదు. మనస్సు పనిలేని సమయమున తలచుటకు సిద్ధముగా నుండునట్లు అంతరంగమున సత్సంకల్పముల నెల్లప్పుడు చేరి యుంచవలెను.

* సాధకుడు తన సాధన సంపత్తిని బాహ్యడంబర పద్ధతులద్వారా కాక తన ప్రవర్తన ద్వారా వ్యక్తపఱచవలెను. తనకు, భగవంతునికి మాత్రమే సంబంధ ముంచుకొనవలెను.

* సాధకుడు చాలా కాలం చిత్తశుద్ధిగా అంతః పరిశీలన అభ్యసించాలి. జ్ఞానార్జనకు ముఖ్యమైన మార్గమిది. నిజమైన అంతః పరిశీలన ద్రష్టలను తయారు చేస్తుంది. ప్రతిదినము డైరీ వ్రాయు అలవాటు కలవాళ్ళు తద్వారా పొరపాట్లను దిద్దుకున్నవారు హనీయులుగా మారుటకు అవకాశమున్నది.

* సాధకుడు ఆధ్యాత్మిక శక్తిని క్రమక్రమంగా పెంపొందించుకునేందుకు ప్రయత్నించాలి. దానివలన బలమైన పునాదులేర్పడతాయి. తక్కువ శక్తిగల విద్యుద్దీపమునకు ఎక్కువ శక్తిగల విద్యుత్తును పంపించిన అది యే విధంగా పేలిపోవునో, ఆ విధంగానే శరీరము ఒక్కసారే ఎక్కువ ఆధ్యాత్మిక శక్తిని తట్టుకోలేదు.

* కొంత ఆధ్యాత్మిక శక్తిని సంపాదించిన సాధకుడు నిత్యసాధన వల్ల ఆ శక్తిని పెంచుకుంటూ అది తగ్గిపోకుండా జాగ్రత్త పడవలెను. తన వస్తువులు యితరులు వాడకుండా చూసుకోవాలి. తను యితరుల వస్తువులను వాడకూడదు. తను యితరులను అనవసరంగా తాకకూడదు. ఇతరులు తనను తాకకుండా చూసుకోవలెను. పాదరక్షలు లేకుండా నేలమీద నిలబడటము గాని, గుడ్డ లేకుండా నేల మీద కూర్చోవటం గాని చేయరాదు. విద్యుత్తును ప్రసరించు వస్తువులను తాకరాదు.

చూడగానే పవిత్రమైన భావన కలిగేటట్టుగా దుస్తులను ధరించాలి. సాధకులు కాని
వారింట విద్రించినా, భుజించినా వారి కర్మ సాధకులకు సోకి శక్తిని తగ్గించును.

* మనసారా, నోరారా ఆర్తిగా తృప్తిగా చేసే సంకీర్తన చాలా ముఖ్యమై
నది. అధ్వర్యుడు పాడిన చరణాన్ని తక్కిన వారందరూ ఒకే గొంతుతో పాడాలి.
సంకీర్తన చేసే సమయంలో పాడుచున్న చరణము యొక్క భావము ప్రకటిం
చుచు చేయాలి. భావ ప్రకటనలో కూడిన శృతి పక్వమైన సంకీర్తన హెచ్చు
ఫలాన్ని యిచ్చి వారం దినాల నిన్ను తేజోవంతముగా చేస్తుంది.

* సాధకునకు ప్రబలమైన మనశ్శక్తి పెరుగుతుంది. అయితే అన్నిటికి అ
మనశ్శక్తిని ఉదారముగా వాడుటకన్నా కొంత మనశ్శక్తినీ కొంత మంత్రమును
లుపుకొనుటవల్ల మనశ్శక్తి అను ద్రవ్యమును మిగుల్చుకొనవచ్చును.

* మంత్రమును ఉపయోగించినను మనశ్శక్తిని మంత్రముతో జతపరచని
యెడల శక్తి చాలనందున ప్రయోజనము తక్కువగా నుండును. మనశ్శక్తిని
ప్రబలముగా నుపయోగించు శక్తిగల వానికి మంత్రములు అవశ్యకములు గావు.

* సాధకుడు మంత్రమును జపము ద్వారా సాధన చేయవలెను. జపము
మూడు (3) విధములు. మొదటిది వాచిక జపము. దీనివలన వాక్శుద్ధి గలుగును.
రెండవది ఉపాంశు జపము. దీనివలన ఏకాగ్రత కలిగి యింద్రియవృత్తులుడిగి ఒక
ప్రత్యేక సాధకునకు గోచరించును. మూడవది మానసిక జపము. దీనివలన క్రమేపీ
మనస్సు మంత్రమూర్తియందు లగ్నమై నిమీలిత నేత్రస్థితిలో ఆనందానుభవ
మేర్పడును.

సాధకుడు వాచిక జపముతో ప్రారంభించి ఆ మంత్రముమీద పట్టు సంపా
దించి ఉపాంశుజపము ద్వారా ఏకాగ్రతను సాధించి మానసికజపము ద్వారా మోక్ష
మార్గాన్ని సుగమం చేసుకోవాలి.

* సాధకుడు బ్రాహ్మీ ముహూర్తము నుండి మొదటి యామము అనగా
సూర్యోదయమునకు రెండు గంటల ముందునుండి 9-00 గంటలలోపల సాధన
చేయవలెను. జపాభ్యాసము దృఢ పడుటకు 'చల జపము' అనగా తిరుగుచు,
త్రాగుచు, నిలుచొని, కూర్చొని, భోగ సమయమున మొదలగు సమయములందు



జపమారించుట గొప్పగా సహకరించును. జపాభ్యాసము అయిన తరువాత ఒక స్థిర
మైన ఆసనమున, నిర్ణీతమైన సమయమున 'అచల జపము' ఆచరించవలెను. నిష్క
లంక భక్తితో సుఖాసనమున లేక పద్మాసనమున తూర్పు, ఉత్తర, ఈశాన్యదిక్కుం
కభిముఖముగా కూర్చొని నియమిత సమయములలో నిర్దిష్టముగా ఒడుదుడుకులు లేక
జపమాచరించవలెను.

* సాధకుడు ఆత్మస్తుతిని, పరనిందను పరిత్యజించవలెను.

* ఆలయములందు జరుగు దైవ కార్యములలో పాల్గొనవలెను. ఆ సమయ
ములో నుద్భవించిన ఆధ్యాత్మిక శక్తి అనంతముగా నుండును కనుక తప్పనిసరిగా
పాల్గొని తక్కినవారిని ఉత్తేజపరచి అందరకూ ఆ శక్తి లభ్యమయేటట్టు సేవ చేయ
వలెను.

* తరచుగా ఆధ్యాత్మిక చింతన గలవారితో సత్సంగము చేయవలెను.

ఇప్పటికి పాఠకునికి ఒక ముఖ్య సందేహంవచ్చి ఉంటుంది. జపము,
ధ్యానము చేయవలసిన మంత్రమును ఎన్నుకునే స్వేచ్ఛ సాధకునికి ఉన్నదా! లేక
గురుముఖంగా ఉపదేశము అయిన తర్వాత సాధన చేయవలెనా! అని గురువు అన్న
పదానికి అర్థం యీనాడు గురువులుగా చెలామణీ అవుతున్న వారిలో చాలామందికి
తెలియదు. గురువును కోరేముందు శిష్యుడు కాగోరేవాడు తన అర్హతను పరీక్షించు
కోవాలి. శంఖంలో పోస్తేగాని తీర్థం కానట్లుగా గురుముఖంగా ఉపదేశం పొందితే
గాని సాధన పరిపూర్ణంగా ఫలించదు. ఇది మాత్రం నిజం. అందుచేత గురువును
వెదుకుతూ యీలోగా ఆంజనేయస్వామిని గురువుగా ఎంచి సాధన చేస్తుంటే ఆయన
నీలో ప్రేరణ కలిగించి నీకు నిదర్శనాలతో నీవు ఆచరించవలసినవి తెలియజేస్తుం
టాడు. సమయం వచ్చినప్పుడు నీకు గురువును ఆయనే పంపుతాడు. అంతవరకు
ఉధృతంగా సాధన చేస్తూనే ఉండాలి. మనం గుర్తించడము లేదుగాని మనలోనే
నిజమైన గురువులున్నారు. వారిని జాగ్రత్తగా పరిశీలిస్తేగాని బయటపడరు. భగ
వంతుని ప్రేరణతో వారే నిన్ను వెదుకుకొని వస్తారు.

— : సర్వేజనా సుఖినోభవంతు : —

—0—

ధార్మికమైన ఆధ్యాత్మికమైన జీవనం గడిపేవారికి—రక్షగా వారి మార్గాన్ని సుగమం చేసే—ఆచార్యునిగా అంజనేయస్వామి చిరంజీవియై ఉన్నాడు.

అటువంటివారికి—సరి అయిన సమయములో

—సరి అయిన ఆదేశాలనిస్తూ

—తన ఉనికిని వారికి తెలియజేస్తూ

వారి చేత వారే ఊహించలేని కార్యములు చేయిస్తున్నాడు.

అయితే ఆ 'అనుభూతిని' పొందినవారు యే మాత్రం విర్రవీగినా, వారిని తన అనుబంధ-బంధమునుండి దూరంచేసి రసంలేని చెరుకుగడలా విప్పయోజకుల్ని చేస్తాడు. కనుక ఏమరుపాటునకూడ స్వామితో బంధం త్రెంచుకోకూడదు. 'స్వామి' దయలేనిదే 'తండ్రి'ని చేరలేము.

దాసోహం—తవ దాసోహం

దాసోహం—తవ దాసోహం

దాసోహం—తవ దాసోహం.



సంకలన కర్త గురించి...

—చేతులారంగ శివుని పూజించడేని.
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువడేని
దయయు సత్యంబు లోనుగా తలపడేని
కలుగ నేటికి తల్లుల కడుపు చేటు—।

ఈ పద్యానికి ఉదాహరణగా కనబడే శ్రీ కొమ్మూరు ఉమాప్రసాద్ గారు విశాఖపట్నం పోర్టుట్రస్టులో కేషియర్‌గా మనకు అగుపించరు, కనిపించరు. తే 15-3-1946 దిన విజయనగరములో శ్రీ భాస్కరరావు, శ్రీమతి వెంకటరత్నం దంపతులకు జన్మించిన ఉమాప్రసాద్ విశాఖపట్నం పోర్టుట్రస్టులో చేరిన తరువాత అన్ని సాంస్కృతిక ప్రక్రియలలోనూ ప్రవేశము, ప్రతిభ కనబరచిన పిదప 1977లో హరినామ సంకీర్తనమునకు తనను తాను పూర్తిగా అర్పించుకొని ఆ జీవితమార్గములో తన దృక్పథాన్ని అంకితం చేసుకొని, శ్రీ మారుతీ సంకీర్తన బృందాన్ని స్వయముగా నెలకొల్పి తిరుమల తిరుపతి, భద్రాచలము వంటి ముఖ్య పుణ్యక్షేత్రములతో కలిపి ఆంధ్రరాష్ట్రమంతటా 3000లకు పైగా సంకీర్తనములు నిర్వహించిన ఉమాప్రసాద్ స్వతహాగా సరళ సౌమ్య సుగాత్రులు. 5 కోట్ల శ్రీరామ నామ రత్నములను భక్తులనుండి సేకరించి శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులవారి ఆధ్వర్యవములో సామూహిక శ్రీరామ కోటి లిఖిత మహాయజ్ఞము భారీయెత్తున శుభప్రదముగా నిర్వహించి బుధజన విధేయులై ఆ శ్రీరామ నామ రత్నములను శ్రీజ్ఞానానంద ఆశ్రమమునందు శ్రీరామకోటి స్థూపములో నిక్షిప్త పరచగలిగిన మహాభాగ్యము దక్కించుకొనగలిగిన పిదప సుమారు 4సంవత్సరములు పరిశ్రమించి ఆధ్యాత్మిక తత్వబోధనలో పూజనీయులైన శ్రీ గోస్వామి తులసీదాసు, శ్రీ కంచికామకోటి పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ జయేంద్ర సరస్వతి స్వాములవారు, శ్రీ అరవిందులు, శ్రీ జగన్నాథ పండితరాయలు, స్వామి [illegible]నంద, శ్రీ లక్ష్మణయతీంద్రులు, శ్రీ గౌతమబుద్ధుడు, రాబర్ట్ [illegible] గోమరి, విన్సెంట్ షీన్, మహాత్మాగాంధీ, సంత్ కేశవదాస్ జీ మొదలైన ఎం[illegible] మహామహుల ఆధ్యాత్మిక ప్రబోధ పుష్పములను సమీకరించి సుగంధ భరితమైన [illegible]దండను గుచ్చి కూర్చి యీ 'ఆధ్యాత్మిక దర్పణం'లో పొందుపరచిన శ్రీ ఉమాప్రసాద్ గారు ఆ పూలదండలో కనిపించని దారంలా ప్రకాశించగలరని యీ పుస్తకము అధ్యయనము చేసినవారు గ్రహించగలరని నా విశ్వాసము.



ఏ.యస్.వి.రమణారావు